




ముఖచిత్రం : దీపశ్రీ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

## నవంబరు నెల భావపరిచయ పోటీ

బహుమానం **రూ. 25-00**







**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.**

*గమనిక :* **వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి అక్టోబర్ 20వ తేదీలోగా పంపాలి**

## అక్టోబర్ నెల భావపరిచయ పోటీ

రూ. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

గొడుగు వుపయోగం

ఇప్పుడు నిరుపయోగం

పి. యతీంద్రనాథ్

తిరుపతి



**GIRI BABU**
PRESENTS



*SREE BRAMARAMBIKA FILMS*

# RANA RANGAM

STORY SCREENPLAY-DIRECTION
**GIRI BABU**

PRODUCER
**K.KESAVARAO**

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు: చక్రపాణి

సంపుటి 52 నవంబరు 1985 సంచిక 5

శరీరంలో ఏ భాగానికి రుగ్మత వచ్చినా, శరీరం మొత్తం అనారోగ్యంతో అశాంతికి గురవుతుంది, అట్లాగే దేశంలో ఏ రాష్ట్రం దెబ్బతిన్నా దేశం మొత్తం అశాంతి వాతావరణంతోనే కలుషితమైపోతుంది. నిన్నటిదాకా పంజాబ్ సమస్యతో మన దేశం తీవ్రమైన వ్యథకు, జాతి సమైక్యతారాహిత్యపు ప్రమాదానికి గురవుతూ అశాంతి వీచికలతో అల్లల్లాడుతూనే వుంది. ప్రజాస్వామ్య పద్ధతిలో ఎట్టకేలకు పంజాబ్‌లో ఎన్నికలు జరిగాయి. అకాలీదళ్‌కు అసెంబ్లీలో సంపూర్ణమైన మెజారిటీ వచ్చింది. దాదాపు మూడింట రెండొంతుల సీట్లు అకాలీదళ్ సాధించింది. కాంగ్రెస్(ఐ) బలం మాత్రం సగానికి సగం సన్నగిల్లిపోయింది. అయితే దీనిని కాంగ్రెస్(ఐ)కి ఘోర పరాజయంగా ఎవ్వరూ అనుకోవడంలేదు. లోక్‌సభలో 13కి 6 సీట్లు కాంగ్రెస్ (ఐ) కి లభించాయి. గత నాలుగేళ్ళుగా పంజాబ్‌లో అల్లర్ల అల్లకల్లోలంలో, అరాచకశక్తుల కరాళ దంష్ట్రాగ్నుల్లో, హింసోన్మాద రక్తపాతంతో, అనుక్షణం భయాందోళనలతో కుతకుతలాడిపోయింది. వర్తక, వాణిజ్య వ్యాపారాలు స్తంభించాయి: వ్యవసాయం కుంటుబడి

పోయింది; టెర్రరిజం స్వైరవిహారం చేసింది. కల్లోలిత పంజాబ్ ప్రపంచం దృష్టిలో పడింది. భారతదేశానికి తీరని తలనొప్పిగా పరిణమించింది.

దీర్ఘకాలిక వ్యాధిలా ముదిరిపోయిన పంజాబ్ సమస్యకు నిర్మాణాత్మకమైన పరిష్కారమార్గాన్ని చూపెట్టిన మన ప్రియతమ ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ కృషిని ఆధునిక భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో ఎక్కించవచ్చు. ఎన్నికలకు ముందు వాతావరణం అతి భయంకరంగా వుంది. టెర్రరిస్టులు విజృంభించారు. ఎన్నికలు జరపడంవల్ల ఎన్నో ఘోరపరిణామాలు సంభవిస్తాయని, ఎంతోమంది అభ్యర్థులే అమాయకంగా దారుణ హత్యలకు గురవుతారనీ, అకారణ రక్తపాతంతో రాష్ట్రం మరింత అధ్వాన్నమైపోతుందనీ ఎన్నో సంఘాలు, పార్టీలు, ఎంతోమంది వ్యక్తులు తీవ్రంగా హెచ్చరించడం జరిగింది, అయినప్పటికీ ముందుచూపుకూ, దూరదృష్టికీ, ధైర్యసాహసాలకూ, విచక్షణాజ్ఞానానికీ అచిరకాలంలోనే పేరెన్నికగన్న శ్రీ రాజీవ్‌గాంధీ రవ్వంత వెనుకంజ వేయలేదు. షెడ్యూలు ప్రకారం ఎన్నికలు జరిపించారు. ప్రజాస్వామ్యానికి ఉదోదయం కలిగింది.

ప్రజల జీవితాలతో దారుణంగా చెలగాటమాడిన టెర్రరిస్టుశక్తులు ఘోరపరాజయాన్ని పొందాయని చెప్పవచ్చు. ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికల్లో విజయాన్ని సాధించిన అకాలీదళ్ ప్రభుత్వం పంజాబ్‌లో శాంతిభద్రతల్ని నెలకొల్పడానికి, రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి అన్నివిధాలా పాటుపడగలదని విశ్వసించవచ్చు. వ్యావసాయికంగా ఎంతో ముందంజ వేసి, భారతదేశపు సస్యవిప్లవానికి శిరోమణిలా నిల్చిన పంజాబ్ అతిత్వరలోనే వ్యవసాయికంగా, పారిశ్రామికంగా మరింతగా ముందంజవేయగలదని విశ్వసిస్తున్నాం. ఇందుకు రాష్ట్రంలో శాంతిభద్రతలు నెలకొనాల్సిన అవశ్యకత ఎంతైనా వుంది.

---



శివసుబ్రహ్మణ్యం పధ్నాలుగేళ్ళ క్రితం డి.ఇ.వో. ఆఫీసులో ఎల్డీసీగా చేరాడు. బి.ఎ. సెకండ్‌క్లాసులో ప్యాసయ్యాడు. ఆ మధ్యనే ప్రయివేటుగా కూర్చుని ఎం.ఎ. హిస్టరీలో పోస్టుగ్రాడ్యుయేట్ కూడా అయ్యాడు. ఉద్యోగంలో చేరాకనే సెప్షు లోయర్, హైయ్యర్ కూడా పూర్తిచేశాడు. విధి నిర్వహణలో నిప్పులాంటి మనిషి. కుర్చీకి అంటుకుపోయి పొద్దస్తమానమూ తలెత్తకుండా తన పని తాను చేసుకుపోయే చిత్తశుద్ధిగలవాడు. అందుచేతనే పధ్నాలుగేళ్ళ నుంచీ కుర్చీ, టేబులూ మారకుండా ఒకే సీటుకు అంకితమైపోయి పనిచేస్తున్నాడు శివసుబ్రహ్మణ్యం.

శివసుబ్రహ్మణ్యం లంచాలు పుచ్చుకోడు; ఎవరైనా కాఫీ తాగుదాం రమ్మన్నా పోడు; రెండు అరటిపండ్లు ఇచ్చినా నిర్మొహమాటంగా వొద్దంటాడు. ఆఫీసు పని విషయంలో పై అధికారి ఏం చెబితే అది చేస్తాడు. గానుగెద్దులా పని చేయడమే అతని ప్రవృత్తి. ఆఫీసు టైం మించిపోయినా చేతిలో పని కానిదే కుర్చీలోంచి లేవడు. అతను పెళ్ళాంకి తాళికట్టాడా, ఆఫీసు కుర్చీకి తాళికట్టాడా అని తోటి ఉద్యోగులు అప్పుడప్పుడూ ఎగతాళిచేస్తూ వుంటారు. అయినా ఏమీ అనుకోడు.

అతనికంటె ఆరేళ్ళ వెనుక అదే ఆఫీసులో ఎల్డీసీగా చేరాడు సత్య సుందరం. అతను చదివింది కేవలం ఇంటర్మీడియట్. టైపు రాదు; షార్ట్ హ్యాండ్ రాదు. పది పంక్తులు తప్పుల్లేకుండా డ్రాఫ్ట్ రాయలేడు. అర్ధగంట సేపు కుర్చీలో కూర్చోలేడు. పై ఆఫీసరు గజిబిజిగా నోట్‌ఫైలుమీద రాస్తే, దాన్ని అర్థంచేసుకోలేడు. కరెంట్ ఫైలుకు రిఫరెన్స్‌లు ఫ్లాగ్‌లు గుచ్చి ఎట్లా అమర్చాలో తెలీదు. అయినప్పటికీ ఎల్డీసీనుంచి, యు.డి.సి. అయి, డిప్యూటీ స్కూళ్ల ఇన్‌స్పెక్టరు చేసి, మరో ప్రమోషన్ పొంది అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరయ్యాడు సత్య సుందరం.

అదెట్లా సంభవం?



*అది పెరిగే ప్రాయం గదా? నా కర్థమవుతుందిగా, వయసులోని ఆడపిల్లకు ఎంత యిబ్బందో—తల్లిని గదా మరి.*

# "మా అమ్మాయి కోసం కేర్‌ఫ్రీ ఎందుకు ఎంచుకున్నానంటే"

నిజానికి ప్రతి తల్లికీ తెలుసు అసలు, వయసొచ్చిన కొత్తల్లో, ఆ తరుణంలో, ఆడపిల్లకు ఎలా వుంటుందీ అన్న సంగతి—బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగెట్టే ఆ తరుణంలో పడే తొట్రుపాటు, ఏదోలా అనిపించే ఆ యిబ్బందీను.

తల్లిని గదా, నేనూ ఒకప్పుడు ఆ వయసులో వున్నదాన్నే గదా, తెలుసును నాకందుకే. మరందుకే తెలుసును నాకు నెలలోని ఆ అయిదు రోజులూ పడే యిబ్బందీ, తొట్రుపాటూను.

నేనైతే ఎప్పుడూ ఆ అయిదు రోజులకోసం యింట్లో తయారు చేసుకున్నదే వాడేదాన్ని. ఎంత ఎబ్బెట్టో చెప్పలేనిక—అదంతా ఉతకడం, ఆరెయ్యడమూను.

అదంతే సంగతి, యిన్నేళ్ళబట్టీ యింట్లో తయారుచేసిన దాన్నే వాడేదాన్ని, ఎంతో ఎబ్బెట్టుగా వుండేది—అదంతా ఉతకడం, ఆరెయ్యడమూను.
ఆ 5 రోజులూ మళ్ళీ వచ్చాయండోయ్ అని చుట్టుప్రక్కల వాళ్ళందరికి తెలిసేలా

చెప్పినట్టుండేది. మరి ఎంతెంతో అసౌకర్యంగా వుండటం...పూర్తిగా రక్షణ వుందనే భరోసా ఉండేదే కాదిక...
ఎప్పుడు ఏ 'ఉపద్రవం' చటుక్కుని జరుగుతుందోననే భయం—మీ కర్థమవుతుంది అదేదో, నేనేం అనదల్చుకున్నానో.

అయితే యిప్పుడు నాకు క్రమేణా అలవాటైపోయింది అనుకోండి, యింట్లో చేసింది వాడటం. అయినా మా కాలంలో అంతగా పట్టించుకునేవారు కాదు. ఎందుకంటే, ఆ అయిదు రోజుల్లో మమ్మల్నసలు బయటకు వెళ్ళనిస్తే గదా?

**మారేయి రోజులు యిప్పుడు—యీ కాలపు ఆడ పిల్లలు, నెలలో యిబ్బంది పెట్టే ఆ అయిదు రోజుల్లో కూడా చలాకీగా ఉండాలనుకుంటారు.**

మారేయి రోజులు యిప్పుడు! వచ్చింది మార్పు, యీ కాలంలో కేర్‌ఫ్రీలాంటి ఆధునికమైన, రక్షణనిచ్చేది వుంది గదా. ఆడపిల్లగా నేను పడ్డ అవస్థ, యిబ్బంది మా అమ్మాయి కూడా పడాలనుకోవడంలో ఏం అర్థం వుంది గనక. అదేగాక మా అమ్మాయి యిప్పుడుండే కాలానికి మా కాలానికి బోలెడంత తేడా వుంది. నెలలో ఆ 5 రోజులు కూడా సరదాగా చలాకీగా వుండాలనుకుంటారు యీనాటి ఆడపిల్లలు మా అమ్మాయి సంగతే చూడండి—మేం ఆ కాలంలో చేసిన దానికన్న ఎంతెంతో చేసి నిలదొక్కుకోవలసి వస్తుంది...చదువేమిటి, యితర కార్యక్రమాలేమిటి, ఒకటి కాదయ్యో. అది కాకుండా, ఏ వయస్సులో ఆ ముచ్చట వుండాలని నా ఉద్దేశ్యం—ఆ కాలంలో మాలాగ యింట్లో కూర్చోవడం కాదు.

అందుకే మరి మా అమ్మాయికోసం ఎంచుకున్నా కేర్‌ఫ్రీ. తను ఏం చేయదల్చుకున్నా నిస్సంకోచంగా చేస్తూ, ఆ భద్రతని పొందుతూ సంబాళించుకోవాలని.

మరి దాని కోసం కేర్‌ఫ్రీ కన్నా మించినదేముందని! కేర్‌ఫ్రీ అన్నది రెడీ-మేడ్ నేప్కిన్, వాడటానికి ఎంతో వీలు, మార్చడానికి వీలు. బట్టల్ని మడత పెట్టి, దాన్లో పత్తి పెట్టి బొవరబందీగా సమయం వృథా చెయ్యనక్కర్లేదు. తల్లిగా నేను ఆలోచించేది ఏమిటంటే కేర్‌ఫ్రీ ఆరోగ్యరీత్యా మరింత శుభ్రమైనదని.

కేర్‌ఫ్రీ వుంది గనక, యిక మా అమ్మాయి, ఉతకడం, ఆరబెట్టడం అనే యిబ్బందిలో పడక్కర్లేదు. ప్రతిసారీ కొత్త శుభ్రమైన, తాజా నేప్కిన్ వాడటమే.

మొదట్లో అయితే యీ రెడీ-మేడ్ నేప్కిన్, అవసరమైన ఆ రక్షణ యివ్వగలుగుతుందా అని సంకోచించా—యిప్పుడు మరి మా అమ్మాయి కొంతకాలంగా వాడుతోంది దీన్ని. నాకు తెలిసిందేమిటంటే, పీల్చుకునే లక్షణం ఉండటానికి, సానిటరీ నేప్కిన్ అనేది అంత పెద్దదిగా, మందంగా ఉండనవసరం లేదనీ—ఒక అమ్మాయిని యిబ్బంది పెట్టే అవాంతరాలనుంచి రక్షణ యివ్వడానికీను. మా అమ్మాయే అంటుంది గదా తనకిది ఎంతెంతో సౌకర్యంగా, భద్రంగా ఉందని... బయటకు వెళ్ళినప్పుడు గూడాను. అందుకే మరింక మా అమ్మాయిని గూర్చి యిక బెంగేలేదు.

**కేర్‌ఫ్రీ మా అమ్మాయి జీవితాన్ని ఎంతో హాయిగా, తీరుగా చక్కగా వుండేలా చేసిందిక—ఎందుకనంటే అది ఎంతెంతో వీలు గనక.**

నిజానికి, కేర్‌ఫ్రీ మా అమ్మాయి జీవితాన్ని హాయిగా, తీరుగా చక్కగా వుండేలా చేసిందిక—ఎందుకనంటే అది ఎంతెంతో వీలు గనక—నాకూ ఎంతో హాయిగా ఉందిక.
మా అమ్మాయికి, మా కాలంలో మాకు లేనిది యివ్వగలిగానని నాకెంతో సంతోషంగా వుంది. కేర్‌ఫ్రీ సౌకర్యం. కేర్‌ఫ్రీ రక్షణ. మరి మనం కూడా, మారే కాలంతోబాటు మారద్దా యిక.




కేర్‌ఫ్రీ శానిటరీ నేప్కిన్స్—
పూర్తి సౌకర్యం, పూర్తి రక్షణ,
మారుతున్న నేటి కాలంకోసం.

10 వున్న ప్యాక్‌లోనూ, పాటుపైన 20 వున్నవి, 30 వున్నవి గల ప్యాక్‌లలోనూ దొరుకుతుంది.
కేర్‌ఫ్రీ ఎక్స్‌ట్రా లార్జ్ 10 గల ప్యాక్ కూడా దొరుకుతుంది.

Johnson & Johnson

OBM/5070 TEl

సత్యసుందరం మంచి మాటకారి. అతనికి బ్రతుకంటే ఏమిటో తెలుసు. జీవితసారమూ తెలుసు. జీవితాన్ని ఛాలెంజీగా తీసుకొంటే దాన్ని ఎదుర్కొంటాడు. జీవితంలో విషాదం ఎదురైతే అధిగమిస్తాడు. జీవితం సమస్యల్లో ఇరుక్కుంటే, ఆ సమస్యల్ని పరిష్కరించుకుంటాడు. జీవితాన్ని ఒక గీతంలా భావిస్తే, కులాసాగా పాడుకుంటాడు. జీవితాన్ని ఒక ఆటగా అనుకుంటే, ఆడుకుంటాడు. పై అధికార్లను ఆశ్రయించి తన పబ్బం గడుపుకోవడంలో అందెవేసిన చేయి. అందుచేతనే సత్యసుందరం పదోన్నతిసోపానంలో సునాయాసంగా పైకి పోగలిగాడు. అతని సర్వీసు రికార్డులో అన్నీ పచ్చగీతలే. తన పై అధికారి గుర్రమైనా, గాడిదైనా అత్యంత వినయంతో సేవలు అందించి, మెప్పును పొందుతాడు. తన పై అధికారి నీతిపరుడైనా, అవినీతిపరుడైనా అందుకు అనుకూలంగా నడుచుకొని, 'సెభాష్' అనిపించుకుంటాడు. ఆఫీసు కొలువుకంటె ఆఫీసరు కొలువు ఎక్కువ చేస్తాడు. పై అధికారుల్ని కాకాపట్టడంతోనే ప్రభుత్వోద్యోగంలో పైమెట్లు ఎక్కవచ్చని ఉద్యోగంలో చేరిన మొదటిరోజునే గ్రహించి 'సార్' అనే వూతపదాన్ని అలవర్చుకున్నాడు.

—అట్లాంటి సత్యసుందరం అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరయ్యాక హఠాత్తుగా చిక్కుల్లోపడ్డాడు. ఆఫీసుసొమ్మును గుళ్ళో తీర్థంలాగా సేవిస్తున్నాడనీ, బిల్లు చెల్లింపులకూ, బదలీలకూ, ఆఫీసు స్టేషనరీ కొనుగోలుకూ, చిల్లరమల్లర పనులకూ పర్సెంటేజీరేట్లు ఫిక్స్‌చేశాడనీ మూడుపేజీల అర్జీని సత్యసుందరం మీద పెట్టి, సంతకాలతో డైరక్టరేట్ ఆఫీసుకు పంపారు. అంతేకాకుండా అతను అక్రమంగా ఆర్జించిన ఆస్తుల్ని ఉదాహరిస్తూ ఆ అర్జీకి ఒక జాబితాను అనుబంధంగా చేర్చారు. దానిపై డైరక్టరేట్ నుంచి ఒక జాయింట్ డైరెక్టర్ను నియమిస్తూ ప్రత్యక్ష విచారణకు శ్రీముఖం వచ్చింది. ఆఫీసులో చాలమంది కలవరపడ్డారు; డి.యి.వో.తోసహా. కాని సత్యసుందరం మాత్రం చీమకుట్టినట్లుగా కూడా గతుక్కుమనలేదు.

ఎంక్వయిరీ ఆఫీసరు ఫస్ట్‌క్లాస్ బోగీలోంచి దిగగానే ఒక నల్లటివ్యక్తి అతనికి స్వాగతం చెప్పి, బ్లూ ఎంబాసిడర్ కారులో కూర్చోబెట్టాడు.

"డి.యి.వో. జీప్ ఏమైంది?" అన్నాడు ఎంక్వయిరీ ఆఫీసరు.

"నెలరోజుల్నుంచి రిపేరులో వుంది సార్".

టవున్‌కు కిలోమీటరు దూరంలో వున్న ఓ గెస్ట్‌హౌస్‌లో ఆ ఆఫీసర్ను ఆ నల్లటివ్యక్తి దింపాడు.

"గవర్నమెంట్ గెస్టుహౌస్ బుక్‌చేయమని చెప్పానే!"

"టవున్లో ఇవాళ ఇద్దరు మినిస్టర్లున్నారు సార్. గెస్టుహౌస్ ఖాళీ లేదు. ఇక్కడ అన్ని సౌకర్యాలూ సునాయసంగా లభిస్తాయి సార్" అన్నాడా నల్లటివ్యక్తి.

ఆ గెస్టుహౌస్ అధునాతన వసుపాయాలతో ఎంతో అందంగా, అనువుగా, ఆహ్లాదంగా, అయిదుతారల హోటల్ సూట్‌లా వుంది. ఎంక్వయిరీ ఆఫీసరు సంతృప్తిపడ్డాడు.

ఆ రాత్రి ఏడున్నరకు బేలంటైన్ స్కాచ్‌బాటిలూ, స్పెన్సర్ సోడాలూ ఎంక్వయిరీ ఆఫీసరు ఎయిర్‌కండిషన్డు గదిలోకి చేరాయి. వేయించిన కాజూతో పాటు కనురెప్పలు అల్లల్లాడించాడు ఎంక్వయిరీ ఆఫీసరు. ఆ నల్లటివ్యక్తే సోడా ఓపెన్‌చేసి డ్రింక్ గ్లాసులో పోసాడు. మల్లెపువ్వులాంటి గ్లాస్కో లుంగీతో, పెద్దాపురం సిల్కులాల్చీతో వున్న ఆఫీసరు అరగంటలో అరబాటిల్ ఖాళీచేసి, "స్కాచ్ జెన్యూన్" అన్నాడు మత్తుతో మూతలుపడే కనురెప్పలతో.

"రాయల్ శాల్యూట్‌కోసం ట్రైచేశాను సార్. దొరకలేదు. ఇటీవల టవున్‌కు మంత్రులతాకిడి ఎక్కువైంది." అన్నాడు నల్లటివ్యక్తి.

ఎంక్వయిరీ ఆఫీసరు భోజనానికి కూర్చున్నాడు. టేబుల్‌మీద వెజిటేరియన్, నాన్‌వెజిటేరియన్ వెరశీ పద్దెనిది పదార్థాలు. ఆయనకవి ముప్ఫైఆరు పదార్థాలులాగా కనబడ్డాయి. "వండర్‌ఫుల్" అంటూ మీగడతో మిక్స్‌చేసిన గడ్డపెరుగును మాత్రం రెండుస్పూనులు గొంతులో వేసుకొని, నిషా నషాళానికి తన్నడంతో బెడ్‌మీద వాలాడు.

ఆయన బెడ్‌మీద వాలిన మరుక్షణమే ఓ మృదువైన గాజులచేయి, చెంపల్ని నునుపుగా నిమిరింది. ఆమె రంభా? ఊర్వశా? తిలోత్తమా? మేనకా?— ఎవరు? అనుకున్నాడు ఎంక్వయిరీ ఆఫీసరు, స్కాచ్‌విస్కీ ప్రేరణతో ఉత్తుంగ తరంగంలా బుస్సుమన్న మగతనంతో.

ఆ గది తలుపుల్ని బయటనుంచి మూశాడు ఆ నల్లటివ్యక్తి.

మరునాడు సత్యసుందరంమీద ప్రత్యక్ష విచారణ జరిగింది. సాక్షులు చెప్పడానికొచ్చినవాళ్ళు తడబడ్డారు. ఆ నల్లటివ్యక్తి ఆఫీసరుగారి దగ్గరే వున్నాడు. ఎంక్వయిరీ ముగించుకొని ఆ మధ్యాహ్నమే రైలెక్కాడు ఆఫీసరు.

"నేను సెలవు తీసుకుంటాను సార్" అన్నాడా నల్లటివ్యక్తి.

"అన్నట్టు అడగడంమర్చాను. నువ్వెవరివోయ్?" అన్నాడు ఎంక్వయిరీ ఆఫీసరు.

"నేను మునిసిపల్ కాంట్రాక్టర్నండీ, స్వయానా సత్యసుందరంగారి బావమర్దిని" అన్నాడా నల్లటివ్యక్తి.

ఎంక్వయిరీ ఆఫీసరు కనురెప్పలు టపటపా కొట్టుకున్నాయి – కొన్ని క్షణాలపాటు.

సత్యసుందరం సర్వీసురికార్డు జోలికి ఎర్రకలం పోలేదు. అతనిమీద ఆరోపణలన్నీ నిరాధారమైనవని ఎంక్వయిరీ రిపోర్టులో తేలింది.

*ప్రభుత్వోద్యోగి పనిచేయనక్కర్లేదు;*

*పైరవీలో ప్రావీణ్యం సంపాయిస్తే చాలు.*



# సమాజంలోని మేకవన్నె పులులపై స్వైరవిహారం 'ప్రతిఘటన'

పరాన్నభుక్కులుగా జీవిస్తూ మారణ హోమాలతో ప్రజలను దోచుకుంటూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వ్యక్తులపై కత్తిగట్టి కుత్తుకలు తెగనరికే నరరూప రాక్షసులు పెద్దమనుషుల ముసుగులో పరపతిని పెంచుకుంటూ ప్రభుత్వాలనే గజగజలాడించే విష సర్పాలు మన సమాజంలో కోకొల్లలు. వారికి ఆడ, మగ తేడాలేదు. బీద బిక్కి అన్న జాలే లేదు. అయినకాడికి దోచుకోవడం అందలానికి అర్రులుచాచడం వారి మనోప్రవృత్తి!! అందాకా ఎందుకూ — ఇప్పుడితనున్నాడనుకోండి ... ఇతని పేరు కాశేశ్వరరావు. ముద్దుపేరు కాశి. ఈ ఊళ్లో పేరుమోసిన రౌడీ. సుప్రసిద్ధ ఖూనీకోరు. వర్ధమాన ప్రజానాయకుడు. అదే నియోజకవర్గానికి చెందిన ఓ మంత్రి గారి పేరు కాశియ్య. ఆయన ఢిల్లీలో కూర్చునే కాశీకి మద్దతిస్తూ చక్రం తిప్పుతాడు. కాశీకి ఒక ఉచిత అనుచిత సలహాదారొకరున్నారు. ఆ మహానుభావుని పేరు మహాలింగం. అరిటాకు ముల్లుమీద పడ్డా ముల్లు అరిటాకుమీద పడ్డా ముల్లుకే గాయం తగిలిందని వాదించి ఒప్పించగల లాయరు. ఆ ఊళ్లోనే ఒక గూడెం వుంది. అందులో సోములు నాయకుడు. నాగమ్మ వీరవనిత. కాశీకి–వీళ్ళకు కక్షలు గూడు కట్టుకుపోయాయి. వీళ్ళ సంగతి తర్వాత ప్రస్తావించుకుందాం. ఆ ఊళ్ళోనే ఓ కాలేజీ వుంది. ఇంచుమించు రేపటి నేతల్లా

వెలుగొందాల్సిన లక్షణాలున్న నవయువ రౌడీలు కూడా ఆ కళాశాల విద్యార్థులు. పెద్దా చిన్నా, గురువు దైవం, వావి వరస ఏమీ ఆలోచించరు. కొంగు కన్పిస్తే చాలు గింగిరాలు తిరుగుతారు. పైశాచిక కామానికి ప్రతినిధులు వాళ్లు. ఇలాంటి వాతావరణంతో కలుషితమై రౌడీల ఏలుబడిలో ఉన్న ఆ ఊరి కాలేజీకి తెలుగు లెక్చరర్‌గా మరో చోట్నుంచి బదిలీఅయి వచ్చింది ఝాన్సీ. ఝాన్సీ అందగత్తె. విద్యావంతురాలు. వినయ విధేయతలు ఆమెకు మణి కిరీటాలు. సనాతన సంఘ దురాచారాలు, స్త్రీలపై పురుషపుంగవుల అనాగరిక ఆధిక్యత, స్త్రీలపై అత్యాచారాలు, క్రమశిక్షణారాహిత్యము ఆమెకు జాతశత్రువులు. ఆమె మనసు అభ్యుదయ భావాలకు ఆలవాలం. ఆమె భర్త లాయర్ సత్యమూర్తి. నోట్లో నాలుకలేని పిరికి ప్లీడరు. సత్యమూర్తి తండ్రి రామదాసు. తల్లి సీతమ్మ. తండ్రికి పురాణాల పిచ్చి. తల్లికి మహిళా సంఘాల పిచ్చి. తల్లికి క్షణం తీరికలేని కారణంగా తండ్రే ఇంటి, వంటింటి పనులు చక్కదిద్దుకుని భార్యావిధేయుడై పురాణాలు వల్లిస్తూ కూర్చుంటాడు.

ఆ ఊళ్ళోనే యస్.ఐ.గా పనిచేస్తున్న పోలీసు ఆఫీసరు ప్రకాష్ కూడావున్నాడు. ప్రకాష్ – ఝాన్సీ క్లాస్‌మేట్సు. నీతికి నిజాయితీకి మరోపేరు ప్రకాష్. ఇంకా అక్కడ జడ్జిగారున్నారు. కాళిదాసు ఘాతుకచర్యవల్ల మనస్థిమితంకోల్పోయిన శ్రీశైలం వున్నాడు. వస్తాడు, అతని భార్య కాంతం ఇంకా బోలెడంతమంది విభిన్న మనస్తత్వాల వ్యక్తులున్నారు. వాళ్ళజోలికి ఇప్పుడే పోవద్దులెండి......

పెళ్ళయి మూడేళ్ళయినా చాలాకాలం భార్య మరో ఊళ్ళో ఉండటంవల్ల విరహ వేదన తీర్చుకోవాలనేతపన సత్యమూర్తిలో ఎంతగానో వుంది. పడకగదిలో భార్యగా సహకారాన్నందించే ప్రియ భామిని లక్షణాలు ఝాన్సీలోనూ ఉన్నాయి... పడకగదిలోంచి పాట విన్పిస్తోంది...

"వయసు కోర్టు వారంటూ వలపు కేసు
అరెంటు
ముద్దంటూ తీర్చుకుంటె ముద్దాయే
నువ్వంటు
కౌగిలింతలో నిన్ను ఖైదీచేస్తా
తీయనైన పెదవులతో తీర్పేఇస్తా"

వృత్తిరీత్యా లాయర్ కాబట్టి కోర్టు పరిభాషలో పక్కలోకి రమ్మని వారంటు పంపించాడు భార్యామణికి.ఆయన వలపుల ఉబలాటం తీర్చితీరాలన్నది అతను ఆమెపై ఫైలుచేసిన సూట్. పిలిచిన వెంటనే వయసు కోర్టులోకి రాకుంటే కేసు 'ఎక్స్‌పార్టీ' కొట్టేసి ఆమెను కౌగిళ్ళలో ఖైదీచేయమని తీర్పుఇస్తానంటున్నాడు.

"............ఉత్పలమాలలుఅల్లి
ఊరించేస్తా
చంపకమాలలు విసిరి సాధించేస్తా"

తెలుగుపండితురాలు కాబట్టి చంధోబద్ధమైన వృత్తాలలోనడిచే పద్యాల పేర్లను పూల మాలలుగా మలచి లాయర్‌గారికి జవాబు ఇచ్చింది.

"ఆకాశం కోర్టులో చందమామ
జడ్జిమెంటు
వినకుంటే శిక్ష తప్పదు"

అన్నాడతను హెచ్చరిస్తూ ప్రేమతో.

"సీసపద్యమంటి నా పూలజడను
లాగితే
పెదవి బుగ్గ సంధి కుదరదు"

పడకగదిలో వున్నా కూడా ఆమె ఆలోచనలన్నీ సమాజంలో జరుగుతున్న అక్రమాలు, అన్యాయాలపైనే వుంటాయి

మంత్రి కాశియ్య ఆ ఊళ్ళోని స్థలాలను తన చేజిక్కించుకునేందుకు కాశీ సహాయంతో అక్కడ గుడిసె వేసుకు వుంటున్న గూడెంవాళ్ళను చాప గొట్టి చెవులు మూయిస్తుంటే ఆ విషయం తెలిసిన యస్.ఐ. ప్రకాష్ గూడెం నాయకుడు సోముల్ని ఆస్పత్రిలో చేర్పించి కేసు నమోదుచేసి కాశీని అరెస్టుచేస్తాడు. రాజకీయ నాయకులు, విద్యార్థులు, నిరాహార దీక్షలు, ఊరేగింపులూ లేవనెత్తి పోలీసు అధికారుల్ని తమ గుప్పిట్లో పెట్టుకుని కాశీని విడుదల చేయిస్తారు. ఇదంతా కాశియ్యగారి నిర్వాకం. కాశీ తనను అరెస్టుచేసిన ప్రకాష్ మీద కక్ష గట్టి పట్టపగలు నడిరోడ్డులో ప్రకాష్‌ను హత్యచేస్తాడు. అది కళ్ళారాచూసిన ఝాన్సీ పోలీస్ రిపోర్టిస్తుంది. ఆ కారణంగా కాశీ ఝాన్సీ మీద పగ పెంచుకుని నడిబజార్లో పట్టపగలు ఇరుగుపొరుగు



ఊరు వాడ అందరూ చూస్తూవుండగానే ఝాన్సీని వివస్త్రను చేస్తాడు. అందరూ అసమర్థుల్లా నిలబడిన సమయంలో గూడెం నుంచి నాగమ్మ, శ్రీశైలం వస్తారు. శ్రీశైలం ఆమె మాన సంరక్షణ చేస్తాడు. నాగమ్మ అందరి మొఖానా నిప్పులు చెరిగి ఝాన్సీని తనింటికి తీసుకుపోతుంది. ఇదంతా కళ్ళారా చూస్తూ నిలబడ్డ భర్త సత్యమూర్తి, అత్త, మామ చేసేది లేక ప్రతిమల్లా మిగిలిపోతారు. మర్నాడు కాలేజీకి వెళ్ళగానే తరగతి గదిలో స్త్రీ నగ్న చిత్రాలు వివిధ భంగిమల్లో కొంతలోసహా ఝాన్సీకి దర్శనమిస్తాయి. ఆ బొమ్మలు గీసిన విద్యార్థుల చిత్ర కళా నైపుణ్యాన్ని మెచ్చుకొంటూ – నానా చీవాట్లూ పెడుతుంది. అది భరించలేని ఓ విద్యార్థి బెంచీ కర్ర విరిచి విసురుతాడు. ఆమె నుదుటికి తగిలి గాయమైంది. శోకంలోంచి శ్లోకం పుట్టుకొచ్చినట్టు...గాయంలోంచి న్యాయ సముపేతమైన గేయం పుట్టుకొచ్చింది.

"ఈ దుర్యోధన దుశ్శాసన దుర్నీతి
లోకంలో
రక్తాశ్రులు చిందిస్తూ రాస్తున్నా
శోకంతో
మరో మహాభారతం ఆరవ వేదం
మానభంగ పర్వంలో మాతృ
హృదయ నిర్వేదం"

ఆనాడు మయ సభలో ద్రౌపదిని



వివస్త్రను చేస్తుంటే సభలోనివారందరూ నిర్వీర్యులై చూస్తూ కూర్చున్న ఘట్టాన్ని కళ్ళకు కడుతూ ఝాన్సీ వస్త్రాపహరణను మరో మహాభారతంగా సృష్టిస్తున్నారు రచయిత.

"పుడుతూనే పాలకేడ్పు-పుట్టి జంపాల కేడ్పు
పెరిగి పెద్దకాగానే ముద్దుమురిపాల కేడ్పు...
మీ అమ్మల స్తన్యంతో, మీ అక్కల
రక్తంతో రంగరించి రాస్తున్నా ఈనాడే
మీకోసం మరో మహాభారతం"

పుట్టింది మొదలు దేనికో ఒకదానికి తల్లిని కాల్చుకుతింటూ, రక్తాన్ని పీల్చుకు తింటూ, బతికే వ్యక్తులు పెద్దయ్యాక కామాన్ని అణచుకోలేక కీచకులై స్త్రీజాతిని పీడిస్తుంటే దాన్ని సహించ లేని ఝాన్సీ విద్యార్థులకు మానవతా సందేశాన్ని అందించే ప్రయత్నంలో ఈ రచనకు పూనుకుంటుంది.

"కన్న మహా పాపానికి ఆడది తల్లిలాగా మారి-
మీ కండలు పెంచినది ఈగుండెలతో కాదా
ఎర్రని తన రక్తాన్ని తెల్లని నెత్తురు చేసి
పెంచుకున్న తల్లి ఒక ఆడదని మరిచారా"

తెల్లని నెత్తురు అంటే ఇక్కడ పాలు అని చెప్పుకోవాలి.

"ప్రతి భారత సతిమానం చంద్రమతి మాంగల్యం
మర్మస్థానం కాదది మీ జన్మస్థానం-
మానవతకి మోక్షమిచ్చు పుణ్యక్షేత్రం
శిశువులుగా మీరు పుట్టి-పశువులుగా మారితే
మానవ రూపంలోనే దానవులై పెరిగితే
సభ్యతకి సంస్కృతికి సమాధులే కడితే
కన్నులుండి చూడలేని ధృతరాష్ట్రుల పాలనలో
భర్తలుండి విధవలైన ద్రౌపది ఆక్రందనలో
నవశక్తులు యువశక్తులు నిర్వీర్యం అవుతుంటే
ఏమైపోతుంది సభ్య సమాజం
ఏమైపోతుంది మానవ ధర్మం"

ఇంకెన్నాళ్ళకి ఈ ధృతరాష్ట్రుల పాలన నుంచి మనకు విముక్తి లభిస్తుంది అని సూటిగా ప్రశ్నిస్తోంది ఝాన్సీ.

కాశీ నామినేషన్ దాఖలు చేశాడు. అదే సమయంలో ప్రతిపక్షాలను కూడగట్టుకుని ఎన్నికల్లో పోటీచేస్తున్న అభ్యర్థిలా పిచ్చోళ్లను, ముష్టోళ్లను కూడగట్టుకుని శ్రీశైలంకూడా తన నామినేషన్ దాఖలు చేయడానికి వెడతాడు. అధికార్లు తిరస్కరిస్తారు. అయినా తన ప్రచారం ఆపలేదు శ్రీశైలం.

"తందనానా అహ తందనానాపురే
తందనానా భళా తందనాన
గూండాలకే ఓటు-రౌడీలకే సీటు
దేశానికే చేటు తందనాన
పిచ్చోడి హెచ్చరిక-మీరంత కాదనక
చూడాలి అంతు ఇక-చెయ్యండి శాస్తి ఇక"

"ఓటు అడిగేవాడు మీటింగు పెడతాడు
సీటు అడిగేవాడు ఛీటింగు చేసాడు
మంత్రి కావాలంటే మర్డర్లు చేస్తాడు
వీటేసి నాయాల్ని బొక్కలో తొయ్యండిరో..."

ప్రత్యర్థి ప్రాణాలు బలితీసుకుని పదవి నలంకరించే బడాచోర్ల గుట్టు రట్టు

# రేపటి వసంతం



వసుంధర

"సరూ....హాయ్ సరూ....ఓహ్ నేననుకున్నది సాధించాను హాయ్. హాయ్" అంటూ భరత్ సరోజని రెండుచేతులతో ఎత్తి గిరగిర తిప్పాడు.

"భరత్....ఓ భరత్....వదులు....నన్ను వదులు—నా కళ్ళు తిరుగుతున్నాయ్" భరత్ చేతుల్లో ఉన్న సరోజ అంది.

"ఊహూ....నేను వదలను. ఈ క్షణం నాకు అన్ని లోకాలు జయించినట్లుగా ఉంది—" భరత్ ఇంకా జోరుగా తిప్పుతూ అన్నాడు.

"ప్లీజ్ భరత్ వదులు....అబ్బా నా కళ్ళు తిరుగుతున్నాయ్" అతని చేతుల్లో ఉన్న రెండు కాళ్ళను గట్టిగా విదిలించడం మొదలుపెట్టింది.

"భరత్ ఆయాసపడుతూ సరోజని కిందకు దించాడు. సరూ తూలిపడబోయింది. భరత్ ఆమెను గట్టిగా పొదవి పట్టుకున్నాడు. "సరూ! ఇన్నేళ్ళ నా కష్టం ఫలించింది. నా సాధనకు సమ్మానం దొరికింది నా యూత్ ఫార్ములా..." అంటూ గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

సరోజ పరవశంగా అరమోడ్పు కనులతో భరత్‌వంక చూసింది. ఆమె కళ్ళకింద మరోసారి చుంబించాడు భరత్.

ఇంతలో కాలింగ్‌బెల్ వినిపించడంవల్ల ఒకరినొకరు విడిపడి దూరమయ్యారు. భరత్ వెళ్ళి తలుపు తెరిచాడు.

"భరత్‌బాబూ! అమ్మగారు మిమ్మల్ని రమ్మంటున్నారు—" అన్నాడు అక్కడ నౌకరుగా పనిచేసే రంగన్న.

"సరూ! నీవుకూడ మా ఇంటికి రా— మన ఇద్దరం తాతయ్యా—అమ్మలకు మన సక్సెస్ గురించి చెబుదాం—" అంటూ కొంచెం దూరంలో ఉన్న గూటి లోంచి తాళం చేతిలోకి తీసుకున్నాడు.

"మరోసారి వస్తాను.... నీవు వెళ్ళు" అంది సరోజ తన బాగ్ని తీసుకుంటూ.

"ఊహూ...ఇవాళ ఊరుకునేది లేదు. ఈ మధ్య అమ్మకూడ నిన్ను ఎన్నో సార్లు అడిగింది. పద....పద...." అంటూ ఆమె చేతిని పట్టుకుని గబగబా బయటి వరకు లాక్కుపోయాడు.

"తాళం ఇట్లా ఇయ్యండి బాబూ" అంటూ రంగన్న శరత్ చేతిలోంచి తాళం తీసుకుని తలుపులన్నీ మూసి తాళం వేసాడు. ముగ్గురు బయలుదేరారు. శరత్కి విషయం తాతకు తల్లికి ఎప్పుడు చెబుదామా అని ఉంది. లాడ్జికి ఇంటికి మధ్య పెద్ద తోట ఉంది. తోటనిండా చెట్లు ఉండటంవల్ల ఆ ప్రదేశం అంతా ఎంతో అందంగా ఉంది. ఎదురుగుండా కనిపిస్తున్న రెండంతస్థుల మేడ ముందున్న ప్రాంగణంపై సరూ దృష్టి నిలిచింది.

"శరత్.... మీ ఇంటిముందున్న గులాబీచెట్లనిండా పూలు ఎంతో అందంగా కనిపిస్తున్నాయి కదూ...." అంది సరూ ఎంతో సంతోషంగా.

"ఈ మధ్య తాతయ్య కొన్ని కొత్త వెరైటీలు తెచ్చిపెట్టాడు. అమ్మ సంరక్షణలో అవి ఇంత ఏపుగా పెరిగాయి—" అన్నాడు శరత్ కాలర్ సర్దుకుంటూ—

ముగ్గురూ గేటు తెరుచుకుని లోపలికి ప్రవేశించారు

ముందు వరండాలో శరత్ తాతయ్య అయిన జగన్నాధరావు కుర్చీలో పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు. ఆ పక్కనే మరి కొంచెం దూరంలో శరత్ తల్లి అయిన శకుంతల స్వెట్టర్ అల్లుతూ మధ్య మధ్యలో గేటువంక చూస్తోంది.

"నాన్నా...అదుగో శరత్ వస్తున్నాడు—" అంది శకుంతల.

"తాతయ్యా..." శరత్ [illegible] వచ్చాడు.

"ఒరేయ్....[illegible] సరియైన [illegible] ఉంది అని [illegible] సార్లు చెప్పాలా? [illegible]..." [illegible] రావు పేపరును పక్కన [illegible]

"[illegible]..." అంటూ శకుంతల స్వెట్టర్ని పక్కనే ఉన్న టీపాయ్ [illegible].

"కూర్చోమ్మా సరూ...." అన్నాడు రావు.

భరత్ సరూలు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు.

"తాతయ్యా....నీ మనసులో అనుకున్నది సాధించావు." భరత్ రావు మెడలో రెండు చేతులూ వేస్తూ అన్నాడు.

"చాలా సంతోషం నాయనా... భగవంతుడి దయవల్ల నీవు అనుకున్నది సాధించగలిగావ్. అమ్మాయ్ శకుంతలా చూసావా నీ కొడుకు ఎంత ఘటికుడో ...." రావు ముసిముసిగా నవ్వుతూ భరత్ రెండుచేతులను ముద్దుపెట్టుకున్నాడు.

"బాబూ భరత్ నాకెంతో ఆనందంగా ఉందిరా ... ఇదంతా మీ తాతయ్య ఆశీర్వాదం. ఆనాడు మా నాన్న ఆదరించకపోతే_మనకింత నీడ ఇవ్వకపోతే.... మనం ఏమయ్యేవాళ్ళమో_" శకుంతల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అమ్మాయ్... శకుంతలా ఇంకేమీ చెప్పకు. గతాన్ని తవ్వుకోవద్దని ఎన్నిసార్లు చెప్పాను_అందులో భరత్ ఉండగా_" అన్నాడు రావు.

"అమ్మా - అసలెప్పుడూ నీవు దిగులుగా ఉంటావ్. మా అమ్మ కళ్ళల్లో కన్నీళ్ళు నేను చూడలేను. నీ కళ్ళు ఎప్పుడూ ఆనందంలో మెరుస్తూ ఉండాలి. నీ కొడుకు కమిట్మెన్ట్ ఫార్ములా ముందు ఈ ప్రపంచం అంతా తల వంచుతుంది. నన్ను ఓ గొప్ప వ్యక్తిగా పొగుడుతుంది. ఇవాళ నా ఆనందానికి అంతు లేదు. ఏదో - ఏదో చేయాలనిపిస్తోంది. ఏదేదో పిచ్చిపిచ్చిగా ఉంది_" తల్లి కన్నీళ్ళను తుడిచాడు భరత్.

"అబ్బాయీ....నీ ఇష్టంరా. నీవు ఏది చేయాలనుకుంటే అదే చేయి. నీకు అడ్డు ఎప్పుడూ లేదు. శకుంతలా ఏదీ అందరి నోరు తీపిచెయ్యి. నీతోపాటు సరూ కూడా ఎంతో కష్టపడ్డది. మీ అమ్మగారు బాగున్నారా సరూ. శకుంతలా ఇంకా అల్లాగే నిల్చున్నావేమమ్మా....ముందు వెళ్ళి పట్టుకురా.... ఇవాళ సరూ ఇక్కడే భోజనం చేస్తుంది_" అన్నాడు రావు.

"ఇదిగో వెళ్ళి లడ్లు తెస్తున్నా - బాబూ భరత్ ఇవాళ నీ పుట్టినరోజు. తొందరగా వచ్చి భోజనంచేయి అని చెప్పాను కదా_పాయసం చల్లారిపోతోందని రంగన్నని నిన్ను పిలుచుకు రమ్మన్నా_ఇదే రోజు కొన్నేళ్ళ క్రితం..." బాధగా అంది శకుంతల.

"శకుంతలా_" కాస్త గట్టిగా అన్నాడు రావు.

"తాతయ్యా! అసలు మీరు నా దగ్గర ఏదో దాస్తున్నారు మీ బాధను నన్ను కూడా పంచుకోనీయండి. అమ్మా అసలు విషయం...."

"బాధలూ లేవు కష్టాలులేవు. అమ్మా శకుంతలా వెళ్ళి అన్ని ఏర్పాట్లు చూడు. మరి నీ ఫార్ములాని జాగ్రత్తగా దాచావా. అమ్మా సరూ - నీ జాబ్ విషయం ఏమయింది-" అన్నాడు రావు.

కొంచెంసేపు కబుర్లు చెప్పుకున్నాక ఒకరికొకరు కొసరి కొసరి వడ్డించుకుంటూ తృప్తిగా భోజనంచేసి లేచారు. మరి ఇంక నే వెళ్తానంటూ సరోజ వెళ్ళిపోయింది. రావు తన మనవడిని మరొకసారి తృప్తిగా చూసుకొని తన గదిలోకి వెళ్ళిపోయాడు. శకుంతల మనస్సు శరత్‌ని గురించి ఆలోచనలతో నిండిపోయింది. ఆమె మనసు ఆనందంతో ఉప్పొంగింది. కాని ఆ ఆనందాన్ని చెరుస్తూ ఏదో బాధ ఆమెను వేధిస్తోంది. శరత్ రేపటికోసం నిరీక్షిస్తున్నాడు. ఇన్నాళ్ళనుంచి ఆలోచించి-ఆలోచించి, మానసికంగా శారీరకంగా ఎంతో కష్టపడిన ఆ నేడు ఎప్పుడు పూర్తయిపోతుందా అని ఎదురుచూస్తున్నాడు. అతని కళ్ళల్లో ఫార్ములా కనిపిస్తోంది. ఆ ఫార్ములా...అవును అదే ఫార్ములా ఇంతమటుకు ఏ సైంటిస్టులు కనుక్కోలేని ఆ ఫార్ములా తన జీవితంలో వసంతాన్ని నింపబోతుంది. ఆనాటి ఆ వసంతం ఒకటి రెండు మూడు ఇంకా ఎన్నో ఎన్నో రెట్ల ఆనందాన్ని చేకూరుస్తుంది. ఎన్నో రెట్ల మనశ్శాంతినిస్తుంది. ఎన్నో రెట్ల సుఖశాంతులను చేకూరుస్తుంది. ఈ ప్రపంచ వనంలో ప్రవేశించబోతున్న ఆ రేపటి వసంతం ఈ వనానికి వయస్సును పెంచుతుంది. పండుటాకులు అప్పుడే నేలరాలిపోవు. వయస్సు ముదిరిన వృక్షాలు అప్పుడే వాడి ఎండిపోవు. యూత్ ఫార్ములా... అదే రేపటి వసంతం వాటికి ఓ టానిక్. శరత్ ఆలోచిస్తూ తన డైరీని చేతిలోకి తీసుకున్నాడు.

## 2

"రాణీ మాలినీదేవిగారా-నమస్కారం-రండి-రండి-కూర్చోండి-" అంటూ సోఫా చూపెట్టాడు ఆ వ్యక్తి.

"సూర్యనారాయణగారు లేరా-" అన్నది రాణీ మాలినీదేవి సోఫాలో కూర్చుంటూ-

"ఉన్నారు. ఇప్పుడే కాసేపు విశ్రాంతి తీసుకుంటానంటూ పడుకున్నారు-" అన్నాడు సూర్యనారాయణ కొడుకు అయిన రాధాకృష్ణ.

"అర్జెంటు పనిమీద వచ్చా రాధాకృష్ణగారూ! పక్కగదిలోంచి ఏమిటి మాటలు వినిపిస్తున్నాయి. ఇంకా ఎవరయినా ఉన్నారా-" అంది నలువైపులా చూస్తూ మాలినీదేవి.

"అ.... అవును.... మావాళ్ళు ఇద్దరు ముగ్గురు ఉన్నారు. నాన్నగారిని పిలుస్తాను" అంటూ లోపలికి వెళ్ళాడు రాధాకృష్ణ.

మాలినీదేవి పరుసును మరొకసారి తడిమి చూసుకుంది

కొంచెంసేపయ్యాక సూర్యనారాయణ రాధాకృష్ణ వచ్చారు. ఇద్దరూ చెరొక సోఫాలో కూర్చున్నారు.

"నన్ను గుర్తుపట్టారా" అంది మాలినీదేవి సూర్యనారాయణవైపు చూస్తూ.

"మీరు మాలినీదేవి కదూ— మనం కలుసుకుని చాలా రోజులయింది. అన్నాడు సూర్యనారాయణ కళ్ళజోడు సరిచేసుకుంటూ.

"ఏదీ పనుల ఒత్తిడితో ఎక్కువగా ఎవరితోను కలవడం పడటం లేదు. మీతో అర్జంటుగా మాట్లాడాలని ఉన్నపళంగా వచ్చేసా—" అంది మాలినీదేవి.

"ఆ మధ్య మీ వారికి పక్షవాతం వచ్చిందని విన్నాను. ఇప్పుడు ఎట్లా ఉంది—" అన్నాడు రాధాకృష్ణ.

"ఆ రోగం రాకూడదు కాని— వస్తే మాత్రం నయం అవుతుందా— ఎన్నో మందులు వాడాం. ఎక్కడెక్కడినుంచో డాక్టర్లని పిలిపించా—డబ్బును నీళ్ళలాగా వాడా- అయినా లాభంలేకపోయింది—"

"చూడండి మాలినీదేవిగారూ! ఆరోగ్యం ఒక వరం. నేను ఎనభై దాటినా ఎట్లా ఉన్నానో చూడండి. మొదటినుంచి నేను నా శరీరంమీద చాలా జాగ్రత్త తీసుకొనేవాడిని—" అన్నాడు సూర్యనారాయణ నవ్వుతూ.

"ఇంతకీ ఏదో అర్జంటు పని అని అన్నారు. చెప్పండి—" అన్నాడు రాధాకృష్ణ. మాలినీదేవి తన బ్యాగులోంచి కాగితం బయటకు తీసింది. అది బాగా నలిగి పోయి ఉంది. ముందు ఆ కాగితం సూర్యనారాయణ చేతికి ఇవ్వబోయింది. కాని వెనక్కి తీసుకుంది.

"మరి మీరు నేను చెప్పిందానికి సరేననాలి. నే నడిగింది ఒప్పుకోవాలి." అంది కాగితాన్ని సరిచేస్తూ.

"అసలు విషయం ఏవిటో చెప్పండి. నా చేతిలో పనయితే తప్పకుండా మీరడిగిందానికి ఒప్పుకుంటా—" అన్నాడు సూర్యనారాయణ

"అసలు ఏవిటది. ఏముంది అందులో కాటు ఇవ్వండి—" అన్నాడు రాధాకృష్ణ కుతూహలంగా.

"మీ కొడుకు...." అంటూ రాధాకృష్ణవంక చూసింది మాలినీదేవి.

"నా కొడుకా .... వాడికీ నాకు ఏనాడో ఋణం తీరిపోయింది అసలు ఇప్పుడు వాడి విషయం ఎందుకు?" అన్నాడు కోపంగా రాధాకృష్ణ.

"ఏం మనవడు....ఈ...." అంటూ కాగితం ఈయబోయింది.

"నాకు నా మనవడికి, వాడికి వాడి కొడుక్కి ఏనాడో సంబంధం తెగిపోయింది. ఏం మళ్ళీ ఏమైనా రాయబారం పంపించిందా ఆ రాక్షసి–"

"ఇంకా మీ పట్టుదలలు విడవలేదా–" నుదిటిమీది చెమటను తుడుచుకుంటూ అన్నది మాలినీదేవి.

"ఆనాడు మీకు గుర్తుంది కదా– పసికందును తీసుకుని లేచిపోయింది. నా కోడలు అంతే– ఆ నాటితో తెగిపోయింది దానితో సంబంధం–ఇంక దాని ముఖం ఎప్పుడూ చూడదల్చుకోలేదు–" అన్నాడు సూర్యనారాయణ.

"అసలు దాని క్యారెక్టరే మంచిది కాదు. రంకు నేర్చిన ఆడది లేచిపోక ఏంచేస్తుంది. వాడు నా రక్తం పంచుకుని పుట్టిన కొడుకని నేను ఛస్తే నమ్మను–" అన్నారు రాధాకృష్ణ.

"ఇద్దరూ ఆమెను అంతగా దూషించడం ఏమీ బాగాలేదు. ఆనాడు ఆమె పుట్టింటికి వెళ్ళింది. దాన్ని మొగుడు లేచిపోవటం అని కల్పించి చెబితే ఎలా – ఏది ఏమైనా ఇప్పుడు వాడితో మనకు చాలా పని ఉంది. మనకేకాదు. ప్రపంచం అంతటికీ వాడితో ఎంతో అవసరం ఉంది–"

"ప్రపంచం అంతటికి అవసరం ఉండవచ్చు. కాని మాకు వాడు ఒక తుచ్ఛుడి కింద లెక్క. అసలు వాళ్ళు బతికి ఉన్నారంటేనే మాకు అప్రదిష్ఠ ఇంక అసలు వాళ్ళ విషయం ఎత్తకండి మాలినీదేవిగారూ–" ఆవేశంగా అన్నారు రాధాకృష్ణ.

"మీ ఇద్దరికి ఇంత వయస్సు వచ్చాకకూడ ఆవేశం, కోపం తగ్గలేదు. ముందు నేను చెప్పేది వినండి." అంది మాలినీదేవి.

"వాడితో మీకు మాకు ఏమిటి పని. ఇద్దరి దగ్గర లక్షలు–లక్షలు ఉన్నాయి. ఏది కావాలనుకున్నా డబ్బు విరజిమ్మి మనం మనకు కావల్సింది నెరవేర్చుకోవచ్చు. చెప్పండి మీకు ఏం కావాలో. మా సూర్యా 'టాటా' 'బిర్లా'లను మించిపోయింది. ఫారెన్‌నుంచి మాకెంతో డిమాండ్ ఉంది– చెప్పండి మాలినీదేవీ...." అన్నాడు సూర్యనారాయణ

"మనకు కావల్సింది మీ మనవడి దగ్గర తప్పితే మరింకెవరిదగ్గర లేదు–"

"మా మనవడిదగ్గర ఉన్నదేదైనా సరే తుచ్ఛమయిందే. అది మన కక్కరలేదు–"

"మన వయస్సువాళ్ళందరికి కావల్సింది అతని దగ్గరే ఉంది. మీకు నేను



ఎంత [illegible] అయినా ఇస్తా [illegible] తన్నాకొంది. ఇదిగో ఇది ఉంచుకోండి—" అంటూ కాగితాన్ని అతని చేతికి అందించింది.

3

అప్పుడే లోపలికివచ్చిన సరూకి భరత్ ఒక ఎర్రటి గులాబీపువ్వును ఇచ్చాడు. సరూ ఆ పువ్వును జడలో పెట్టుకోకుండా టేబుల్‌మీద పెట్టి అక్కడే ఉన్న కుర్చీలో దిగులుగా కూర్చుంది. రోజూ తను ఇచ్చే గులాబీని, ఇచ్చిన వెంటనే తల్లో తురుముకునే సరు ఈరోజు ఎందుకిట్లా చేసిందా అని అనుకున్నాడు భరత్. సరూ వెనకనుంచి వచ్చి ఆమె మెడమీద చేయి వేశాడు.

"సరూ! ఎందుకిలా! అదోరకంగా ఉన్నావు— హార్ట్ బాగా లేదా—" అంటూ తనే పువ్వును ఆమె జడలో తురిమాడు.

"సరూ! నిన్న రాత్రి ఓ సంఘటన జరిగింది తెలుసా—"

"ఏమిటి ఏం జరిగింది!" ఆదుర్దాగా అడిగింది సరూ—

"నిన్నరాత్రి నేనిక్కడ చదువుతున్నప్పుడు ఫోన్‌కాల్ వచ్చింది." వెనక నుంచి తిరిగివచ్చి సరూ ఎదురుగుండా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు—

"ఆ.... ఆ తరువాత...."

"అందులో ఓ గొంతు నా ఫార్ములా విషయం గురించి అడిగింది_నేను ఏమీ చెప్పలేదు. ఒకవేళ నేను నా ఫస్టు ట్రీట్‌మెంటు ఆ వ్యక్తికి ఇస్తే నేను ఏది కోరితే అది ఇస్తారట. ఆ గొంతునుబట్టి అవతలి వ్యక్తి ఆడో మగో కూడ చెప్పడం కష్టం. ఈ ఫార్ములా విషయం ఎవరైనా పేపర్ల ఎడిటర్లకు గాని తెలియపరచాలా అన్నది ఆ గొంతు. నేను కొంతకాలంవరకూ చెప్పదలుచుకోలేదు అని అన్నా. దానికి ఫస్ట్ ట్రీట్‌మెంటు ఇస్తే ఎంతో డబ్బు ఇస్తానంది. నేను సనేమిరా ఒప్పుకోలేదు_ ఇంక అవతలివాళ్ళు ఏం మాట్లాడినా వినకూడదని ఫోన్ పెట్టేసా. కాని మళ్ళీ రింగ్ చేసింది_"

"మళ్ళీ ఏమంది___"

"ఈసారి నన్ను బ్లాక్‌మెయిల్ చేస్తున్నట్లుగా మాట్లాడింది. 'మీ అమ్మ లేచిపోయిన ఆడది అని అందరికీ తెలుపుతా. ఈ విషయం నీ తండ్రి కూడ ఒప్పుకున్నాడు. పెళ్ళయ్యాక కూడ ఆమె ఒకడితో సంబంధం పెట్టుకుని ఆ తరువాత లేచిపోయిందని అతను ఒప్పుకున్నాడు ఆలోచించుకో - రేపు నీవో పెద్ద సైంటిస్టువని ప్రపంచానికి తెలిసిపోతుంది. దానితోపాటు నీ తల్లి కారెక్టర్‌లేనిది అని తెలిస్తే నీ కెంత అవమానం. అందరూ నీ తల్లిమీద ఛీ అని ఉమ్మేస్తారు, విదేశాలవాళ్ళు నీ తల్లిని ఎంతో హీనంగా చూస్తారు. మన భారతదేశానికి ఎంత తలవంపు. భారతమహిళ అంటే అన్నిదేశాలవాళ్ళకి ఎంతో గౌరవం. కాని నీ తల్లి చరిత్ర విన్నవాళ్ళెవరూ ఇక్కడి పవిత్రతను నమ్మరు. ప్రతి పేపరులో నీ చరిత్ర వస్తుంది. నీవు మందు ట్రీట్‌మెంటు నాకిస్తే నేను ఈ రహస్యాన్ని దాచిపెడతా.... లేదా...' అంటూ బెదిరించింది. నాకేంచెప్పాలో తోచలేదు.... ఫోను పెట్టేసా. కాని ఏదో భయంగా ఉంది_" రెండుచేతులతో నుదిటిమీద బాధతో కొట్టుకున్నాడు భరత్.

"భరత్.... మీ అమ్మగారు ఎంత పవిత్రురాలో ఆమెను చూస్తుంటేనే తెలుస్తుంది. ఎవరో పిచ్చివాగుడు వాగారని నీవు బాధపడతావా? మీ అమ్మగారికి ఈ విషయం చెప్పావా_"

"ఊహూ.... ఎట్లా చెప్పాలో తెలియడంలేదు. ఆమె వింటే ఎంతో బాధ పడుతుంది. అందులో అమ్మకి జ్వరంగా ఉంది. తాతయ్యదగ్గర ఇటువంటి విషయం చెప్పడం బాగుండదని ఊరుకున్నా_ అసలు మన ఫార్ములా విషయం ఎవరిదగ్గర బయటపెట్టలేదు కదా! మరి ఆ ఫోన్‌చేసినవాళ్ళకి ఎట్లా తెలిసిందో_"

"భరత్ .... నన్ను క్షమించు .... ఇందులో నా తప్పు ఉంది_" సమా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"నీవు ఎవరికైనా చెప్పావా-?"

"నా అంతట నేను ఎవరికీ చెప్పలేదు. కాని — లత అనే అమ్మాయి నా డైరీ చదివింది. అందులో ఓ పేజీలో నీ గురించి వ్రాసుకున్నా-" అంటూ క్లుప్తంగా జరిగిన విషయాన్ని భరత్‌కి చెప్పింది సరూ.

"నాకు ఫోన్ చేసింది ఆ లతేనా- లేక ఆమె ఎవరికైనా తెలియబరిస్తే వాళ్లు చేసారా- ఏమో అంతా గందరగోళంగా ఉంది-"

ఇంతలో ట్రిన్-ట్రిన్ అన్న శబ్దం వినిపించింది. భరత్ వెళ్ళి ఫోన్ ఎత్తాడు.

"హలో.... భరత్‌గారేనా మాట్లాడుతోంది-" అంది అవతలి కంఠం.

"ఆ.... అవును. మీ రెవరు-?"

"నాకు మీ ఫార్ములా గురించి తెలిసింది. దయచేసి మీ మొదటి ట్రీట్‌మెంటును నాకివ్వండి. మీ కెంత డబ్బు కావాలో అంతా ఇస్తా-"

"అసలు మీరెవరు?"

"నేనొక డాక్టరును-"

"మీరు నన్ను ఫోర్స్‌చేయడం ఏమీ బాగాలేదు. నేను ఒప్పుకోను-"

"మీరు నాకు ట్రీట్‌మెంట్ ఇచ్చితీరాలి-"

"ఊహూం.... నేను ససేమిరా ఇయ్యను-"

"అయితే ఏయ్ మిస్టర్ విను- నీ తల్లిని గురించిన రహస్యం బయట పెట్టేస్తా-"

"ఏవిటా రహస్యం?"

"మీ అమ్మ నా దగ్గర రహస్యంగా ఎబార్షన్ చేయించుకుంది. అప్పటికే ఆమె భర్త ఆమెను వదిలేసాడు. ఆమెకు ఎవరితోనో సంబంధం ఉండేది- గర్భాన్ని తీయించేసుకోవటానికి నా దగ్గరికి వచ్చింది — ఎబార్షన్ నేనే చేసా-"

"అబద్ధం.... ఇది నిజంకాదు- మా అమ్మ ఎంతో పవిత్రురాలు-" గట్టిగా అరిచాడు భరత్

"నేను చెప్పిందానికి ఒప్పుకోకపోయావో — నీ తల్లి చరిత్ర పేపరు కెక్కిస్తా- నీవు ఆ అవమానం భరించలేక ఉరిపోసుకోవాల్సి వస్తుంది మర్యాదగా నేను చెప్పిందానికి ఒప్పుకో-"

"నేను ఒప్పుకోను.... ఒప్పుకోను-" ఫోన్ పెట్టేశాడు భరత్.

"విన్నావా సరూ...."

"ఆ.... కొద్దికొద్దిగా వినిపించింది_"

భరత్ ఫోనులో జరిగిన సంభాషణ సరూకి చెప్పాడు. కుర్చీలోంచి ముందుకు వంగి టేబుల్ మీద రెండు మోచేతులు ఆనించి రెండుచేతుల్తో బాధగా ముఖాన్ని దాచుకున్నాడు.

"భరత్ నీవు బాధపడితే నేను చూడలేను - కుక్కలు మొరుగుతూనే ఉంటాయి నీవేమీ ఆలోచించకు_"

"ఎవడో.... ఆ నా తండ్రి- అమ్మను వదిలేసిన అతడు ఇప్పుడు కళ్ళి విప్పేనా.... కసితీరా.... మా అమ్మకి ఇంతటి అప్రతిష్ఠ ఆపాదించాడు - ఇప్పుడు నాకు శాంతిలేకుండా చేస్తున్నాడు. ఇవాళ అమ్మని అడిగి అన్ని విషయాలు తెల్సుకుంటా- అమ్మ చెప్పడానికి నిరాకరిస్తే నేను ఎటయినా వెళ్ళిపోతా...."

"భరత్ అసలు విషయం నెమ్మదిగా తెలుసుకో- నీ ఫాక్ట్యూలాకోసం వీళ్ళందరూ బ్లాక్ మెయిల్ చేస్తున్నారేమో...."

ఇంతలో తలుపు అవతలివైపునుంచి ఒకతను కాలింగ్ బెల్ మోగించాడు. సరూ. భరత్ అటువైపు చూశారు-

"మే ఐ కమిన్ సర్_" అన్నాడా వ్యక్తి.

"రండి....రండి...." అంటూ భరత్ లేచి ద్వారందాకా వెళ్ళాడు.

భరత్ వెనకే అతను వచ్చాడు- అతను భరత్ని, లాట్ని ఒకేసారి కలియచూశాడు.

"నేను భారత్ ఎడిటర్ని - నేను మీతో పర్సనల్గా మాట్లాడాలి_" అన్నాడు ఆ వ్యక్తి-

"భరత్ నేను మళ్ళీ కలుస్తా.... ఇంటిదగ్గర పనిఉంది." అంటూ సరూ వెళ్ళిపోయింది. భరత్- ఆ ఎడిటర్ మాట్లాడుతూ కూర్చున్నారు-

## 4

సూర్యనారాయణ ఆ రోజు మాలినీదేవి ఫోనులో చెప్పిన విషయం ప్రకారం 'భరత్' అనే పేపరును తెప్పించి చూసాడు. ఫ్రెంట్ పేజీలో పెద్దపెద్ద అక్షరాలతో పడ్డ న్యూస్ని చదివాడు. ఫొటోను పదేపదే చూసాడు. అతడి ముఖ కవళికలు మారసాగాయి. అతడి ఆశ్చర్యానికి అంతులేదు.

"ఇదిగో ఈ ఫ్రంట్ పేజీలోది చదువు. మనం మొన్నటిదాకా నిజమా- కాదా- అని బుర్రపాడుచేసుకున్నాం. ఆ విషయమే ఇవాళ పేపరులో పడ్డది." పేపరును రాధాకృష్ణకు ఇస్తూ అన్నాడు సూర్యనారాయణ.




రాధాకృష్ణ గబగబా చదవసాగాడు .... చివరలోని ఫోటోను అతడు రెండుమూడుసార్లు పరీక్షగా చూశాడు.

"రాణీ మాలినీదేవి చెప్పిన విషయంమీద ఇప్పుడు నమ్మకం కలుగుతోంది. ఇతడు కనిపెట్టిన ఫార్ములా చాలా గొప్పది. దీని ప్రకారం మనం వదలం."

"రాధాకృష్ణా! మాలినీదేవి చెప్పిన ప్రకారం అతడు మీకేం చేసిందంటావా"

"ఉన్నప్పుడు ఎప్పుడో మనం చూశాం. చెప్పడం చాలా కష్టం. వీడు మీ మనసు కాకపోతే మనది ఎంతో అదృష్టం డబ్బు విరజిమ్మి ఈ సైంటిస్టును మన చేతుల్లోకి తెచ్చుకోవచ్చు. కాని ఒకవేళ వీడే వాడైతే—మనం చచ్చినా వాడిదగ్గరికి వెళ్ళలేం—"

"అవసరాన్నిబట్టి మనం రంగులు మారుస్తూ ఉండాలి. అవసరం వస్తే వెళ్ళక తప్పుతుందా—"

"నాన్నా మీరు దీనికోసం ఇంత దిగజారుతారనుకోలేదు – ఆనాడు శకుంతల ఆమె తండ్రి మనల్ని అన్న మాటలు గుర్తుతెచ్చుకోండి. ఈ నాడు మన అంతట మనం వాళ్ళదగ్గరికి వెళితే ఇంకా ఎంత అవమానం చేస్తారో– అందరికి మనం ఆమెకు క్యారక్టర్ లేదు కనుక వదిలేశాం – ఆమెకు పుట్టిన పిల్లవాడు నా కొడుకు ఎంతమాత్రం కాదని చెప్పాం."

"ఆనాడు అట్లా చెప్పాల్సివచ్చింది కాబట్టి చెప్పా– ఈనాడు మళ్ళీ మనం వాళ్ళని ఆదరించినట్లు నటిస్తే అందరు మనల్ని ఎంతో విశాల హృదయులని

పొగుడుతారు. అటువంటి కులటని కూడ నీవు నీ భార్యవని ఒప్పుకున్నందుకు నిన్ను ఎంతో ఉన్నత హృదయుడవనుకుంటి దీలోకం - మన పూర్వ్యా సంస్థకి ధవమే కాదు మనస్సు కూడ ఉన్నదని మనం నిరూపించినవాళ్ళం అవుతాం."

"మీలో ఆలోచనాశక్తి ఎంతమాత్రం తగ్గలేదు. మరి మనం వెళ్ళాలి అంటే ఎడ్రస్ తెలియాలి కదా-"

"అన్ని విషయాలు నేను చూసుకుంటా - ముందు మనం స్నానంచేసి మన పూర్వ్యామందిరంకి వెళ్దాం.- తరువాత నేను భరత్ దగ్గరికి వెళ్ళివస్తా-ఊ... ఊ... లే..." అంటూ బాత్‌రూమ్‌వైపుకి వెళ్ళాడు.

రాధాకృష్ణ లేచాడు.

## 5

శకుంతల, రావు, భరత్ ముగ్గురు బెడ్‌రూమ్‌లో కూర్చుని కాఫీ, టిఫ్ఫిని తీసుకుంటున్నారు. రావు పేపరులోపడ్డ భరత్ ఫోటోను చూసి మాటిమాటికి చిరునవ్వు నవ్వుతూ మురిసిపోతున్నాడు.

"భరత్ ఇవాళ ఎంత ఆనందంగా ఉందిరా! శకుంతలా వీడి ఫోటో చూశావా- ఎంత పెద్దగా పడ్డడో- ఇన్నాళ్ళకి నా ఆశయం నెరవేరింది- ఇప్పుడు ఇంక నేను కళ్ళుమూసుకున్నా పరవాలేదు. శకుంతలా ఇన్నేళ్ళు నీవు నేను ఈ ఊ:కోసం బ్రతికాం. నా బాధ్యత నేను నెరవేర్చా. చాలు ఈ జీవితానికి ఇంక ఇంతకంటే ఇంకేం కావాలి-"

"నాన్నా- అప్పుడే ఈ లోకం విడిచిపోతానంటే ఎట్లా - ఇంకా మన బాధ్యత పూర్తికాలేదు" అంది శకుంతల నవ్వుతూ-

"అవును నేను మునిమనవడిని ఎత్తుకోవద్దూ- ఒరేయ్ భరత్ నీవు ఒక ఇంటివాడివై పిల్లపాపలతో సుఖంగా ఉండాలిరా-"

"తాతయ్యా- ఏవన్నీ తరువాత, నీవు అప్పుడే హాయిగా కన్ను మూస్తా వంటావేం. నా ఫార్ములా విషయం తెలిసి ఎంతమందో లక్షలు లక్షలు ఇస్తా మంటూ ఫోన్లుచేస్తున్నారు. వాళ్ళకి ట్రీట్‌మెంట్ ఇస్తానంటే ఏమైనా చేయడానికి సిద్ధపడుతున్నారు. నా పరిశోధన ఫలితంగా మానవుడి వయస్సు 180 సం॥లకు పెరిగింది. నా యూత్ ఫార్ములాని ముందు మీ ఇద్దరికి సమర్పించుకుంటా- నా ఫస్ట్ ట్రీట్‌మెంటు ముందు మీ ఇద్దరికి - ఎప్పుడూ మీరు యౌవనవంతులుగా ఉండవచ్చు. 180 సం॥లు బతకనూవచ్చు. తాతయ్యా అమ్మా మీరు ఇంకా ఎన్నో ఎన్నో వసంతాలను చూడవచ్చు."

"భరత్... నేటి ఈ వసంతంతోనే నేను తృప్తిపడ్డా. ఈ జీవితవసంతంలో ఈనాటి ఈ వసంతం ప్రవేశించి ఎంతో ఆనందాన్నిచ్చింది. నా మనస్సనే కోయిల తృప్తిగా ఊపిరి పీల్చుకుంది- హాయిగా పాడుకుంది- నిండుగా నవ్వుకుంది. చాలు బాబూ చాలు- ఈ యూత్ పార్కులా నీకున్నవాళ్ళందరికీ ఉపయోగపడుతోంది అంతే చాలు-" దగ్గుతెర రావడంవల్ల ఇంక మాట్లాడలేకపోయాడు.

"తాతయ్యా! మీలాంటివాళ్ళందరి కోసమే తాతా- నా యూత్ పార్కు అంటే రేపటి వసంతాన్ని కనుక్కుంది. మీ జీవితాలు ఆల్మోస్ట్ [illegible] నట్లే- ఇంతకుముందయితే మీ జీవితాల్లోని రేపు చచ్చిపోయినట్లే- కానీ నేను రాత్రింబవళ్ళు కష్టపడి ఆ రేపును ఇంకా కొన్ని సంవత్సరాలు పెంచా- ఆ రేపటి వసంతాన్ని మీ అందరూ తప్పకుండా అందుకునేలా చేశా. ఆ రేపటి వసంతం మానవుడి గుప్పిటిలోనే ఉంది. ముందు మీ ఇద్దరికి ఈ ట్రీట్‌మెంట్ ఇస్తేనేగాని నాకు తృప్తిగా ఉండదు." అన్నాడు భరత్ తన చేతిలో [illegible] కాలిని సరిగ్గా పెడుతూ-

"భరత్- ప్రతిరోజూ సంతోషంగా మన ఇంటిచుట్టూరా తిరుగుతున్నారంటేనే తెలుస్తోంది నీకు విలువ ఎంత పెరిగిందో. నీవు ఎంత మహానీయుడయ్యావో. ఇంతకుముందు కొన్ని వందల సంవత్సరాల క్రితంనుంచి మానవుడు నిరంతరం ఆలోచించి ఆలోచించి ఏదో క్రొత్తను కనిపెట్టాలని అభిలాష పడ్డాడు. ఎందరో మహానుభావులు ఈ ప్రపంచానికి అంతులేనన్ని విలువగల ఉపయోగపడే సాధనాలని కనుక్కొన్నారు. తక్కువ సమయంలో శారీరకంగా ఎక్కువ కష్టపడకుండా తమతమ పనులు అయ్యే ఎన్నో సాధనాలను కనిపెట్టారు. ఇదివరకు మనుష్యులు జబ్బులతో కృశించి-కృశించి చనిపోయేవారు. కాని ఈనాడు ప్రతి జబ్బును తగ్గించే ఓ మందు ఉంది. ఆనాడు అదని విధిగా యంత్రంలా పిల్లల్ని కనాల్సివచ్చేది. కాని ఈనాడు అక్కరలేదనుకుంటే మానేయవచ్చు. ఆనాటి గొడ్రాలికి ఈనాడు తల్లి అయ్యే అవకాశాన్ని కల్పించింది ఈ సైన్స్. ప్రతిరోజూ ప్రతిక్షణం ప్రపంచంలో ఎవరో ఒకరు ప్రతి సైంటిస్టుకూ మనస్సులో నమస్సులు అందిస్తూనే ఉంటారు. ఆ మధ్య తాతయ్యకు జబ్బుచేసిన విషయం తెలుసుగా- బతుకుతాడనే ఆశ లేదు. కాని చివరిక్షణాల్లో [illegible] కించిన సైన్సే అని అనిపించింది. ఆ మందులు తాతయ్యకు తిరిగి జీవితాన్నిచ్చాయి. అప్పుడు ఎన్నోసార్లు మందుల కనిపెట్టిన ఆ మహనీయులు ఎవరో అనుకుంటూ వారికి మనసారా నేను నమస్కరించేదాన్ని బాబూ రేపు నిన్ను

కూడ ఓ అమ్మ - ఓ చెల్లెలు - ఓ అక్క - ఓ తండ్రి - ఓ అన్న - తలుచుకుంటారు. నన్ను మనసారా దీవిస్తారు. అది తలుచుకుంటే నా హృదయం ఉప్పొంగిపోతోంది. చాలు, నేను పుట్టినందుకు ఇన్నాళ్లు బతికినందుకు నాకీ ఆనందం చాలు" అన్నది శకుంతల కళ్ళల్లోంచి వస్తున్న ఆనందబాష్పాలని తుడుచుకుంటూ.

"నేను మీరు చెప్పిందానికి ఏంతమాత్రం ఒప్పుకోను. మీ రిద్దరూ ఈ విధంగా మాట్లాడటం నాకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. నిన్న ఓ ముసలివాడు- రేపోమాపో చస్తాడనేటట్లు ఉన్నాడు. అతడికి మునిమనవళ్లు కూడ ఉన్నారట-" వస్తున్న నవ్వును ఆపుకుంటూ అన్నాడు భరత్.

ఇంతలో రంగన్న "భరత్‌బాబూ మీకోసం ఎవరో వచ్చారు" అని చెప్పాడు. భరత్ డ్రాయింగ్‌రూమ్‌లోకి వచ్చాడు. లోపలికి వచ్చిన సూర్యనారాయణ సోఫాలో కూర్చున్నాడు. కళ్ళజోడు తీసి రుమాలుతో ఒకసారి అద్దాలని తుడిచి పెట్టుకున్నాడు. భరత్‌ని ఎగాదిగా చూశాడు.

"మీకు 'సూర్యా' సంస్థ గురించి తెలుసుననుకుంటాను."

"అవును తెలియకేం- టాటా .... బిర్లాలను మించిపోయింది కదూ-" అన్నాడు భరత్

"మా ఫ్యాక్టరీలు ఇండియాలో పెద్దపెద్ద సిటీల్లో ప్రతిచోటా ఉన్నాయ్. మా గూడ్స్ చాలావరకు ఫారెన్ కంట్రీస్‌కి ఎక్స్‌పోర్టు అవుతూవుంటాయి- సూర్యాసంస్థ మొత్తం నా చేతిలోనే ఉంది- అ....అసలు విషయానికి వద్దాం-" అంటూ సూర్యనారాయణ గదిచుట్టూరా ఒకటి రెండుసార్లు పరిశీలించి చూశాడు. ఒకవేళ ఇతనే తన మనవడయితే శకుంతలని గాని, ఆమె తండ్రిని గాని ఫొటోలు ఉంది ఉండవచ్చు కదా- అని అనుకున్నాడు. కాని అతనికి అక్కడ అటువంటి ఫొటోలు ఏవీ కనిపించలేదు. ముందు ఫార్ములా విషయం కనుక్కొని డబ్బు ఆశ చూపిస్తే తనకు లొంగకపోతాడా అని అనుకున్నాడు.

భరత్ మనస్సులో ఈ ముసలాయన తన ట్రీట్‌మెంట్‌కోసం వచ్చి ఉంటాడని ఊహించాడు.

"మీ ఫార్ములా విషయం తెలిసింది- తెలిసినప్పటినుంచి నాకు నిద్ర పట్ట లేదనుకోండి ఇంకో మూరేళ్ళ జీవితం నాకుందని తెలిసినప్పటినుంచి నేను భూమిమీద నిల్చోలేకపోతున్నా - ఇన్నేళ్ళ జీవితంలోనే ఎన్నో గొప్పపనులు చేయగలిగా. నా వయస్సు ఇంకా పెరిగితే ఇంకా ఎన్నో చేస్తా - ప్రపంచ చక్రవర్తిని అవుతా-"

"అయితే మీకు ప్రపంచాన్నంతా జయించాలని ఉందన్నమాట

"ఏం జయించకూడదా! నా దగ్గర డబ్బు ఉంది- తెలివి ఉంది- మీ ట్రీట్‌మెంటు పొందాక వయస్సు ఉంటుంది- ఊ....ఊ.... సరే ముందు ఆ ట్రీట్‌మెంటు ఎప్పుడు ఇస్తారో చెప్పండి-" అంటూ అటూ ఇటూ చూశాడు.

"మీ అంతటి గొప్పవారు ఈ సామాన్యుడి దగ్గరికి వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది-"

"మీరు సామాన్యులేమిటండీ- ఇప్పుడు మా అందరికన్న మీరే గొప్పవారు. మా చేతుల్లో ధనం, యంత్రాలు, కార్మికులు మాత్రమే ఉన్నారు. ఇప్పుడు మీ చేతుల్లో మానవుడికి అతి ముఖ్యమైన వయస్సే ఉంది. మీరు ఆకాశం అంత ఎదిగిపోయారు" అన్నాడు సూర్యనారాయణ ముక్కుపొడుం పీలుస్తూ.

శరత్ అతని పొగడ్తకి లోలోపల ఉబ్బిపోయాడు. ఇంతలో పరుగెత్తుకుంటూ వస్తున్న సరూపై అతనిదృష్టి పడ్డది. సరూ ముఖం వాడిపోయి ఉంది. జుట్టంతా రేగిపోయి ఉంది. ఆమె గబగబా శరత్‌దగ్గరిగా వచ్చి ఏడ్వసాగింది. సరూ ఎందుకు ఏడుస్తోందో అర్థంకాలేదు.

"సరూ! ఏంజరిగిండి- చెప్పు సరూ!" అన్నాడు శరత్. సరూ వెక్కి-వెక్కి-ఏడ్వసాగింది.

"అమ్మా....అమ్మా...." అంటూ పెద్దగా కేకవేశాడు శరత్.

లోపలినుంచి శకుంతల వచ్చింది. సరూ- "ఆంటీ....ఆంటీ...." అంటూ శకుంతలను పట్టుకుని ఏడ్వసాగింది.

"ఏం జరిగిందమ్మా!- సరూ చెప్పు-" అన్నది శకుంతల సరూని ఓదారుస్తూ. అప్పటికి ఆమె దృష్టి ఇంకా సూర్యనారాయణమీద పడలేదు. కాని లోపలినుంచి వచ్చిన శకుంతలని చూడగానే సూర్యనారాయణకి కాలికింది భూమి కదిలినట్లుగా అనిపించింది. ఇన్నేళ్ళ తరువాత శకుంతలలో మార్పు రావడంవల్ల సూర్యనారాయణకి మళ్ళీ అనుమానం వచ్చింది. శకుంతల వీపు సూర్యనారాయణవైపు ఉండటంవల్ల మళ్ళీ ఆమె ముఖం చూద్దామనుకున్నా చూడలేకపోయాడు.

తన గుండెల్లో దాచుకున్న సరూ ముఖాన్ని పైకెత్తింది శకుంతల.

"ఆంటీ...." సరు మళ్ళీ పెద్దగా ఏడ్వటం మొదలుపెట్టింది.

"ముందు ఏం జరిగిందో చెప్పు సరూ...." అన్నాడు శరత్.

"అమ్మకి యాక్సిడెంట్ అయింది. ఆఖరి దశలో ఉంది_ అంటీ.... అంటీ ....అంటీ.... మా అమ్మ బతకాలి అంటీ...."

"సరూ! బాధపడకు మీ అమ్మకు తప్పకుండా నయం అవుతుంది_" అంది శకుంతల తన కొంగుతో సరూ కళ్ళను తుడుస్తూ.

"ఇప్పుడు అమ్మ హాస్పిటల్‌లో ఉంది_ అంటీ నాకేదో భయంగా ఉంది_"

"నీకు మేం అందరమూ ఉన్నాం_ భరత్ నేను హాస్పిటల్‌కి వస్తాం పద_" అంటూ లోపలికి పోబోయింది.

సూర్యనారాయణ అంతవరకు వీళ్ళ సంభాషణ వింటున్నాడు.

"అమ్మా_ సరూని లోపలికి తీసుకువెళ్లు_వీరిని పంపించి వస్తా_ ముగ్గురం వెళ్దాం_"

సరూని లోపలికి తీసుకుపోబోతున్న శకుంతల ముఖాన్ని సూర్యనారాయణ స్పష్టంగా చూడగలిగాడు. లోపలికి పోబోతున్న శకుంతల అప్పు డంటూ ఆగింది_ ఆమె కాలికి ఏదో గుచ్చుకోవడంవల్ల ఆమె ముందుకు అడుగు వేయ లేకపోయింది. భరత్ సరూ ఆమెను చెరోవైపు పట్టుకున్నారు. వెంటనే భరత్ కిందకువంగి కాలిలో గుచ్చుకున్న చిన్న పెంకును లాగేశాడు. వస్తున్న రక్తాన్ని చేత్తో ఆపాడు. శకుంతల మెల్లిగా వెళ్ళి అక్కడే ఉన్న సోఫాలో కూర్చుంది. ఎదురుకుండా ఉన్న సూర్యనారాయణని చూసింది. ఆమె ముఖం నెత్తుటిచుక్క లేనట్లు తెల్లగా పాలిపోయింది. సరూ ఆమె పక్కనే కూలబడ్డది. భరత్ లోపలి నుంచి కాటన్, బాండేజీక్లాత్ తెచ్చి శకుంతల కాలికి కట్టు కట్టాడు.

"నీవు శకుంతలవి కదూ." అన్నాడు సూర్యనారాయణ ఆమె ముఖం చూస్తూ.

"అవును మా అమ్మ మీ కెట్లా తెలుసు_?" ఆశ్చర్యంగా అడిగాడు భరత్.

"అయితే మీరు.... నువ్వు నా మనవడివి _ అయ్యో ఎంత కాలమైనా రక్తసంబంధం ఎట్లా పోతుంది. శకుంతలా_ నన్ను, మనవడిని తెలుసుకోని రోజు లేదనుకో_ మీ ఆయన మీకోసం ఎన్నిసార్లు కలవరించాడో_ ఇన్నేళ్ళ తరువాత కలుసుకున్నాం_"

"అమ్మా! ఏమిటీ నీవు చెప్పేది నిజమేనా_" అన్నాడు భరత్.

"భరత్.... ఆ విషయాలన్నీ తరువాత _ ముందు హాస్పిటల్‌కి వెళ్దాం పద_" శకుంతల కఠినంగా అంది. ఆమె మనస్సు సూర్యనారాయణని చూడ గానే కోపంతో నిండిపోయింది.

"మీ ట్రీట్‌మెంటు సంగతి కొంత టైమ్ తీసుకుంటుంది - తరువాత మాట్లాడదాం-" అంటూ లేచాడు భరత్.

"నాయనా భరత్! ఈ తాతయ్య సంగతి మరచిపోకు - నీకు ఏ అవసరం వచ్చినా రా - అసలు ఇప్పుడు ఈ ఫాక్టరీలు ఈ డబ్బు అంతా నీదికాక ఇంకెవరిదిరా- ఈ విషయం తెలిస్తే మీ నాన్న ఎంత సంతోషపడతాడో - ఇదిగో నా అడ్రస్" అంటూ విజిటింగ్‌కార్డు భరత్ చేతికి ఇచ్చాడు.

"శకుంతలా ఏమీ మాట్లాడవేం-"

"నేను మనుషులతో మాత్రమే మాట్లాడగలుతా-" అంటూ లోపలికి వెళ్ళిపోయింది. ఆమె వెనకే సరూ వెళ్ళిపోయింది. సూర్యనారాయణ ముఖం ఎర్రబడ్డది. కోపం కట్టలుతెంచుకునే పరిస్థితి వచ్చింది. కాని తనను తను అదుపులో పెట్టుకున్నాడు.

"భరత్ నాయనా.... నా హృదయంలో నీ మీద ఎంత ప్రేమ ఉందో ఎట్లా చెప్పనురా- ప్రేమను పెంచుకోవాలి కాని తెంచుకోకూడదు. మళ్ళీ కలిసినప్పుడు అన్నీ మాట్లాడుకుందాం-" అంటూ బయటకు వెళ్ళి కారెక్కి కూర్చున్నాడు. కారు స్టార్ట్ అయింది.

శకుంతల గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నాయి. ఆమె మనస్సంతా అల్లకల్లోలమయింది. భరత్ శకుంతలని అసలు ఏమనుకుంటుందో తెలుసుకోలేకపోతున్నాడు. కాని సరూని చూసిన అతనికి తన కర్తవ్యం గుర్తుకువచ్చింది.

ముగ్గురూ కలిసి హాస్పిటల్‌కి బయలుదేరారు.

6

పోస్ట్‌మెన్ ఇచ్చిన ఉత్తరాన్ని అందుకున్నాడు భరత్. తడబాటుతోనే ఉత్తరం బయటకు తీశాడు. ఆ దస్తూరిని గుర్తుపట్టాడు. ప్రేమ తనకు ఇన్నాళ్ళ తరువాత ఉత్తరం వ్రాసిందా! గబగబా చదవడం మొదలుపెట్టాడు.

"భరత్!

పేపర్లోపడ్డ నీ ఫోటోను, నీవు కనుక్కున్న పాత్రలనీ చదివాను. నా మనస్సు ఉప్పొంగింది నీవు ఇంత గొప్ప వ్యక్తివి కాగలిగినందుకు మనస్ఫూర్తిగా నిన్ను నేను అభినందిస్తున్నా. భరత్ మనం ఒకళ్ళనొకళ్ళు చూసుకుని ఎన్నో ఏళ్ళయింది కదూ. విధి నాతో చలగాటం ఆడింది. నాన్నగారి మాట కాదనలేక మా బావను పెళ్ళిచేసుకున్నాను. ఎందుకో ఆ కొన్ని క్షణాల్లో నేను చాలా పిరికిదాన్నయిపోయాను నాలోని సాహసం అంతా ఏమయిందో నాకే తెలియదు.

ఆనాడు సాహసించలేకపోయినందున ఎంతో శిక్ష అనుభవించాను. ఇంకా అనుభవిస్తూనే ఉన్నాను. భరత్ ఈనాడు నా కాపురం నిలబెట్టగలవాడివి నీవు ఒక్కడివే. మా ఆయనకు మనిద్దరి విషయం తెలుసు కదా. ఇప్పుడు నీవు కనుక్కున్న 'యూత్ ఫార్ములా'ను అతను చనిపోక ముందు ట్రీట్‌మెంట్ తనకు ఇవ్వమని నన్ను నీకు వ్రాయమన్నాడు. ఆ తరువాత ఆ మందుల ప్రొడక్షన్ ఆగిపోయినా- అతడు దానిని పొందలేదని అతని ఉద్దేశం. నేను నీకు ఏ ముఖం పెట్టుకుని వ్రాయను? అందుకే నేను వ్రాయనని వ్యతిరేకించాను. మానవత్వాన్ని మరచి నన్ను నానా హింసలు పెడుతున్నాడు. నన్ను వదిలివేయడానికి కూడా సిద్ధంగా ఉన్నాడు. ఈ సమాజంలో భర్త వదిలేస్తే ఆడదానికి ఎంత విలువ ఉందో నీకు తెలుసు కదా- అందుకే నిన్ను కన్నీళ్ళతో అర్థిస్తున్నా- నా కాపురం నిలబెట్టమని- ఎంతో ముసలివాడయిపోయిన నాన్న నన్ను, నా స్థితిని చూసి కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాడు, అంతకన్నా ఆయన మాత్రం ఏం చేయగలుగుతాడు. మీ అమ్మగారిని మీ తాతయ్యని అడిగినట్లు చెప్పగలవు. నీ ఉత్తరం కోసం ఎదురుచూపే–

—ప్రేమ

"ప్రేమా" అంటూ ఒక్కసారి బాధగా మూల్గింది భరత్ హృదయం. ప్రేమా ఇన్నేళ్ళ తర్వాతయినా ఓ ఉత్తరం ఈ భరత్‌కి వ్రాసావు. మళ్ళీ నీ చేతుల్తో నా పేరును వ్రాసావు. ప్రేమా నీకోసం ఏమయినా చేస్తాను. నీ సంతోషం కోసం నేను ఏది చేయడానికైనా సిద్ధమే. ప్రతిమనిషి కొత్తదేదైనా తనే ముందు దాన్ని పొందాలని ఎంతో తపన పడతాడు. రోజుకు నాకు ఎన్నో ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. సినిమాయాక్టర్ల దగ్గరనుంచి పెద్దపెద్ద పొలిటీషియన్ల దాకా ఏవో ఏవో ఆశలు చూపిస్తూ నాకు వ్రాస్తూనే ఉన్నారు. ప్రేమా నేను 'యూత్ ఫార్ములా'కోసం ప్రతిక్షణాన్ని అమూల్యంగా తీసుకుని కష్టపడ్డాను. నిద్ర ఆహారాలు మానేసి మానసికంగా శారీరకంగా ఎంతో శ్రమించాను. 'యూత్ ఫార్ములా' నా ఒక్కడిదే కాదు. నీదికూడా ప్రేమా– ఇందులో నీ శ్రమ ఎంతో ఉంది. ఆనాడు నీవు నా తోడులేకపోతే ఆనాడు మనిద్దరం కలిసి ఆ నిర్ణయం తీసుకోకపోతే–ఈనాడు భరత్ యూత్‌ఫార్ములా కనిపెట్టేవాడే కాదు. ప్రేమా మనం ఎన్ని కలలు కనేవాళ్ళం. అతని కళ్ళల్లో గతం కదలాడసాగింది.

*

భరత్–ప్రేమలు బి.యస్‌సి నుంచి కలిసి ఒకే కాలేజీలో చదివారు. ప్రేమావాళ్ళ ఇల్లు భరత్ ఇంటికి ఎదురుగుండానే ఉండేది. ప్రేమ తండ్రి బాగా




ధనవంతుడు అవడంవల్ల ఆమెను అల్లారుముద్దుగా పెంచాడు. ప్రేమను శకుంతల అప్పుడప్పుడు తన ఇంటికి పిలుస్తూ ఉండేది. ప్రేమకు తల్లిలేని కొరంగా శకుంతల అంటే ఒకరకమయిన అనుబంధం ఏర్పడింది. భరత్ తల్లి తాతలు ప్రేమను ఎంతో ప్రేమగా చూసేవారు. భరత్ ప్రేమల స్నేహం ప్రేమగా మారింది. ఇద్దరూ ఏవేవో ఊహాలోకాల్లో తేలిపోయేవారు. ఏవేవో రంగురంగుల స్వప్నాల్లో విహరించేవాళ్ళు. తీయటికలల్లో జీవించేవాళ్ళు. మెల్లిమెల్లిగా ఫ్రెండ్స్‌కి కూడ ఈ విషయం తెలిసింది. ఫ్రెండ్స్ ఆటపట్టిస్తూ ఉండేవాళ్ళు. ఆ రోజు క్లాస్‌లోని వారందరూ పిక్‌నిక్ ప్రోగ్రాం వేసుకున్నారు.

"ఒరేయ్ సదానంద్...ఆనంద్....నిర్మల్....పాపం ప్రేమలోపడిపోయిన ఆ చిన్నవాడిని ఆ చిన్నదాన్ని చూడండిరా—చుట్టూరా ఎంతమంది ఉన్నా ఎక్కడో తేలిపోతున్న ఆ రాజకుమారుడిని ఆ రాజకుమారిని చూడండిరా—ఊహుం వీళ్ళకి అసలు ప్రపంచమే అక్కరలేదు. పాపం నోట్లో ఓముద్ద కూడ పోవడంలేదు. అరె....అరె అమ్మాయిగారూ! అబ్బాయిగారూ ఇప్పుడే ఇంతగా ఒకరిని ఒకరు కళ్ళతో కట్టేసుకుంటే ఎలా?"

"ఒరేయ్ నందూ ఇప్పుడు ఇందరి మధ్యలో కళ్ళతో కట్టేసుకోకపోతే చేతులతో ఒకరిని ఒకరు బంధించేసుకుంటారా—నీవు మరీ—యూ ఫూల్—నీకు తెలియదేమో ప్రేమ అంటే ఇట్లాగే ఉంటుందిరా—" అన్నాడు సదానంద్ కన్నుగీటుతూ—

"అయితే తమరికీ విషయంలో చాలా ఎక్స్‌పీరియన్స్ ఉన్నదన్నమాట—" అన్నాడు నందు నవ్వుతూ.

"ఇప్పటివరకైతే లేదురా బాబూ. కాని ఈ జంట - ఈ అందాల జంట భరత్ ప్రేమలను చూస్తుంటే అమాంతంగా ఎవరినైనా అమ్మాయిని ప్రేమించాలని పిస్తోందిరా—" అన్నాడు సదానంద్.

అక్కడ ఉన్న అమ్మాయిలు తలవంచుకున్నారు. భరత్ - ప్రేమలు తమ పేర్లు వినంగానే ఒక్కసారి ఈ లోకంలోకి వచ్చారు.

"ఆ... " అన్నాడు హఠాత్తుగా భరత్, అందరిని చూస్తూ.

"ఓహ్—" అన్నది ప్రేమ సిగ్గుగా.

"మీ ఆహ్ ఓహ్ భాష మాకు అర్థంకాదులెండి. అ ప్రేమబాష మీ ఇద్దరికే అర్థ కావాలి. తమరిద్దరు కాస్సేపు ఈ లోకంలోకి వచ్చి వడ్డించిన పదార్థములను తినవలయునని మా ప్రార్థన—" అన్నాడు మూర్తి.

ఒక్కసారిగా అందరూ నవ్వారు.

"మూర్తీ.... ఉండు నీ పని చెబుతా" అంటూ లేవబోయాడు భరత్.

"బ్రదర్... తర్వాత మీ ఫైటింగ్. ముందు తిండి - మూర్తికి కూడ ఓ జంటను తెస్తా. అప్పుడు మీ రెండు జంటలు కలిసి మరి డిష్కుం... డిష్కుంలు— ఎవరు గెలుస్తారో అప్పుడు చూద్దాం" అన్నాడు నందు.

అందరు ఘొల్లున నవ్వారు. కబుర్లు చెప్పుకుంటూ— నవ్వుతూ తుళ్ళుతూ భోజనాల కార్యక్రమం అయిందనిపించారు.

కొంతదూరంలో ఉన్న ఉయ్యాలబల్లలను ఎక్కి ఊగడం మొదలుపెట్టారు కొందరు. అందరిని తప్పించుకుంటూ ఎవరూ చూడకుండా భరత్ ప్రేమలు ఓ మూల ఉన్న చెట్టుదగ్గరికి వచ్చి కూర్చున్నారు.

చెట్టుపైన ఉన్న కోకిల కూ... కూ.... అని కూసింది. పైకి చూసారు. కొమ్మమీద కోయిల హాయిగా స్వేచ్ఛగా ఆకాశంలోకి ఎగిరింది. అది కనబడేవరకు ఇద్దరూ చూసారు. అది కనుమరుగుకాంగానే భరత్ ప్రేమ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"ప్రేమా!" ప్రేమగా అన్నాడు భరత్.

"ఊ..." భరత్ చేతివేళ్ళను నిమురుతూ అంది ప్రేమ.

"ఓహ్ ఎప్పటికీ ఈ క్షణాలు ఇట్లాగే ఉండిపోతే - జీవితంలో ఇంకేం ఆనందం కావాలి. చాలు ఈ జీవితానికి నీవు దొరికావు—" అన్నాడు భరత్ మత్తుగా ప్రేమ కళ్ళల్లోకి చూస్తూ— ప్రేమ కళ్ళను దించుకుంది. "ప్రేమా.. ఏది నావంక చూడు." అంటూ ప్రేమ ముఖాన్ని పైకెత్తాడు భరత్.

"హాయ్ ఏం సీను కట్ కట్..." వెనకనుంచి పెద్దగా కేక విని పించింది. ఇద్దరూ వెనక్కి ఒక్కసారిగా చూసారు వెనక నలుగురైదుగురు స్టూడెంట్స్ నిల్చుని నవ్వుతున్నారు. భరత్ ప్రేమలు సిగ్గుతో ఒకరి నుంచి ఒకరు దూరమయ్యారు అందరూ వారిద్దరిచుట్టూ చేరారు

భరత్ ప్రేమల మధ్య రోజులు ఆనందంగా దొర్లిపోతున్నాయ్. ప్రేమ ఎక్కువగా సైన్స్‌కి సంబంధించిన పుస్తకాలు చదువుతూ ఉండేది. భరత్‌ని కూడ చదవమని ఇస్తూ ఉండేది. ఇద్దరు చదివిన పుస్తకాల గురించి చర్చించుకుంటూ ఉండేవాళ్ళు.

## 8

"భరత్! ఎరిచ్ వాన్‌డానికిన్ పుస్తకం ఎంత అద్భుతంగా ఉందో తెలుసా. ఇతని థియరీ మనకి ఎంతో ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది." అంటూ పుస్తకాన్ని భరత్ చేతికి ఇచ్చింది ప్రేమ.

భరత్ పేజీలు తిరగవేయసాగాడు

"భరత్ ఈ డానికిన్ ఊహప్రకారం మన భూమిమీదేకాక ఇంకా వేరే గ్రహాల్లో కూడ ఎంతో 'ఇంటలిజంట్ బీయింగ్స్' ఉన్నారు దేవుడు వ్యోమగామి అని ఇతడు విశ్వసిస్తున్నాడు. ఆ ఇంటలిజెంట్ బీయింగ్స్, మనం అనాగరికులుగా ఉన్నప్పుడు, మన భూమిని విజిట్‌చేసి ఉండవచ్చునని, అప్పటికే వారికి మనకన్నా ఎక్కువ సైంటిఫిక్ నాలెడ్జ్ ఉండి ఉండవచ్చునని ఇతని ఊహ."

"అ....ఏవిటీ ఈ థియరీ చాలా కొత్తగా ఉందే! నమ్మగలమా. ప్రాణులు బతకటానికి సరిపడే ఎట్మాస్ఫియర్ ఒక్క మన భూమిలో తప్పితే ఇంకా వేరే గ్రహాల్లో ఉండటానికి అవకాశం ఉందా - అసలు ఆక్సిజన్ నీరు లేకుండా ప్రాణులు బతకలేవు అన్నది నిజంకాదు అని కొందరి అభిప్రాయం. మన భూమిమీద కొన్ని బ్యాక్టీరియా ఆక్సిజన్ నీరు లేకుండా బ్రతుకుతున్నాయి. వాటిని ఎనియోరబిక్ బ్యాక్టీరియా-అని అంటారు. భూమికి దగ్గరగా 18,000 గ్రహాలు ఉన్నాయి. ఈనాడు చంద్రుడి మీదకు వెళ్ళగలము అన్న నమ్మకం 1969 సం॥ 21 జూలైలో ఆర్మ్‌స్ట్రాంగ్ ఆల్‌డ్రిన్-అంతరిక్షనౌక ఎపోలో 11లో వెళ్ళినప్పుడు కలిగింది. ఈ ఎరిచ్ వాన్‌డానికిన్ మన అంతరిక్షనౌక మరో గ్రహంమీద అడుగుపెట్టాక, మన అంతరిక్ష నావికులు అక్కడ ఎటువంటి పరిస్థితులు చూస్తారో ఆ తరువాత అక్కడ ఏం బతకగల అవకాశం ఉందో ఈ విధంగా ఊహిస్తున్నారు. మన అంతరిక్షనౌక ఒక గ్రహంమీదకు వెళ్ళింది అని

అనుకుందాం. మన అంతరిక్ష నావికులు అక్కడ దిగంగానే, అక్కడి నాగరికత, భూమిమీద 8 వేల సంవత్సరాల కిందటి నాగరికత ఎట్లా ఉందో అట్లాగే ఉందను కుందాం. అక్కడ ఉన్న మనుషులు మన అంతరిక్ష నావికులను చూడంగానే ఒక్కసారి ఆశ్చర్యం కలుగుతుంది. ఎందుకంటే వారు సూర్య-చంద్రులను పూజిస్తూ, రాతి పనిముట్లను, కుండలను చేసే అనాగరిక స్థితిలో ఉంటారు. మన వారికి కూడ ఈ దృశ్యం ఆశ్చర్యం కలిగిస్తుంది హెల్‌మెట్లు, యాన్‌టీనాలు ధరించిన మన ఎస్ట్రొనాట్స్‌ని చూసినవారు ఎవరో దేవుళ్ళు తమ మీదికి వచ్చా రనుకుంటారు. వీళ్ళదగ్గరి సెర్చ్‌లైట్స్ రాత్రిని పగలుగా మార్చే యంత్రాల్లాగా వారికి అనిపిస్తాయి. మనవారి ట్రైయిల్ ఎక్స్‌ప్లోరేషన్స్‌వల్ల కలిగిన ధ్వని, మంటలు వారికి భయాన్ని కలిగింపచేస్తాయి. కొండగుహల్లో తమ ప్రాణాల్ని కాపాడుకోవడానికి ఉరికేలా చేస్తాయి. కొన్నాళ్ళయ్యాక అక్కడ ఉన్న మతాధి కారులు, తెలివిగలవాళ్ళు మన ఎస్ట్రొనాట్స్ దగ్గరనుంచి దేవుళ్ళగురించి తెలుసు కోవాలనుకుంటారు. వారు తమ అతిథులకోసం ఎన్నో బహుమతులు తీసుకు వస్తారు మన ఎస్ట్రొనాట్స్ అక్కడివారి భాషను కంప్యూటర్‌ద్వారా నేర్చుకో ప్రయత్నిస్తారు. వారి భాషలలోనే ఏ దేవుళ్ళు మీ ప్రదేశానికి రాలేదని, మమ్మల్ని అంతగా పూజించాల్సిన అవసరం లేదని అక్కడి అనాగరికులకు ఎంత చెప్పినా నమ్మరు. వీళ్ళు అంటే మన ఎస్ట్రొనాట్స్ వేరే గ్రహంనుంచి వచ్చారు కనుక వారు తప్పకుండా దేవుళ్ళేనని, ఈ దేవుళ్ళదగ్గర అమితమయిన బలం, అనేక మయిన అద్భుతాలను సృష్టించగల శక్తి వారిలో ఉందని అనుకుంటారు. మన ఎస్ట్రొనాట్స్ వారకి నాగరికత నేర్పిస్తారు. అక్కడి కొంతమంది స్త్రీలను మన ఎస్ట్రొనాట్స్ సంభోగిస్తారు. ఎందుకంటే మరో కొత్త అమోఘమైన తెలివితేటలు గల వంశం అక్కడ మొదలవుతుందని వీరి అభిప్రాయం. ఆ పుట్టినవాళ్ళు మన ఎస్ట్రొనాట్స్‌లాగా తెలివిగలవాళ్ళుగా పుడతారు. అక్కడ కొంతకాలం ఉన్న మన ఎస్ట్రొనాట్స్ భూమికి వచ్చేసరికి అక్కడ కొన్ని చిహ్నాలు వదిలివేసివస్తారు. ఆ చిహ్నాలు అక్కడివారికి ఎంతో గొప్పగా కనిపిస్తాయి. విషయాన్ని అర్థంచేసు కొనగల స్తోమత మెల్లిమెల్లిగా అక్కడివాళ్ళకి వస్తుంది. అంతరిక్షనౌక మాయం కాగానే వాళ్ళు మన భూమిమీదకు దేవుళ్ళు వచ్చి వెళ్ళారు. వాళ్ళను పూజించాలి అని అభిప్రాయపడతారు. వాళ్ళు మెల్లిగా నాగరికత అలవరుచుకొని, చదవడం వ్రాయడం నేర్చుకున్న తరువాత, వాళ్ళభాషలో ఈ దేవుళ్ళ అద్భుతాలని గురించి వివరిస్తూ పుస్తకాలు వ్రాస్తారు. ఈ పుస్తకాలు ముందుతరంవారికి అందజేయ

బడతాయి. వాళ్ళు చూసిన అద్భుతాలన్నీ, చిత్రాలుగా గుహల్లో వేయబడతాయి. వాళ్ళు ఆ దేవుళ్ళని స్మరిస్తూ ఉంటారు. వాళ్ళు తిరిగిన ఆ ప్రదేశాలన్నీ పవిత్ర స్థానాలుగా గుర్తింపబడతాయి. అంతరిక్షనౌక దిగిన ప్రదేశాన్ని వారు పూజిచేయ టం మొదలుపెడతారు. ఈ ప్రదేశాలన్నింటినీ పవిత్రమయిన యాత్రాస్థలాలుగా వారు చూడటం మొదలుపెడతారు. అక్కడ పిరమిడులు, మందిరాలు స్థాపింప బడతాయి. రోజులు గడుస్తున్నకొద్దీ, యుద్ధాలు అవీ జరగడంవల్ల ఈ ప్రదేశాలు పాడుబడుతూ వస్తాయి. ముందుతరంవారు ఈ పాడుబడిన వాటి గురించి తెలుసు కోవాలని ప్రయత్నిస్తారు. పురాతన పరిశోధనా శాఖవారు పరిశోధన ప్రారంభం తిస్తారు—" అంటూ ఆపింది ప్రేమ.

"అయితే ఇప్పుడు మనం అదే స్థితిలో ఉన్నామని ఇతని అభిప్రాయమా! మనం పూజించే దేవుళ్లు ఎవరో కారని, మరో గ్రహాంతరవాసులు అని ఇతను అంటాడా-" అన్నాడు శరత్.

"ఎగ్జాక్ట్లీ! కరెక్ట్— ఇతను ఎన్నో ప్రూవ్‌లను చూపిస్తూ మనకన్నా ఇంటలిజెంట్ బీయింగ్స్ అయిన ఇతర గ్రహవాసులు, మన భూమిని విజిట్ చేశారని ఇతడి అభిప్రాయం. పెరిరైస్ దేశపటాలను గురించి ప్రొఫెసర్ చార్ల్స్ హెచ్ హావ్‌గుడ్, రిచర్డ్ డ్ల-స్ట్రాచన్ పరీక్షచేసి ఇవి భూమికి — చాలా ఎత్తు నుంచి ఫోటో తీసినట్లుగా ఉన్నాయని, అందులో చూపెట్టిన పర్వతప్రదేశాలు, పర్వతశిఖరాలు, ద్వీపాలు, నదులు, అన్నీ ఇప్పటి మన గ్లోబ్‌ను అనుసరించే ఉన్నాయని, భూమికి ఎంతో ఎత్తుమంచి మోడ్రన్ టెక్నిక్‌తో తీయబడ్డాయి అని చెప్పారు. ఇవి కొన్ని వందలసంవత్సరాలు మంచులో పడిఉన్నాయి. మనకు చాలా ముందుతరంవారు, అప్పటికి మనవాళ్ళు అనాగరికులు కదా, ఇవి గీశారు అంటే నమ్మలేమని వీరి అభిప్రాయం. టిహానుకో (Tiahuanco) అనేచోట గేట్ ఆఫ్ ది సన్ అద్భుతమయినది. దీనిమీద 48 బొమ్మలు ఫ్లైయింగ్ గాడ్‌ని పోలుస్తూ ఉన్నాయి. దాన్ని గురించి ఇక్కడివాళ్ళు చెప్పే కథ ఇది.

ఒక బంగారపునౌక నక్షత్రాలనుంచి వచ్చింది. ఇందులో ఒరియానా అనే ఆమె భూమియొక్క గ్రేట్ మదర్ అవుదామన్న ఆకాంక్షతో వచ్చింది. ఆమెకు నాలుగు వేళ్ళు ఉండేవి. అవి ఒకదానితో ఒకటి కలిసి ఉన్నాయి. ఆమె భూమి మీద డెభ్భైమంది పిల్లలను కని తిరిగి పైకి వెళ్ళిపోయింది—"

"అమ్మబాబోయ్ డెభ్భైమందే...." ఆశ్చర్యంగా అన్నాడు శరత్.

"ఇందులో ఆశ్చర్యం ఏముంది- కౌరవులు వందమంది కారేమిటి? అ...
మరి విను   ఇప్పటికి అక్కడక్కడ నాలుగువేళ్ళు గల బొమ్మలు రాతిమీద ఉన్నాయి- సుమేరియన్‌లు ఎక్కడినుంచి వచ్చారో ఎవరికీ తెలియదు - కాని వారు తమవెంట ఎంతో నాగరికతను తీసుకువచ్చారు. వాళ్ళ ఖగోళశాస్త్రము ఎంతో గొప్పది. కుయున్‌జిక్ అనే కొండమీద ఓ నంబరు.. ఉండు పుస్తకంలో చూద్దాం-" అంటూ భరత్ చేతిలోంచి పుస్తకం తీసుకుంది. తను టిక్ మార్క్ పెట్టినవన్నీ ఓసారి చూసుకుంది

"అ ఇదిగో- 195 955 200 000 000 ఇదే నంబరు. అంటే పదిహేను కోట్లు గల అంకె కనిపించింది. అన్ని శాస్త్రాలలో ఎంతో అభివృద్ధిగాంచిన గ్రీకులు కూడ 10,000 అంకెను దాటలేదు- 10,000 తరువాత వాళ్ళు ఇన్‌ఫినిటీ అని చెప్పేవాళ్లు. బైబిల్‌లో ఎన్నో వింతవిషయాలు ఉన్నాయి. జెనిసిస్‌లో- 'గాడ్ సెడ్ - లెట్ అజ్ మేక్ మాన్ ఇన్ అవర్ ఇమేజ్ ఆఫ్టర్ అవర్ లైక్‌నెస్-' అని వ్రాసి ఉంది. సన్స్ ఆఫ్ గాడ్ అన్న పదం ఎన్నోచోట్ల కనిపిస్తుంది- దేవుడే మనుషులను తన ఓన్ ఇమేజ్‌లో తయారుచేశాడని ఎన్నోచోట్ల వ్రాయబడి ఉంది. ఇవిగో ఈ టిక్‌మార్క్ చేసినవి చదువు" అంటూ ప్రేమ పుస్తకాన్ని భరత్‌కి ఇచ్చింది.

"ఎండ్ ఇట్ కేమ్ టు పాస్ వెన్ మెన్ బిగాన్ టు మల్టిప్లై ఆన్ ద ఫేస్ ఆఫ్ ది ఎర్త్, ఎండ్ డాటర్స్ వర్ బార్న్ అన్ టు దెమ్ దట్ సన్స్ ఆఫ్ గాడ్ సా ద డాటర్స్ ఆఫ్ మేన్ దట్ దె వర్ ఫెయిర్ ఎండ్ దే టుక్ దెమ్, వైవ్స్ ఆఫ్ అల్ విచ్ దె చూజ్- (జెనిసిస్: 1-2) దేర్ వర్ జైంట్స్ ఇన్ ద ఎర్త్ ఇన్ దోజ్ డేస్ ఎండ్ ఆల్‌సో దట్ వెన్ ద సన్స్ ఆఫ్ గాడ్ కేమ్ ఇన్ ఇన్ టు ద డాటర్స్ ఆఫ్ మేన్ ఎండ్ దె బోర్ చిల్డ్రన్ టు దెమ్ ద సేమ్ బికేమ్ మైటీమెన్ విచ్ వర్ ఆఫ్ ఓల్డు మేన్ ఆఫ్ ది నౌన్ (జెనిసిస్ 6:4)-" అంటూ పైకి బిగ్గరగా చదివాడు భరత్.

"మన మతసంబంధమైన పుస్తకాలలో కూడ ఇదంతా దేవుడి సృష్టే అని మనం చదువుతూ ఉంటాం-కదూ- మన భారతంలోని కుంతియొక్క కొడుకు కర్ణుడు సూర్యుడికి పుట్టినవాడు అని మనకు తెలిసిందే- కాని ఇది ఎట్లా సంభవం అన్న ఆలోచన మనకు కలిగే అవకాశం ఉంది కదా- మనవాళ్ళందరూ గుడ్డిగా- ఆహా దేవుడు కుంతికి కొడుకునిచ్చాడు అని అనుకుంటారు - వాన్‌డానికెన్ ప్రకారం, మాపెప్ కథ, ఈ కుంతికథలను విన్నాక మరో గ్రహంనుంచి వచ్చిన




ఇంటలిజెంట్ బీయింగ్స్ ఇక్కడి ఆడవాళ్ళతో సంగమించి తమ ఇమేజ్‌లో పిల్లలను పుట్టించి ఉంటారు. మన భారతం, బైబిల్, ద ఎపిక్ ఆఫ్ గిల్‌గమేష్, ది టెక్ట్స్ ఆఫ్ ద ఎస్‌కిమోస్‌లలో, ఆమెరికన్, ఇండియన్, స్కాన్‌డినేవియన్ టిబెటియన్ల సాహిత్యాలన్నింట్లో ఒకటే రకమయిన కథలు ఉన్నాయి. వీటన్నింటిలో ఎగిరే దేవుళ్ళు వింతగాలిపే హెవెన్‌లీ వెహికల్, అద్భుతమయిన ఆయుధాలు మొదలగువాటిని గురించి ఉన్నాయి. వీటిని వ్రాసిన గ్రంథకర్తలు ఒకేచోట వారుకారు. చాలా దూరదూర ప్రాంతాలలో నివసించేవారు. వీళ్ళందరూ ఒకే విధంగా ఎందుకు వర్ణిస్తారు అని ఈ వాన్‌డానికిన్ అడుగుతున్నాడు—"

"మన భూమిమీది ప్రజలే వాటిని ఒకప్పుడు చూసి ఉండవచ్చు. వాళ్ళు చూసింది తమ పిల్లలకు, మళ్ళీ వాళ్ళు తమ పిల్లలకు ఇట్లా తరతరాలనుంచి ఒకరినొకరు చెప్పి ఉండవచ్చు- అయితే ఇప్పుడు ఈయన ఉద్దేశం దేవుడు గ్రహాంతరవాసి అని కదూ—"

"అవును మన దేవుళ్ళు వేరే గ్రహాలనుంచి వచ్చారని ఇతడు ఖచ్చితంగా చెబుతున్నాడు— అస్వాన్ అనే చోట ఒక ఐలెండు సరిగ్గా ఎలిఫెంట్ షేపులో ఉంది. దానిని ఏన్‌షియంట్ ఈజిప్షులు ఎలిఫెన్‌టైన్ అని పిలిచేవారు. ఎంతో ఎత్తునుంచి విమానంలోంచి చూస్తేకాని ఈ ద్వీపము ఇట్లా ఉంది అని చెప్పలేరు, ఎందుకంటే అక్కడ చుట్టుప్రక్కల ఎత్తయిన కొండలుకూడ లేవు-విమానాలు,

అవి లేని ఆ రోజుల్లో మరి ఈజిప్షులు ఈ విషయాన్ని ఎట్లా చెప్పగలిగారు. ఇంకో అద్భుతమయిన విషయం ఫ్లైయింగ్ సాసర్స్. అప్పుడప్పుడు దాదాపు 20 సం॥ల నుంచి కనిపిస్తున్నాయి."

"ఫ్లైయింగ్ సాసర్స్ అంటే...."

"వీటిని యు.ఎఫ్.ఓస్ అంటారు-అంటే అన్ ఐడెన్‌టిఫైయిడ్ ఫ్లయింగ్ ఆబ్‌జెక్ట్స్- ఇవి అమెరికా, వెస్ట్‌జర్మనీ ఇంకా కొన్నిచోట్ల కనిపించాయట- మామూలు ప్రజలు ఏదో పొరపాటు పడ్డారని అనుకోవచ్చు, కాని కొందరు పైలెట్స్ తమ కళ్ళారా చూశామని చెప్పారుట. 1964సం॥ కాన్‌బెరా, ఆస్ట్రేలియా దగ్గర ఏదో తళతళ మెరుస్తున్న పైకి ఎగురుతున్న ఆబ్‌జెక్ట్‌ని చూసామని కొంద న్నారట- వాన్‌డానికెన్ ఏ ఏ దేశాలవాళ్ళు వీటిని స్పెషల్ స్టడీ చేయటానికి కొన్ని డిపార్ట్‌మెంట్స్‌ను కొత్తగా ఇన్‌ట్రడ్యూస్ చేసారో వ్రాసాడు. ఫిబ్రవరి ఐదు 1966 సం॥లో అమెరికావారి డిఫెన్స్ డిపార్ట్‌మెంటు యు.ఎఫ్‌ఓస్‌ను స్టడీ చేయడం మొదలుపెట్టారు. ద సర్చ్ ఫర్ డైరెక్ట్ కమ్యూనికేషన్ ఛాప్టర్‌లో, కొందరు సైంటిస్టులు ఆ గ్రహాంతర వాసులతో డైరెక్ట్‌గా కమ్యూనికేషన్ కోసం ఎట్లా ప్రయత్నిస్తున్నారో వ్రాసాడు. రష్యన్ ఎస్ట్రొనమర్ అయిన ఫోలో మిస్త్రికి మాస్కోలో 1965 సం॥లో ఈ విషయం గురించి వివరించి చెప్పాడు. ఇతను మన బ్రెయిన్ చాలా శక్తివంతమయినదని అంటాడు-"

"అవును-నేటి ఈ వైజ్ఞానానికి ప్రగతిని మానవుడు తన మేధస్సుతోనే కదా సాధించాడు-ఇంకా ఈనాడు ఎంతో ముందుకుపోతున్నాడు ఈ మానవుడు-"

"మెంటల్ కమ్యూనికేషన్స్ గురించి ఎక్సపరిమెంట్స్ చాలాచోట్ల జరుగుతున్నాయి. ఇతడు ఓ అద్భుతమయిన, జరిగిన సంఘటన వ్రాసాడు. ఎడ్‌గార్ కేసీ [Edgar Cayee] ఇతడిని స్లీపింగ్ ప్రొఫెట్ అనికూడ అంటారు. అతను తన యౌవనదశలోనే జబ్బుపడ్డాడు. అతడు కోమాలో చాలాకాలం ఉన్నాడు. సడన్‌గా అతడికి స్పృహవచ్చింది. పెద్దగా స్పష్టంగా మాట్లాడటం మొదలుపెట్టాడు. తన జబ్బుకి కావాల్సిన మందులు తానే చెప్పాడు. అతడు చెప్పిన విధంగా చేయడం వల్ల ఆ మందులే వాడటంవల్ల అతడు ఆరోగ్యాన్ని పొందాడు. ఆ తరువాత అతడు వేరే పేషంట్లకి కూడ మందులు ప్రిస్క్రైబ్ చేసేవాడు. ఒకసారి ఈ కెసీ ఒక పేషంట్‌కి ఓ మందు చెప్పాడు. ఆ మందు ఎక్కడా దొరకలేదు. ఆ పేషంట్ అంతర్జాతీయ పత్రికల్లోకూడ ప్రకటించాడు. పారిస్‌నుంచి ఓ డాక్టరు తన తండ్రి ఇదివరకు ఆ మందును తయారుచేసేవాడని, కాని చాలా కాలంనుంచి ఆ మందు

తయారీ ఆగిపోయిందని వ్రాసాడు. సరిగ్గా కేసీ చెప్పిన ఇన్‌గ్రేడియన్ట్స్, ఆ మందు ఒకేలకంగా ఉన్నాయట—ఈ ఎడ్‌గార్ కేసీకి ఏమాత్రం మెడికల్ నాలెడ్జి లేదు—"

"మరి ఇట్లా చెప్పడం ఎంతో ఆశ్చర్యకరం కదూ—"

"ఇతడు చాలామందికి ఫీజుతీసుకోకుండానే సరియైన మందులు చెప్పే వాడట. డాక్టర్లు ఇట్లా నీవు ఎట్లా చెప్పగలుగుతున్నావు అని అడిగితే నేను వేరే మనుషుల బ్రెయిన్‌తో కాన్‌టాక్ట్ చేయగలను - నేను పేషంట్ యొక్క బ్రెయిన్‌ని అడిగి, అతని డిసీజ్‌కి తగ్గమందు చెప్పగల మరో బ్రెయిన్‌తో కాన్‌టాక్ట్ చేస్తానని చెప్పాడట—"

"దాన్ని టెలిపతి అంటారు—"

"వాన్ డానికిన్ ఇంకెక్కడో ఉన్న మనకు తెలియని మనుషులు-మనల్ని కాంటాక్ట్ చేయడానికి ప్రయత్నిస్తున్నారని అంటున్నాడు. 2100 సం॥లో మనిషి అవయవాలు-లంగ్స్ కిడ్నీస్-హార్ట్ మొదలయినవన్నీ స్పేర్ పార్ట్స్ క్రింద షాపుల్లో దొరుకుతాయట—"

"ఈనాడు మనుషులకి సైన్స్ ఎంతో సేవచేస్తోంది—"

"అబ్బా-అసలు టైమ్ తెలియలేదు— చాలా చీకటయిపోయింది - మరి నే వెళ్తా-ఇంట్లో ఇంకా కొన్ని కొత్తపుస్తకాలు ఉన్నాయి-అవన్నీ చదవాలి—"అన్నది ప్రేమ లేస్తూ—

"నేను ఈ పుస్తకం చదివి రేపిస్తాలే...." అన్నాడు భరత్—

"ఓ.... కే... "

## 9

మరోరోజు—

"ప్రేమా ఇదిగో .... ఇవి చదువు—" అంటూ భరత్ కొన్ని కాగితాలని ప్రేమకు ఇచ్చాడు—

"భరత్ నీ ఓపికకు మెచ్చుకోవచ్చు—" అంది ప్రేమ భరత్ క్రాఫ్‌ని తన సున్నితమయిన వేళ్ళతో సవరిస్తూ—

"అబ్బా ప్రేమా! నీ విట్లా చూస్తుంటే ఎంత హాయిగా ఉందో తెలుసా—" ప్రేమ వేళ్ళను తన చేతులతో గట్టిగా నొక్కాడు.

"అబ్బా-ఎంత నెప్పి పుట్టిందో తెలుసా-ఛీ అసలు ఇంకెప్పుడూ నీ దగ్గరకే రాను." అంది బుంగమూతి పెడుతూ.

"నీవు వచ్చేదేమిటి—నేను నిన్ను దూరంపోకుండా గట్టిగా పట్టుకుంటా— అప్పుడు తమరేంచేస్తారు—" అంటూ గట్టిగా ప్రేమను కౌగిట్లో బంధించాడు.

"ఊ ...వదులు...,భరత్ నాకు ఊపిరి అడటంలేదు-అదుగో అటు చూడు మీ అమ్మగారు—"

వెంటనే ఆమెను వదిలేసి వెనక్కి తిరిగి చూసాడు ప్రేమ చటుక్కున అక్కడే దూరంగా ఉన్న కుర్చీలో కూర్చుంది .

భరత్‌కి తన తల్లి కనిపించకపోవడంతో కుర్చీదగ్గరికి వచ్చాడు.

"అమ్మ దొంగా! అబద్దాలాడుతావు కదూ... ఉండు నీ పని చెబుతా...."

"అబ్బ తరువాత ఆ విషయాలిన్నీ-కాస్సేపు హాయిగా నా దగ్గర కూర్చుని వేరే కబుర్లు చెబుతూ—దొరికిన ఈ అమూల్యమైనక్షణాలను వృధాపోనీయకూడదు— అసలే మనిషి జీవిత కాలపరిమితి చాలా తక్కువ—" అన్నాడు ప్రేమచేతిని తన గుండెకి అనించుకుంటూ—

"ఇంకా బోలెడంత జీవితం ఉంది. కొన్ని వందల.... వందల రోజులు ఉన్నాయి—"

"ఈ వందలరోజులు మనకేం సరిపోతాయి-చెప్పు—అసలు మనకు చావు అనేదే లేకపోతే ఎంత బాగుండు. ఇద్దరం కలిసి ప్రేమరాజ్యాన్ని ఏలవచ్చు."

"అయితే మనం ఏ అమృతమయినా తాగితే సరిపోతుందిగా—"

"అమృతం తాగితే మరణం రాదు అంటే - ఆ అమృతం ఎక్కడ ఉందో చెప్పు - చంద్రమండలమైనా సరే అర్జంటుగా వెళ్ళి తీసుకువస్తా—" అన్నాడు చిలిపిగా—

"ఆ అమృతం ఏదో నీవే తయారుచేయవచ్చుగా—"

"ఆ... నేనా...."

"సైంటిస్టులు ఎన్నెన్నో కనుక్కుంటున్నారు. ఇటువంటిది కూడ కను క్కుంటారేమో - భరత్ ఓ పని చేయకూడదూ—"

"ఏమిటది___"

"నీవో పెద్ద సైంటిస్టువైపోకూడదు—"

"ఆ "

"ఆ .. ఏమిటి .. నీ కెంతో తెలివి ఉంది- కృషిచేస్తే నీ వేమైనా అవ గలుగుతావు—"

"ప్రేమా- నన్ను ఆకాశాని కెత్తేస్తున్నావ్—"

"నిజం భరత్ - నీవో పెద్ద సైంటిస్టువి కావాలి-మరణంలేని అమృతాన్ని కనుక్కో-కవిోయినా - మనిషి వయస్సు పెంచే ఫార్ములాని కనుక్కో - నా ఈ కోరిక తీర్చు భరత్.

"ప్రేమా నీవు ఈ లోకంలోనే ఉన్నావా-"

"ఈ లోకంలోనే ఉన్నా-నా భరత్ ప్రక్కనే ఉన్నా-భరత్ తప్పకుండా ఇది జరుగుతుంది. నువ్వో గొప్ప సైంటిస్ట్‌వవుతావు - పేపర్లలో నీ పేరు మారు మ్రోగుతుంది. అందరినోట్లో నీ పేరే ఉంటుంది. నేనెంత సంతోషిస్తానో___"

"ప్రేమా మరీ కలల్లో తేలిపోకు - మనిద్దరం ఒకరైె జీవితాంతం ఇట్లాగే ఉంటే అంతే చాలు-"

"తప్పకుండా మనిద్దరం ఒకటిగానే ఉంటాం - నీవో పెద్ద గొప్ప సైంటిస్ట్‌వి అవుతావు. భరత్ ఈనాడు ప్రపంచానికి సైంటిస్టులే దేవుళ్ళు. కాని కొంతమంది సైంటిస్టుల విషయం వింటే జాలివేస్తుంది - ఎందుకో తెలుసా - కనీసం వాళ్ళ పేర్లుకూడ ఎవరూ అనుకోరు - పెద్ద పెద్ద సైంటిఫిక్ డిస్కవరీస్ అన్నీ ఒక్కసారిగా ఏ సైంటిస్టు చేయడు- మొదట ఒకరికి ఐడియా వస్తుంది - నెమ్మది నెమ్మదిగా దాన్ని గురించి ఎంతోమంది ఆలోచిస్తూ ఉంటారు ఎక్స్‌పరి మెంట్సు చేస్తూ ఉంటారు. కాని ఫైనల్‌గా క్రెడిట్ ఒకరికే దక్కుతుంది - హార్ట్ ప్రాబ్లమ్ గురించి బ్రియుకొనెన్‌కో, డెవిన్, క్లార్క్ మొదలగువారు ఎంతో కృషిచేసారు. అట్లాగే టిష్యు గ్రాఫ్ట్స్ రియాక్టివ్ మెకానిజమ్ గురించి మదవార్, బరనెట్, బిల్లింగ్ హామ్, బ్రెనెట్, జవెన్, మెరిల్, ఉడ్‌దర్ఫ్, కాపీలన్, నోసల్ మొదలైనవాళ్ళందరూ ఎంతో ఆలోచించారు - ఎన్నో ఎక్స్‌పరిమెంట్సు చేసారు-"

"ప్రేమా - పెళ్ళయ్యాక మన ఇద్దరం కలిసి ఎక్స్‌పరిమెంట్స్ చేయడం మొదలెడదాము. మన ఇల్లే ఓ లాబరెటరీ - ఎక్స్‌పరిమెంట్సు చేసి అందమైన పిల్లలని కందాం-"

"ఛీ భరత్ ఎప్పుడూ నన్ను ఆటలు పట్టించడం తప్ప నీకేం పనిలేదు-" అన్నది సిగ్గుపడుతూ-

"ఇదిగో మారీడ్ కపుల్ నోబుల్ ప్రైజ్ తెచ్చుకున్నవాళ్ళున్నారు. తెలుసా, పోతే వాళ్ళు లౌమేకింగ్ ఎక్స్‌పరిమెంట్సు చేయలేదు - పాపం లాబ్‌లో రాత్రిం బగళ్ళు కెమికల్స్, ఏపరేటస్‌లను తీసుకుని ఎక్స్‌పరిమెంట్స్ చేసారనుకో - కెమిస్ట్రీలో ఐరిన్ మరియు ఫ్రెడరిక్ జాలియట్‌క్యూ- మెడిసన్‌లో గెటి కార్ల

కోరి - కపుల్స్ నోబుల్ ప్రైజ్‌ని పొందారు - అట్లాగే రేపు మనిద్దరం పెళ్ళి చేసుకుని నీవు చెప్పావే ఆ యూత్‌పార్కులాని కనుకుందాం—"

"తప్పకుండా భరత్.... మనిద్దరి దగ్గర బోలెడంత తెలివుంది - దాన్ని సద్వినియోగం చేద్దాం—"

"ప్రేమా! ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ గురించి విన్నావా-మొట్టమొదట ఓ సైంటిస్టు ఒక ఫిమేల్ రాబిట్ వొంబ్ నుంచి అండాన్ని మరో ఫిమేల్ రాబిట్‌లో అమర్చాడట-సరిగ్గానే ఉత్పత్తి జరిగింది. ఇప్పుడు అమెరికాలో కొన్ని వేలమంది టెస్ట్‌ట్యూబ్ పిల్లలను పుట్టిస్తున్నారు. సెక్స్యువల్ ఇంటర్‌కోర్సు లేకుండానే వీళ్ళను పుట్టిస్తున్నారు. హ్యూమన్ స్పర్మ్‌ని కొన్ని సంవత్సరాల వరకు చావకుండా బ్రతికే ఉండటానికి వాటిల్లో అండోత్పత్తి చేయగల శక్తి ఉండటానికి డా॥ పిన్‌కస్ - డా॥ హడసన్ ఎన్నో ఎక్స్‌పరిమెంట్సు చేసారట. ఈనాడు తెలివిగలవాళ్ళ స్పర్మ్‌ని తీసి స్త్రీలలో ప్రవేశపెట్టి పిల్లలను పుట్టిస్తున్నారు. స్పర్మ్ స్టోరేజ్‌బ్యాంక్ ఓపెన్ అయింది. ఇందులో గొప్ప మేధావుల స్పర్మ్‌న్ని కలెక్ట్‌చేసి ఉంచుతారు. వాళ్ళు చనిపోయినా ఫరవా లేదు—వాళ్ళ స్పరమ్‌స్‌ని ఉపయోగించి పిల్లలను పుట్టించవచ్చు-ఆ పిల్లలు తెలివి గలవాళ్ళవుతారు."

"తెలివిగలవాళ్ళకి తెలివిగల పిల్లలే పుడతారని నమ్మకం ఏమిటి? ఇప్పుడు ఓ కపుల్ ఉన్నారనుకో— అందులో భర్త అందవిహీనుడై బాగా తెలివికలవాడు కావచ్చు— భార్య ఎంతో అందగత్తె తెలివిలేని మొద్దు కావచ్చు - వీళ్ళ పిల్లలకి అతని అందం ఆమె తెలివి వచ్చాయనుకో, అప్పుడు— తెలివిగలవారయిన సంది తులకి పరమశుంఠలు పుట్టవచ్చు కదా—"

"అది నిజమే— దానికి గారంటీ ఏమీ లేదు— కాని ఎంతో తెలివికల ఆరోగ్యంగల స్త్రీలలో మాత్రమే ఈ స్పర్మస్‌ని ప్రవేశపెట్టాలి— అప్పుడు కొంతవరకు తెలివికలవాళ్ళే పుట్టవచ్చు—"

"నీకు ఈ విషయం తెలుసా 1864 సం॥ ఫ్రెంచ్ ఫిజిస్ట్, అగస్టీన్ మాచోట్ ఒక పవర్ బాయిలర్‌ని తయారుచేశాడట— ఈ బాయిలర్‌వల్ల కోల్ బదులు సూర్యకిరణాల వేడివల్ల వేడి పుడుతుంది— సోలార్ ఎనర్జీ ద్వారా ఫాక్టరీలను కూడ నడపడానికి, రాత్రిపూట మొత్తం పట్టణాలన్నింటిని కాంతివంతంగా చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి — అరె నేను మరిచిపోయా — ఇవాళ నాన్నగారు ఏదో పని ఉందన్నారు. నేను త్వరగా వెళ్ళిపోవాలి—"




"ప్రేమా.... అప్పుడే వెళ్ళిపోతావా! ఇంకాసేపు ఉండకూడదూ—"

"భరత్ మళ్ళీ వస్తాగా — సరేకాని ముందు నాకు ప్రామిస్ చేయి." అంటూ చేయిని ముందుకు చాచింది.

"ఏం....ప్రామిస్...." ఆమె చేతిని గట్టిగా నొక్కుతూ అన్నాడు భరత్—

"నీవు తప్పకుండా ఓ గొప్ప సైంటిస్టువి అవుతావని...."

"ప్రేమా...."

"మరి అవుతావు కదూ! నే వస్తా..." అంటూ గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది.

వెళ్ళిపోతున్న ప్రేమను కన్నార్పకుండా చూస్తూ నిల్చుండిపోయాడు భరత్.

గలగల పారుతున్న భరత్-ప్రేమల ప్రవాహానికి హఠాత్తుగా ఆనకట్ట పడ్డది. ఆరోజు ప్రేమ భరత్‌ల ప్రేమవ్యవహారాన్ని తెలుసుకున్న ప్రేమ తండ్రి— ప్రేమ పెళ్ళి ఆమె బావతో జరిపించాలని నిశ్చయించాడు. ప్రేమ తండ్రిని ఎంతో బతిమిలాడింది — ఆమె బయటకు కూడ రాకుండా తగినన్ని కట్టుదిట్టాలు చేశాడు ప్రేమ తండ్రి. భరత్ ప్రేమ ఫ్రెండ్ రజని ద్వారా విషయం తెలుసుకున్నాడు. ప్రేమను ఎంత కలుద్దామనుకున్నా కలవలేకపోయాడు. రజని ప్రేమ ఉత్తరాన్ని భరత్‌కిచ్చింది—

"భరత్!

ఈ విషయం ఎట్లా చెప్పాలో తెలియడంలేదు— నేను బంగారు పంజరం లోని చిలకని మాత్రమే. నాన్న నాకు, బావకు పెళ్ళి జరిపించాలనుకుంటున్నారు— ఏర్పాట్లు కూడ నా ప్రమేయం లేకుండానే జరిగిపోతున్నాయి. భరత్ మనం ప్రేమరాజ్యాన్ని ఏలుదాం అని అనుకున్నాం. కాని దుండగులు మన ప్రేమ రాజ్యాన్ని ధ్వంసంచేశారు. నేను ఎంత ప్రయత్నించినా నీ దగ్గరికి రాలేకపోతున్నాను— ఏ కూతురు తండ్రి శవందాటి తన ప్రియుడిని అందుకోగలుగుతుంది. భరత్ నన్ను అర్థంచేసుకో. నేను అసహాయురాలిని — నన్ను క్షమించు భరత్— ఎక్కడ ఉన్నా నీ అభివృద్ధిని కోరుతూనే ఉంటాను — నేను అనుకున్నట్లుగా నీవు గొప్ప సైంటిస్ట్‌వి అవుతావని ఆశిస్తాను—"

నీ కాలేని
ప్రేమ—

ఉత్తరం చదివిన భరత్ ఆవేశంగా మారిపోయాడు — బాధతో అతని హృదయం మూల్గింది— తరువాత ప్రేమ ఇంటికి వెళ్ళిన భరత్‌ని, ప్రేమతండ్రి ఎంతో అవమానించాడు— ప్రేమ పెళ్ళి జరిగిపోయింది — ప్రేమ తండ్రి ఆ ఇల్లు అమ్మేసి వెళ్ళిపోయాడు— ఆ తరువాత ప్రేమను భరత్ ఎప్పుడూ కలవలేదు—

ఈ లోకంలోకి వచ్చిన భరత్ తప్పకుండా, ప్రేమ భర్తకు ఆ ట్రీట్‌మెంట్ ఇవ్వాలని నిర్ణయం తీసుకున్నాడు.

## 10

డ్రాయింగ్‌రూమ్‌లోకి భరత్ తన తల్లిని తీసుకువచ్చాడు. ఎదురుకుండా కూర్చున్న ఇద్దరు వ్యక్తులను చూపింది శకుంతల. వాళ్ళిద్దరిని చూడగానే ఆమె కళ్లు ఎర్రబడ్డాయి. మెదడులో అనేకమయిన ఆలోచనలు వచ్చాయి.

"అమ్మా....ఇతను నా తండ్రేనా...." అంటూ రాధాకృష్ణవంక వేలుతో చూపెట్టాడు భరత్.

శకుంతల మౌనంగా నిల్చుంది.

"అమ్మా చెప్పమ్మా.... చెప్పు— ఇతడు నా తాతయ్యేనా— ఆనాడు ఇతను వచ్చివెళ్ళాక—అసలు విషయం విన్నడిగితే నీవు ఏదీ చెప్పటానికి నిరాకరించావు. ఇవాళ వీళ్ళిద్దరూ నా దగ్గరికి వచ్చారు. ఒకరు నా తండ్రిగా ఒకరు నా తాతగా..."

"భరత్— నీ తండ్రేనని అతడు ఒప్పుకున్నాడా—" కోపంగా రాధాకృష్ణ వంక చూస్తూ అంది శకుంతల.

"శకుంతలా! నీవు నన్ను మరిచిపోయావు కాని — నేను మీ ఇద్దరినీ అనుక్షణం గుర్తుచేసుకుంటూనే ఉన్నా—" అన్నాడు రాధాకృష్ణ.

"ఎందుకు — ఇంకా ఎక్కడైనా బతికిఉందేమోనని ఏడుస్తూ గుర్తుచేసుకున్నారా—" వ్యంగ్యంగా అంది శకుంతల.

"ఈనాడు నా కొడుకుని చూస్తే ఎంత సంతోషంగా ఉందో శకుంతలా. మీకు ఏది కావాలంటే అది సమకూరుస్తా—మీ రిద్దరూ మా దగ్గరికి వచ్చేయండి—"

"భరత్ ముందు వీళ్ళిద్దరిని పంపించేసేయి— నేను ఇక్కడ ఇంక ఒక్క క్షణం కూడ నిల్చోలేను—" అంటూ శకుంతల పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ విసురుగా వెళ్ళిపోయింది—

"నాయనా ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. ఆరోజు మీ అమ్మని ఎంత వద్దని బతిమిలాడినా ఇంట్లోంచి వెళ్ళిపోయింది. ఎన్నాళ్ళ నిన్ను చూడాలని తహతహలాడామురా— రారా.... ఒక్కసారి దగ్గరకురా—" అన్నాడు రాధాకృష్ణ.

"అసలు మిమ్మల్ని మామంచి వేరుచేసింది శకుంతల నాన్న— ఆయన అనాడు మీ అమ్మని మా మీదకు పురమాయించాడు. అన్ని సుఖాలకు దూరమై ఇన్నాళ్ళ బతికావురా— భరత్—" కళ్ళజోడును తీసి కళ్ళు నలుపుకుంటూ అన్నాడు సూర్యనారాయణ.

"మా తాతయ్యని, మా అమ్మని ఇంకోమాట అన్నారో మర్యాదగా ఉండదు. దయచేసి ఇంక మీరిద్దరు వెళ్ళిపోండి—" కోపంగా అన్నాడు భరత్.

"నాయనా భరత్! మాకు మీమీద ఉన్న ప్రేమను అర్థంచేసుకోరా—ఇవాళ ఇంతటివాళ్ళం నీ దగ్గరకు వచ్చామంటే నీమీద ప్రేమ ఉండే కదరా—" అన్నాడు సూర్యనారాయణ.

"భరత్ ఆ ట్రీట్‌మెంటు ఏదో ముందు మాకు చెయ్యి—నీ ఇష్టం. నువ్వేం అడిగితే అదే ఇస్తా. అనాడు నన్ను కాదని పోయినా ఈనాడు శకుంతలని భార్యగా ఆదరిస్తా."

"భర్త వదిలేసిన ఆడదంటే సమాజం ఎంతో హీనంగా చూస్తుంది. మళ్ళీ భర్త ఆదరించాడంటే ఆమెకు ఎంతో గౌరవం ఇస్తుంది. సరేకాని.... అసలు విషయానికి వద్దాం— ఆ ట్రీట్‌మెంట్ ఏదో...." నసిగాడు సూర్యనారాయణ.

"ఏ ట్రీట్‌మెంటు లేదు— ప్రస్తుతం దాని విషయం వదిలేయండి— ఇంక తమరు దయచేయండి—"

"భరత్ ఏదో చిన్నవాడివి కదా అని బ్రతిమిలాడుతూ చెప్పా. నీవు ఒప్పుకోకపోతే—" జేబులోంచి ఒక కవరు తీస్తూ అన్నాడు రాధాకృష్ణ.

"ఏం. ఏంచేస్తారు? మీ బెదిరింపులకు నేను లొంగను—"

"ఉహూ.... లొంగవా? ఇవిగో ఇవి చూడు—" అంటూ కవరులోని కొన్ని ఫోటోలను టీపాయ్‌మీద పడేశాడు.

ఒక ఫోటోను తీసుకున్నాడు భరత్. అతని ముఖంలోని రంగులు మారాయి. ఒకటి.... రెండు.... మూడు—అవును అమ్మే.... అమ్మ పోలికలు బాగా కనిపిస్తున్నాయి. ఆమె పక్కన ఎవరో ఒకతను. . ఎంత అశ్లీలంగా ఉన్నాయి— అతనికే సిగ్గువేసింది. అమ్మా నీ చరిత్ర ఇట్లాంటిదా — ఉహూ.... కాదు — ఇది నిజంకాదు— కాని అబద్ధం ఎట్లా అవుతుంది. తన చేతిలోఉన్న ఫోటోలు నిజాన్ని బయలుపరుస్తున్నాయి. అతనికి తల తిరుగుతున్నట్లుగా అనిపించింది— ఆకాశం విరిగి మీదపడుతున్నట్లుగా అనిపించింది.

"కాదు.... కాదు.... ఇందులో ఉన్నది మా అమ్మ కాదు — మా అమ్మ నిప్పంత పవిత్రురాలు.... ఇదంతా ఏదో గూడుపుఠానీ—" పెద్దగా అరిచాడు భరత్.

"ఇది మీ అమ్మ కాదు అని ఎవరనగలరు?— మర్యాదగా మేం చెప్పింది ఒప్పుకున్నావా సరే. లేకపోతే వీటన్నింటినీ పేపర్లలో వేయిస్తాం— నీకు అప్పుడు ఏమాత్రం గౌరవం ఉండదు. నీ తల్లి ఎటువంటిదో నీవు కళ్ళారా చూస్తున్నావుగా— ఇదిగో పెళ్ళిఫోటో. ఇతనే మీ నాన్న—" అంటూ పెళ్ళిఫోటోను భరత్ కిచ్చాడు సూర్యనారాయణ.

"భరత్.... ఇటువంటి నీ తల్లిని ఇప్పటికి కూడ నేను స్వీకరిస్తాను—అని అంటుంటే నాది ఎంత మంచి మనస్సో అర్థంచేసుకో— ఇంతకుముందు ఇన్నేళ్ళు మీ అమ్మవల్ల నేను ఎన్నో అవమానాలు పొందాను — మీ అమ్మ మన్మథలీలలు కళ్ళారా చూస్తున్నావుగా— ఒక్కొక్క రాత్రి ఒక్కొక్కడితో—"

"స్టాప్‌ఇట్.... ఇంకేమీ మాట్లాడకండి—" అంటూ రెండుచెవులు మూసుకున్నాడు భరత్.

"ఆ ఫోటోలు ఇటిచ్చేయి " అన్నాడు రాధాకృష్ణ.

"నేనివ్వను. వీటిని కాల్చేస్తా—" ఆవేశంగా అన్నాడు భరత్.

"ఆవేశపడకు— వీటిని కాల్చేసినా మా దగ్గర నెగెటివ్‌లు ఉన్నాయి—"

భరత్‌కి ఏం చెప్పాలో తోచలేదు—

"సరే నీకు కొంత టైమ్ ఇస్తున్నాం- ఆలోచించుకో-" అంటూ ముందు నడిచాడు సూర్యనారాయణ.

రాధాకృష్ణ భరత్ దగ్గరిగా వచ్చాడు-"భరత్ మేం చెప్పింది ఒప్పుకో- నీ తండ్రి మాట కాదనకు. మా నాన్నకన్నా ముందు- ట్రీట్‌మెంటు నాకు ఇవ్వ- నీ వేది కావాలంటే అది ఇస్తా- నా కొడుకువైతే నా మాట కాదనకు-" అంటూ రాధాకృష్ణ బయటకి వెళ్ళిపోయాడు.

భరత్ గాఢంగా ఓ నిట్టూర్పు విడిచాడు. ఫొటోలు తీసుకుని లోపలికి వెళ్ళి తల్లి ముందు వాటిని ఉంచాడు.

"అమ్మా ఈ ఫొటోలు చూడు- రేపు పేపర్లలో వేయిస్తామంటూ బెదిరించి పోయారు. ఛీ నాది ఒక బ్రతుకేనా-"

"బాబూ! అట్లా అనకురా-" అంటూ ఫొటోలు చేతిలోకి తీసుకుంది. ఆమె కళ్ళు అప్పటికే వాచి ఉన్నాయి. ఒక్కొక్క ఫొటో చూస్తున్నకొద్దీ మనసు అవమానంతో దహించుకుపోసాగింది.

"భరత్- ఈ ఫొటోలు ఎక్కడివిరా- నేనంటే ఎంత గిట్టకపోయినా ఇంత ఘోరంగా నన్ను అవమానం చేయడానికి వాళ్ళకి మనస్సెలా ఒప్పింది!"

"అమ్మా.... అసలు నా తండ్రి ఎవరు?"

"హు.... నీ తండ్రి అడుగో ఇందాక వచ్చాడుగా ఆయనే."

"మరి ఈ ఫొటోలు- ఈ ఫొటోల్లో ఉన్నాయన, ఇప్పుడు వచ్చిన ఆయన ఒకరు కాదుగా- అంటే నీకు.... వీళ్ళందరూ చెబుతున్నట్లుగా నీ చరిత్ర.... చెప్పమ్మా....చెప్పు-అయినా ఇంకా నీవేం చెప్పగలుగుతావు. సాక్ష్యాలు కూడ..."

భరత్ ఇవాళ నీకు సంజాయిషీ చెప్పాల్సివచ్చినందుకు అవమానంతో దహించుకుపోతున్నారా - ఇటువంటి పరిస్థితి ఏ కొడుకుముందు ఏ తల్లికి రాకూడదురా-"

"అమ్మా.... ఇప్పుడే నేను వాళ్ళదగ్గరికి వెళ్తున్నా- వాళ్ళు చెప్పిందానికి ఒప్పేసుకుంటా- లేకపోతే రేపు నేను తలెత్తుకు తిరగలేను-"

"భరత్.... ఆ నరరూప రాక్షసులకు లొంగిపోకు- ఈ ఫొటోలో ఉన్న అమాయకుడైన ఈ వ్యక్తికి- నాకు సంబంధం అంటగట్టిన వీళ్ళు ఏం చేసినా పాపంలేదు ఈ ఫొటోలను మెడలో కట్టుకు తిరగనీ. నేను నీకు తల్లిని కాదని అందరికి చెప్పేస్తా నీవు అవమానంతో తల దించుకు తిరగాల్సిన అవసరం ఉండదు నీ తల్లి ఏనాడో చచ్చిపోయిందని చెప్పుకో- ఈ ఫొటోల్లో ఉన్నది నా తల్లే కాదు అంటే నిన్ను ఎవరేమి అంటారు-"

"అమ్మా.... నిన్ను తల్లివి కాదు అని నేనెట్లా చెప్పను - నన్ను కని, పెంచి, నేను నవ్వితే.... నవ్వి.... ఏడిస్తే ఏడ్చి.... నాకోసం.... నా భవిష్యత్తు కోసం అహోరాత్రులు శ్రమించిన నిన్ను- నా తల్లి కాదు అని .... అంతకన్నా నేను ఉన్నపళంగా చచ్చిపోవడం మంచిదమ్మా...." భరత్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి-

ఇంతలో జగన్నాధరావు ఆ గదిలోకి వచ్చారు.

"నాన్నా...." అంటూ శకుంతల జగన్నాధరావును పట్టుకుని ఏడ్చింది.

"ఏం జరిగిందమ్మా-" అంటూ శకుంతల తలను నిమిరాడు రావు.

"ఏనాడో సంబంధాన్ని తెంచుకుపోయిన ఆ సూర్యనారాయణ, ఆ రాధా కృష్ణ ఇవాళ వచ్చారు-" కసిగా అంది శకుంతల.

"ఏం ఇవాళ మనతో ఏం అవసరం వచ్చింది-"

"ఈనాడు మనవడు కావల్సివచ్చాడు- వాడి ఫార్ములా కావలసివచ్చింది-"

"ఆహా.... అదా.... సంగతి-"

"వాళ్ళు అడిగిందానికి ఒప్పుకోలేదని- తాతయ్యా.... ఇదిగో ఈ ఫోటో లను బయటపెట్టి మనల్ని రచ్చకీడుస్తారుట-" అన్నాడు భరత్ దీనంగా-

"భరత్ — ఆ ఫొటోలు ఇటివ్వు.... నాన్నకి ఇవ్వొద్దు-" ఫోటోలు తీసుకుని, దాచుకో ప్రయత్నించింది శకుంతల. కాని వాటిలో ఒకటి జారి కింద పడిపోవడంవల్ల- తన చేతిలోకి తీసుకున్నాడు రావు. ఫోటోను చూస్తున్న ఆత నికి తన కళ్ళేనా చూస్తున్నది అని అనిపించింది-

"ఛీ ఎవడురా ఇటువంటి ఫొటోలను తీసింది- తగులబెట్టు వాటిని-"

"ఈ పరిస్థితుల్లో ఏం చేయాలో అర్థంకావడంలేదు- అయినా నీవు నాన్నని వదిలేసి ఎందుకు వచ్చావు-ఈరోజు నన్ను అందరిముందు ఇట్లా నిలబెట్టడానికా-" కోపంగా అన్నాడు భరత్.

"భరత్ ఇంక ఎక్కువగా మాట్లాడకు- నా కూతురు ఏ పరిస్థితుల్లో వదిలివేసి వచ్చిందో తెలిస్తే- ఇట్లా మాట్లాడవురా-" అన్నాడు రావు బాధగా.

"అనాడు నేను వాళ్ళదగ్గరే ఉంటే ఈనాడు నీ ఉనికే ఉండేది కాదురా భరత్-"

"ఏమిటి ఆ పరిస్థితులు-అసలేం జరిగింది- చెప్పమ్మా....చెప్పు-" అన్నాడు భరత్ తల్లిని బ్రతిమిలాడుతూ-

"అయితే విను చెబుతా-" అన్నది శకుంతల.

శకుంతల చెప్పడం ప్రారంభించింది-



## 11

శకుంతల తండ్రి, సూర్యనారాయణ ఒకే ఊరివాళ్ళు. రావు ఆ వూళ్ళో టీచరుగా పనిచేస్తూ ఉండేవాడు. సూర్యనారాయణ పొలంమీద వచ్చేరాబడితో, కొడుకు అయిన రాధాకృష్ణను పట్నంలో చదివిస్తూ ఉండేవాడు. శకుంతలని తన కొడుక్కిచ్చి పెళ్ళిచేయమని సూర్యనారాయణ అడగడంవల్ల రావు పెళ్ళికి ఒప్పుకున్నాడు. తల్లిలేని తన కూతురును అతను ఎంతో అల్లారు ముద్దుగా పెంచాడు. తన చిన్నారి శకుంతలను వాళ్ళకి అప్పగించాడు.

అత్తవారింటి అన్ని సుఖాలతో వర్థిల్లమని....దీవించిందా తండ్రి హృదయం.

"శకుంతలా నీ జీవితవనంలో ఎప్పుడు వసంతమే ఉండాలి. నువ్వు నిండుగా

నవ్వుకోవాలి - నీ కళ్ళలో ఎప్పుడు కాంతి నిండుకోవాలి నీ చేతులు ఎప్పుడూ కందిపోకూడదు-నీ సున్నితమైన పాదాల్లో ఎప్పుడు ఏ ముల్లు గుచ్చుకోకూడదు-నీ ప్రతి అడుగుకు జయం కలగాలి. నీ కురులలో ఎప్పుడూ గులాబీలు, చేమంతులు మల్లెలు విరబూయాలి-" అంటూ ఆ మాష్టారు దీవించాడా కుసుమాన్ని-అతని కళ్ళు చెమ్మగిల్లాయి. ఆనందబాష్పాలు రాలాయి.

"అమ్మా శకుంతలా! ఈ తండ్రి దీవెన నీ కెప్పుడూ ఉంటుంది."అని అనుకుంటూ తృప్తిగా కళ్ళుమూసుకున్నాడు.

శకుంతల ఎన్నో ఆశలతో, జీవితం అంతా నందనవనంలా ఊహించుకుని పుట్టిల్లు వదిలి మెట్టినింట్లో అడుగుపెట్టింది. తన బాట అంతా పూలబాటే అని ఊహించుకున్న శకుంతలకి, ఆ బాట ముళ్ళబాట అని తెలుసుకోవడానికి ఎక్కువ కాలం పట్టలేదు. క్రమంగా ఆమెకు అన్ని నిజాలు తెలియసాగాయి - తన భర్త తండ్రిచేతిలో కీలుబొమ్మ. తండ్రిమాట వినవద్దని తను మాత్రం ఎప్పుడైనా అన్నదా - కాని తన భర్త - తండ్రి ఎంత చెబితే.... అంతే.... ఏ మాత్రం వ్యక్తిత్వంలేని రాధాకృష్ణతో శకుంతల జీవితం అతి దుర్భరం కాసాగింది. చిన్నప్పటినుంచి శకుంతలకు ఆలోచనాశక్తి బాగా ఉండేది. ఆమె ముందే తన భర్తకు ఒక రూపాన్ని ఇచ్చుకుంది. ఆ రూపం ప్రకారం, ఆ వ్యక్తి డూ.... డూ....బసవన్న కాకూడదు. ప్రతివాళ్ళ ఎదుట తలవంచకూడదు. అతనిలో ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉండాలి. అతడు ప్రతీ విషయాన్ని తన బుర్రను విని యోగించి ఆలోచించగలగాలి. వీచే ప్రతి చిన్నగాలికి మొక్కలా అటు ఇటు వంగిపోకూడదు. ఆ గాలిని ప్రతిఘటించి నిలబడాలి. మార్గంలో ఉన్న రాళ్ళని తప్పుకుని వేరే మార్గంకుండా పోకూడదు. ఆ రాయిని కాలితో ఒక తన్ను తన్ని తన మార్గాన పీరుడిలా నడిచిపోవాలి. కాని శకుంతల ఊహించుకున్న రూపానికి ఈ రూపానికి ఎక్కడా పోలికలేదు. ఆ రూపంముందు ఈ రూపం సూర్యుడి ముందు మిణుగురుపురుగు లాంటిది. ఆ రూపం హిమాలయం అంత ఔన్నత్యం గలది- కాని ఈ రూపం ఒక గులకరాయి మాత్రమే-

శకుంతల ఆ ఇంట్లో కుళ్ళికుళ్ళి ఏడుస్తూ ఒంటరిగా జీవించడానికి అలవాటు పడ్డది సూర్యనారాయణ ఆ ఊరు వదిలి పట్నానికి మకాం మార్చాడు. ఊళ్ళో ఉన్నన్నాళ్ళ కోటలు ఎక్కడ ఉన్న ధనవంతులని,వాళ్ళుచేసే చీకటిపనులని బయట పెడతానంటూ బెదిరించి ఎంతో డబ్బు సంపాదించాడు. పట్నంవచ్చాక మెల్లగా ఓ చిన్న పరిశ్రమని మొదలుపెట్టాడు కొంతకాలం అయ్యేసరికి దానిమీద ఆదాయం




బాగా పెరగసాగింది. తండ్రీ కొడుకులు ఎప్పుడూ పనులమీద బయట తిరుగుతూ ఉండేవాళ్ళు. ఇంటికివచ్చినా ఆ కాస్సేపు శకుంతలని బతకనిచ్చేవాళ్ళుకారు— వాళ్ళిద్దరూ ఆమెని ఎన్నోవిధాల హింసిస్తూ ఉండేవాళ్ళు-శకుంతల తను గర్భవతి అని తెలిసి ఎంతో సంతోషపడ్డది భర్త ఆనందంకోసం తహతహలాడేది. ఆమె గర్భవతి అని తెలియంగానే సూర్యనారాయణ ఇప్పుడే పిల్లలెందుకు - అంటూ గర్భాన్ని తీయించేసుకోమని కొడుకుద్వారా చెప్పించాడు. శకుంతల మాత్రం ఒప్పుకోలేదు. తండ్రికి ఉత్తరంవ్రాసి పిలిపించింది. తండ్రితో పాటు శకుంతలకు చిన్నప్పటినుంచి వండిపెడుతూ ఆమె మంచిచెడ్డలను చూసిన జగదాంబకూడ వచ్చింది. రోజూ ఏవో నాటుమందులు తెచ్చి ఇచ్చి వాటిని తినమని శకుంతలని రాధాకృష్ణ ఎంతో బలవంతం చేసేవాడు. జగదాంబ శకుంతలని ఆ మందులు తింటున్నట్టుగా నాటకమాడమనేది - మొత్తానికి తండ్రీకొడుకులు ఇంక ఆమెకు గర్భస్రావం కాదని నిశ్చయించుకున్నారు.

శకుంతల మొగపిల్లవాడిని కన్నది—కొడుకైన భరత్ని చూసయినా రాధాకృష్ణ మారతాడేమో అని శకుంతల ఎంతో ఆశపడ్డది. కాని ఆశ నిరాశే అయింది. రావు జగదాంబలతో కూడ, తండ్రీ కొడుకులు ఎంతో హీనంగా ప్రవర్తించేవాళ్ళు. ఓ రోజు సూర్యనారాయణ జగదాంబ చేయిపట్టుకొని ఎంతో అవమానం చేసాడు. ఇంక అక్కడ ఉండటం మంచిది కాదని, ఏమీ చెయ్యలేక జగదాంబ, రావు అప్పటికప్పుడే తమ ఊరికి వెళ్ళిపోయారు.

భర్త, మామగారు తనని ఎంత హింసిస్తున్నా శకుంతల వాళ్ళని ద్వేషించకుండా అమరాగ, అదర, గౌరవాభిమానాలతో వాళ్ళని చూసేది - రోజులు దొర్లిపోతున్నాయ్. రాధాకృష్ణ సూర్యనారాయణలో ఏ మార్పు శకుంతలకి కనిపించలేదు. రెండుమూడు నెలలకొకసారి తండ్రికి ఉత్తరం వ్రాసి ఐదువేలు-ఆరువేలు తెప్పించు అంటూ శకుంతలని రాధాకృష్ణ పీడించసాగాడు. ఎవరిద్వారావో రావుకి చాలా ఆస్తి కలిసివచ్చింది అన్న విషయం విన్న సూర్యనారాయణకు మరీ డబ్బు దాహం ఎక్కువయింది. ఎన్నోసార్లు వాళ్ళు చెప్పినట్లుగానే తండ్రికి ఉత్తరం వ్రాసి డబ్బుని తెప్పించింది శకుంతల. ప్రతిసారి ఈసారికి తెప్పిస్తే ఇక అడుగరులే అని అనుకుంటూ ఉండేది. ప్రతిసారి తండ్రికి వ్రాయాలంటే అభిమానం అడ్డువచ్చేది తండ్రి ఏమనుకుంటాడో- ఎంత బాధపడతాడో అని ప్రతిరోజూ తనలో తను కుమిలిపోయేది - ఆ రోజు రాధాకృష్ణ తన తండ్రికి ముప్పైవేలు అర్జంటుగా కావాలని లెటర్ వ్రాసి తెప్పించమని శకుంతలకి చెప్పాడు. శకుంతల ఇంక వీళ్ళకి ఎదురుతిరిగితే కాని లాభంలేదనుకుంది.

"నేను ఇంక వ్రాయను-"

"ఎవడికోసం వ్రాస్తావ్- మర్యాదగా వ్రాసి తెప్పించు-"

"నేను తెప్పించను" కోపంగా అన్నది శకుంతల.

"నీ కాపురం నిలబడాలంటే నే చెప్పిన పని చెయ్యి-"

"ఎన్నాళ్ళిలా మా నాన్నను పీల్చి పిప్పిచేసి నా కాపురం నిలబెట్టుకోమంటారు. నాకు మానాభిమానాలు ఉన్నాయి- నే నీసారి వ్రాయను."

"వ్రాయవూ- మమ్మల్నెదిరించే ధైర్యం నీకు వచ్చిందా." శకుంతల చెంప మీద ఛెళ్ళున వేశాడు రాధాకృష్ణ.

శకుంతల___అబ్బా___అని చెంప నిమురుకుంది.

ఒక ఇన్‌లాండ్ లెటర్ తీసుకువచ్చాడు రాధాకృష్ణ.

"ఊ తీసుకో ఇదిగో పెన్ వ్రాయి" అన్నాడు.

"నేను చచ్చినా వ్రాయను-" అన్నది శకుంతల ఆవేశంగా.

శకుంతలను పిచ్చికోపంతో కొట్టాడు రాధాకృష్ణ.

"అమ్మా అమ్మా . ." బాధ భరించలేక అరిచింది శకుంతల.

సూర్యనారాయణ బయటనుంచి తలుపు కొట్టాడు. రాధాకృష్ణ తలుపు తెరిచాడు.

"ఏమిటిరా! గొడవ— నా నిద్ర చెడగొడుతున్నారు—"

"మీ దడిగిన ముప్పైవేలు తెప్పించమంటున్నా - కాని దీనికి ఏం పుట్టిందో పనేమిరా వ్రాయనంటోంది—" అన్నాడు రాధాకృష్ణ.

"ఏం ఒళ్లు బాగా పొగరెక్కిందా - మేం చెప్పినట్లు చేస్తేనే ఇక్కడ నీ బతుకు వెళ్ళిపోతుంది—" అన్నాడు సూర్యనారాయణ.

"నడుస్తున్న శవంలా ఇంకా ఎన్నాళ్ళు బతకమంటారు. ఇంక నాకీ బతుకు అక్కరలేదు—" అన్నది శకుంతల.

"నీ చావుబతుకులతో మాకేం పనిలేదు. ముందు వ్రాయి ముప్పైవేలు తెప్పించు—"

"ఇవాళ నేను ఏది ఏమైనా సరే వ్రాయను—"

"అయితే ఇంక ఇక్కడ ఒక్క క్షణం ఉండటానికి వీల్లేదు—పో వెళ్ళిపో" గది దద్దరిల్లేలాగా పెద్దగా అరిచాడు సూర్యనారాయణ శకుంతలలో పట్టుదల ఎక్కువయింది.

"ఈ రాత్రిపూట నన్నెక్కడికి పొమ్మంటారు— రేపు వెళ్ళిపోతా—"

"మమ్మల్ని ఎదిరించాక రాత్రిలేదు పగలులేదు. ఊ వెళ్ళు. ఇంకో క్షణం ఇక్కడ ఉన్నావంటే నీవు నీ కొడుకు ఈ లోకంలో ఉండరు—"

"వెళ్ళవే వెళ్లు, ఎక్కడికి వెళతావో— ఈ రాత్రి నీవు ఉంటానన్నా ఉండ నీయను— బయట వెళ్ళాక కాని మా విలువ నీకు తెలియదు—" అన్నాడు రాధాకృష్ణ శకుంతల జుట్టు పట్టుకుని గది గుమ్మం బయటవరకు ఈడుస్తూ—

శకుంతల ఆ పట్టును విడిపించుకుంది — ఉయ్యాల దగ్గరికి వెళ్ళి భరత్‌ని చేతిలోకి తీసుకుంది. విసవిసా నడుచుకుంటూ బయటకి వెళ్ళిపోయింది - లోపల నుంచి రెండు తలుపుల్ని ధబేల్మని మూసేశాడు సూర్యనారాయణ.

## 12

బయట విపరీతమయిన చలిగా ఉంది. పది అడుగులు వేసిందో లేదో శకుంతలలో ఒణుకు ప్రారంభం అయింది. భరత్ కూడ ఒణకడం ప్రారంభిం చాడు. తన కొంగును భరత్‌కి కప్పింది. ఆమె మనస్సు పరిపరివిధాల పోతోంది. బాగా చీకటిగా ఉంది. వెంటనే ఆమెకు మాలినీదేవి గుర్తుకు వచ్చింది. గేటు తెరిచి లోపలికి వెళ్ళింది. మాలినీదేవి తలుపుతెరిచి శకుంతల చెప్పింది విని మళ్ళీ తలుపు వేసేసుకుంది. ఆమెకు ఆ రాత్రి చోటిస్తే ఆ తరువాత సూర్యనారాయణ ఏమంటాడో అని భయపడింది మాలినీదేవి.

బయట ఉన్న శకుంతల ఘోరున ఏడ్చింది. ఆ ఏడ్పు ఆమెను ఎంత మాత్రం కరిగించలేదు.

శకుంతల అడుగులు ముందుకు పడ్డాయి- వెచ్చగా ఆమె వొంటికి తగులు తున్న భరత్ స్పర్శ ఆమెకు ధైర్యాన్ని కలిగించింది. గబగబా నడవసాగింది. కాని ఇంతలో వెనకనుంచి ఓ ఇద్దరు రౌడీలు ఆమె కొంగు గుంజారు. ఆమె విడిలించుకుని పరుగెత్తసాగింది. కొంతదూరం వచ్చాక ఆమె ఆయాసంతో ఆగి పోయింది. ఆ ఇద్దరూ ఆమె వెనకాలే వచ్చారు.

"అరెయ్- మంచి ఛాన్సురా-" అన్నాడు వాళ్ళల్లో ఒకడు.

"మంచి పిట్టే దొరికింది-" అన్నాడు మరొకడు.

"జాగ్రత్త మరో అడుగు ముందుకువేశారో-" శకుంతల ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుంటూ అన్నది.

"హెహె ఆసలే చలిగా ఉంది- దగ్గరికి రాహె-" అంటూ ఒకడు భరత్‌ని తీసుకోవడానికి ప్రయత్నించాడు. శకుంతల భరత్‌ని గట్టిగా పట్టుకుంటూ ముందుకు నడిచింది- వాళ్ళిద్దరూ ఆమెను గట్టిగా పట్టుకున్నారు. ఆమె వాళ్ళను విదిలించికొట్టింది. బాగా తాగి ఉన్నారేమో ఇద్దరూ ముందుకు తూలారు- ఈ లోపల శకుంతల కొత్త ముందున్న ఓ గుమ్మంలోకి వెళ్ళింది. తలుపును దబ దబా కొట్టింది మళ్ళీ ఆ ఇద్దరు ఆమెదగ్గరికి వచ్చారు "రక్షించండి .. రక్షిం చండీ " అంటూ అరిచింది శకుంతల. తలుపులు తెరుచుకున్నాయి. ఓ యువ కుడు గుమ్మంలోకి వచ్చాడు. శకుంతలను, ఆమె వెనక ఉన్న ఆ ఇద్దరు మను ష్యులను చూడంగానే పరిస్థితిని అర్థంచేసుకున్నాడు లోపలికి వెళ్ళి బయట లైటు వేశాడు. ఆ ఇద్దరూ తూలుకుంటూ వెళ్ళిపోతున్నారు. బయటే వణుకుతూ నిల్చున్న శకుంతల- "లోపలికి రావిస్తారా" అని అంది.

వెలుతురులో శకుంతల ముఖం చూసి ఆశ్చర్యపోయాడు ఆ యువకుడు.

"అరె ఎట్లా వణికిపోతున్నారో - రండి లోపలికి - అదుగో వాళ్ళిద్దరూ పారిపోతున్నారు-" అన్నాడు ఆ యువకుడు వాళ్ళిద్దరివంక చూస్తూ-

లోపలికి వచ్చింది శకుంతల.

"పాపం బాబు ఎట్లా ఒణికిపోతున్నాడో-" అంటూ వెళ్ళి మంచంమీద ఉన్న రగ్గును తీసుకువచ్చాడు.

"బాబుని ఇట్లా ఇవ్వండి-" అన్నాడా యువకుడు,

శకుంతల అతనివంక ఓసారి చూపి భరత్‌ని ఇచ్చింది. భరత్‌కి రగ్గుకప్పి మంచంమీద పడుకోబెట్టాడా యువకుడు.

"కాస్సేపు విశ్రాంతి తీసుకోండి, మీ ఇల్లు పక్క గల్లీలోనే కదూ- నేను వచ్చి దింపుతాలెండి- పాపం మధ్యదారిలో మీరెంత అవస్థపడ్డారు" అంటూ కుర్చీతెచ్చి వేశాడు,

"అయితే నేనెవరో మీకు తెలుసా-" అన్నది శకుంతల.

"సూర్యనారాయణగారి కోడలు కదూ – మీ వార్ని కూడ చాలాసార్లు చూశాను. కాని పరిచయం లేదు. ఆ రౌడీలు మిమ్మల్ని ఎక్కడమంచి వెంబడించారు- అరె మీ నుదిటిమీదనుంచి రక్తం వస్తోంది-" గాభరాగా అన్నాడు.

శకుంతల నుదిటిని చేత్తో తడిమి చూసుకుంది. చేతికి రక్తం తగిలింది. అతను తెల్లటి బట్ట ఆమెకిచ్చాడు. శకుంతల ఆ తెల్లని బట్టలోంచి పేలిక చించి తలకి కట్టుకుంది.

"మరి మీ ఇంటికి బయలుదేరుదామా-" అన్నాడా యువకుడు.

"ఆ ఇంటి తలుపులు నాకోసం తెరవబడవు-" బాధగా అన్నది శకుంతల.

అర్థంకానివాడిలా ముఖం పెట్టాడా యువకుడు.

"నా కొక సహాయం చేసి పెట్టగలరా."

"తప్పకుండా చేస్తాను- చెప్పండి-"

"ఈ ఒక్క రాత్రి మీ గదిలో నాకు ఆశ్రయం ఇవ్వండి-"

"మీరు....మీరు.... ఈ రాత్రి ఇక్కడుంటారా-"

"అవును....ఏం....ఉండటానికి వీల్లేదా-"

"మీ ఇంటికి మీరు ఎందుకు వెళ్ళరు. మీరు వెళ్ళలేని పరిస్థితే అయితే తప్పకుండా ఉండండి- కాని రేపు పొద్దున్నయినా-"

"రేపు పొద్దున నేను మా ఊరికి వెళ్ళిపోతా - ఇంక ఆ ఇంట్లో నేనొక క్షణం కూడ ఉండలేను. ఈ రాత్రి నన్ను వాళ్ళు వెళ్ళగొట్టారు. ఎంతసేపు వాళ్ళకి డబ్బుపిచ్చి తప్పితే మరొకటి లేదు. మా నాన్ననుంచి ఎంతో డబ్బు గుంజారు. ఇవాళ మళ్ళీ దానికోసమే పీడించారు-"

"వాళ్ళంత డబ్బుమనుషులా-"

"డబ్బు మనుషులే కాదు మనసు లేని మనుషులు కూడ నన్ను పీల్చి పిప్పి చేశారు."

"మీరు బాధపడకండి - మీకు ఇక్కడ ఎటువంటి కష్టం కలుగదు. మీ కెట్లా తోస్తే అట్లా చేయండి-"

"మీరు మనిషి కాదు—దేవుడు—"

"అంత పెద్ద పదాలు వాడాల్సిన అవసరం ఏమీలేదు. మనిషికి తోటిమనిషి చేయవల్సిన సహాయం చేస్తున్నా, అంతే-"

"ఈ రాత్రి ఈ ఆశ్రయం దొరకకపోతే నా బ్రతుకు ఏమయ్యేదో-మీకు ఎట్లా కృతజ్ఞత తెలపాలో తెలియడంలేదు. మీ పేరు-"

"రమాకాంత్- ఆరే బాబు కదుల్తున్నాడు. మీరు, బాబు మంచంమీద పడుకోండి నేను కింద పడుకుంటా- నాది బ్రహ్మచారి రూమ్—అందులోను స్టూడెంట్ రూమ్‌లో ఏముంటాయి—?"

"ఏమీ లేకపోయినా ఫరవాలేదు- తల దాచుకోవడానికి చోటిచ్చారు—అంతే చాలు- అయితే మీరింకా చదువుతున్నారన్నమాట-" అంటూ భరత్‌ని మరో వైపు తిప్పి పడుకోబెట్టింది.

"మీరు ఆ మంచంమీద పడుకోండి- నేను, బాబు కింద పడుకుంటాం-"

"ఊహూం. ఒద్దు అసలే చలిగా ఉంది మీరేమో—ఒణికిపోతున్నారు"

శకుంతలకి లోపలినుంచి విపరీతమయిన చలి పుట్టుకొచ్చింది - ఇంక చలికి ఆగలేక భరత్‌మీద ఉన్న రగ్గును తను కాస్త లాక్కుని రెండుకాళ్ళు ముడచుకొని మంచంమీద కూర్చుంది.

"కాఫీ వేడివేడిగా టీ త్రాగండి- కొంతవరకు తగ్గుతుంది."

శకుంతలకు విపరీతమయిన తలనొప్పి బాధ మొదలయింది.

"రమాకాంత్‌గారూ! మీకు ట్రబుల్ ఎందుకు - ఎట్లాగొట్లా పడుకుంటా లెండి- తెల్లవారిపోతుంది-"

కొంచెంసేపటికి రమాకాంత్ టీ తయారుచేసి ఓ కప్పులో పోసి ఆమె కిచ్చాడు. తాను ఓ సగంకప్పు తీసుకున్నాడు.

"ఏమీ అనుకోకండి- పాలు మరిన్ని లేవు. టీ నల్లగా ఉంది-"

శకుంతల కప్పును అందుకొంది- గబగబా తాగేసింది. లోపలికి వేడివేడిగా వెళ్ళేసరికి కాస్త చలి తగ్గినట్లుగా అనిపించింది-

శకుంతలకి ఏమీ మాట్లాడాలనిపించలేదు. గుండె బరువుగా అనిపించింది- మంచంమీద పడుకుంది. మంచం కిర్రుమంది- రమాకాంత్ ఓ చాప వేసుకుని కూర్చున్నాడు. అతనిదగ్గర మరో దుప్పటి లేకపోవడంవల్ల అతను చాపమీద

ముడుచుకుని, ముడుచుకుని కూర్చున్నాడు. ఓ పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు. చదివిందే మళ్ళీ చదవడం మొదలుపెట్టాడు. అతనికి సన్నగా మూలుగు వినిపించింది- వెంటనే లేచాడు. శకుంతల మంచందగ్గరిగా వచ్చాడు. ఆమె మగతగా కళ్ళు మూసుకుని మూల్గుతోంది- కొంచెంసేపు అట్లానే చూస్తూ నిల్చుండిపోయాడు భరత్ అటుఇటు తిరగడంవల్ల దుప్పటి పక్కకి వచ్చేసింది - దుప్పటిని సరిచేయబోయాడు రమాకాంత్. భరత్‌కి మెలకువ వచ్చింది ఏడవటం మొదలుపెట్టాడు. శకుంతల కళ్ళు తెరిచింది. సరిగ్గా అప్పుడే శకుంతలమీదకు వంగి రమాకాంత్ అవతల ఉన్న బాబుని చేతిలోకి తీసుకుందామని ప్రయత్నిస్తున్నాడు. శకుంతల వెంటనే లేచింది. రమాకాంత్ చేతులు ఆమెమీద పడ్డాయి. ఈ హఠాత్ సంఘటనకి అతను ఎట్లాగో అయిపోయాడు. శకుంతల ఏమనుకుంటో ఏమో అని అనుకున్నాడు. నెమ్మదిగా ఆమె అతని చేతులను పక్కకి తోసింది. పిల్లవాడిని ఒడిలోకి తీసుకుంది- బాబు ఇంకా పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు.

"నేను నేను " రమాకాంత్ సిగ్గుతో తల దించుకున్నాడు.

"మిమ్మల్ని నేను అపార్థంచేసుకోములెండి-"

"బాబు ఏడుస్తున్నాడు.. అనవసరంగా మీ నిద్ర పాడవుతుంది తీసుకుందా కదా అని "

"ఇప్పుడు మిమ్మల్ని నేను సంజాయిషీ అడిగానా-" అతనివంక చూసింది. ఆమె దృష్టి అతని తెల్లటి షర్టుమీద పడ్డది - ఎర్రగా మరక కనిపించింది. అది తన నుదుటి కుంకుమే అని తెలుసుకుంది - ఓసారి అ కుంకుమరంగు అంటితే తొందరగా అరిపోదు. ఆమెకు కూడ సిగ్గనిపించింది- భరత్ ఏడుపు పెద్దదయింది- కాస్సేపు ఒళ్ళో పడుకోబెట్టుకుని జోకొట్టింది. కాస్సేపటికి బాబు నిద్రపోయాడు. శకుంతలకి కడుపులో తిప్పుతున్నట్లుగా అనిపించసాగింది- ఇంతకుముందు ఆమె టీ తాగినప్పుడే ఆమెకు అట్లా అనిపించింది - తరువాత కాస్త సర్దుకున్నట్లుగా ఫీలయింది- కాని ఇప్పుడు ఆమెకు కడుపులోంచి ఏదో పైపైకి వస్తున్నట్లుగా ఉంది- వెంటనే మంచంమీదనుంచి కిందకు దిగింది - రెండు అడుగులు వేసిందో లేదో భళుక్కున వాంతిచేసుకుంది. ఆయాసపడుతూ గోడను అసరా చేసుకుంది. 'అబ్బా అబ్బా . ' అంటూ ఒకచేత్తో తలను పట్టుకుంది. రమాకాంత్ పడబోతున్న ఆమెను పట్టుకుని మంచంమీద కూర్చోపెట్టాడు.

"నేనిచ్చిన టీలో ఏదైనా లోపం జరిగిందా - బహుశ పాలు ఫ్రెష్‌వి కావని-"

"ఊహూ అదేంకాదు " అతనికి ఏం చెప్పాలో శకుంతలకి తోచలేదు. తను దాదాపు ఓ నెలరోజులనుంచి వాంతులతో బాధపడుతోంది- తను రెండోసారి తల్లి కాబోతోందని తనకు తెలుసు.

"మీకు అనవసరంగా బాధ కలిగించాను - ఆ టీ ఈయకపోయినా బాగుం డేది-"

"రమాకాంత్ ఇందులో మీ తప్పేమీ లేదు. ఆ టీవల్లే నాకు వాంతి కాలేదు. కారణం తరువాత చెబుతా-" అంటూ నెమ్మదిగా గోడకు ఒరిగింది- ఆ ప్రదేశాన్ని బాగుచేద్దాం అని లేవబోయింది- మళ్ళీ కళ్ళు తిరిగాయి.

రమాకాంత్ గదిలో ఓ పక్కనే ఉన్న బాత్‌రూంలోంచి ఓ చిన్న బకెట్టుతో నీళ్ళుతెచ్చాడు. శకుంతల వాంతిచేసుకున్న చోటును నీళ్ళుపోసి కడ గటం మొదలుపెట్టాడు,

"అరె మీరు కడుగుతున్నారా- నేను కడిగేస్తాను - ఇటివ్వండి-" అంటూ మంచంచివరికి జరిగింది శకుంతల,

"ఫరవాలేదు- నేను కడిగేస్తాను. మీకు అసలే ఒంట్లో బాగాలేదు కదా- పడుకోండి-"

"మీకు అసహ్యం అనిపించడంలేదా-నేనే కడిగేస్తా-" శకుంతల లేచింది- నీరసంగా ఉండటంవల్ల మళ్ళీ కూర్చుండిపోయింది.

"ఈ పరిస్థితిలో ఎవరూ అసహ్యించుకోరు - దయచేసి నేను చెప్పినట్లు వినండి. మీరు విశ్రాంతి తీసుకోండి-"

శకుంతల మరేమీ మాట్లాడలేకపోయింది - ఆమెకు రమాకాంత్ అంటే ఎంతో అభిమానం ఏర్పడసాగింది. అదే తన భర్త అయితేనా ఇటువంటి పరిస్థి తుల్లో ఎంతో విసుక్కునేవాడు. పాడుముఖం అంటూ ఈసడించుకునేవాడు. తనకి అతనికి పెద్ద పరిచయం లేదు- అయినా అతను తనని ఎంత ఆదరిస్తున్నాడు. తోటిమనిషిగా తనమీద ఎంత ప్రేమ చూపిస్తున్నాడు. ఆలోచిస్తూ శకుంతల నిద్రలోకి జారుకుంది-

రమాకాంత్ అంతా కడిగేసి చాపను మరోవైపు లాక్కుని పడుకున్నాడు. అతనికి నిద్రపట్టలేదు. ఆ రాత్రంతా జాగారమే చేశాడు.

తెల్లవారింది. భరత్ లేచాడు. రమాకాంత్ బాబుని తీసుకుని ఎత్తుకున్నాడు. శకుంతల ముఖం చూసిన అతనికి ఆమెకు తీవ్రంగా జ్వరం వచ్చిందేమోనని అనిపించింది. ఇంతలో తలుపు చప్పుడయింది. తలుపు తెరిచేసరికి పాలబ్బాయి

విల్చుని ఉన్నాడు- రమాకాంత్ పాలు పోయించుకున్నాడు. వెంటనే పనిమనిషి వచ్చింది. లోపలికి వచ్చిన పనిమనిషి రమాకాంత్ చేతిలోని బాబును, మంచం మీద పడుకుని ఉన్న శకుంతలను చూసి ఆశ్చర్యపోయింది. ఇదే పనిమనిషి శకుంతల ఇంటిపక్కన రెండు మూడు ఇళ్ళలో పనిచేస్తుంది. శకుంతల కూడ ఆమెకి బాగా తెలుసు. అసలు విషయం ఏమిటో కనుక్కుందామనుకొని కూడ, తనకెందుకులే అని అడగలేదు. తన పని చేసి బయటపడ్డది. పనిమనిషి వెళ్ళి పోయిన కాస్సేపటికి శకుంతలకి మెలకువవచ్చింది. ఆమె కళ్ళు చింతనిప్పుల్లాగా ఉన్నాయి. ఒళ్ళు భారంగా అనిపించింది. "వేడినీళ్ళు పెట్టాను, ముఖం కడుక్కుం టారా-" అన్నాడు రమాకాంత్.

"అబ్బా అయ్యో...." కణతలను నొక్కుకుంటూ బాధపడసాగింది శకుంతల.

అతను ఆమెకు దగ్గరిగా వచ్చాడు.

"మీకు బాగా జ్వరం వచ్చినట్లుగా ఉంది - పాలు వచ్చాయి — బాబుకి పట్టమంటారా-"

"మీ కెంత శ్రమనిస్తున్నానో - మేం వెళ్ళిపోతాం - మళ్ళీ టైం దాటి పోతుంది-"

"ఇంత జ్వరంలో ఎట్లా వెళ్ళగలుగుతారు. ఇవాల్టికి ఉండిపోండి. కూర్చో లేని స్థితిలో ఉన్న మీరు ప్రయాణం ఏం చేయగలరు!"

రమాకాంత్ పాలు వెచ్చబెట్టి- గ్లాసులో పోసి - చంచాతో బాబు నోట్లో పోయసాగాడు. శకుంతల లేచింది- పళ్ళపొడి తీసుకుని వేన్నీళ్ళతో ముఖం కడు క్కుంది. ఎట్లాగయినా సరే వెళ్ళిపోవాలనే పట్టుదలతో రమాకాంత్ ఇచ్చిన కాఫీ తాగి బాబుని తీసుకుని నాలుగు అడుగులు వేసిందో లేదో తల నరాలు పగిలిపోతు న్నట్లుగా అనిపించింది. ఎంతో వీక్‌గా ఫీలయింది-అక్కడే కూర్చుండిపోయింది-

"మీరు అనవసరంగా ఇంకా కష్టాలు కొనితెచ్చుకోకండి - వెళ్ళి పడు కోండి. నేను వెళ్ళి డాక్టరుకి మీ స్థితి చెప్పి మందు తెస్తా-"

"మీ కివాళ కాలేజీ ఉందేమో-"

"ఫరవాలేదు- ఈ రోజుకి మానేస్తాలెండి-"

"అనవసరంగా మీ . ఒక పని చేయండి- నాతో స్టేషన్‌దాకా రండి. నేను మా ఊరు వెళ్ళిపోతా-"

"అదిగో మళ్ళీ అదేమాట అంటున్నారు. మీరు వెళ్ళటానికి వీల్లేదు. మిమ్మల్ని అజ్ఞాపించే అధికారం లేదు కాని. "

"సరే మీ ఇష్టం_"

శకుంతలకి తను వెళ్ళలేనేమో అని అనిపించింది_ తను ఒక్కతే కాదు_ తనవెంట బాబు కూడ ఉన్నాడు తను ఎక్కడయినా కళ్ళుతిరిగి పడిపోతే_బాబు ఏమౌతాడో . అని అనుకుంది.

చాలాసేపటివరకు ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. రమాకాంత్ బాబుని ఆడిస్తూ కూర్చున్నాడు. శకుంతల పడుకుంది.

"మరి నేను డాక్టర్ దగ్గరికి వెళ్ళివస్తా ..."

"ఇప్పుడు డాక్టర్‌దగ్గరికి ఎందుకు? జ్వరం అదే తగ్గిపోతుంది_"

"మీరు ఇంకేమీ మాట్లాడకండి_" అంటూ అతడు బయటకి వెళ్ళిపోయాడు.

# 13

పనిమనిషి ద్వారా విషయం తెలుసుకున్న సూర్యనారాయణ, రాధాకృష్ణ లకు ఎక్కడలేని కోపం వచ్చింది. పనిమనిషి చెప్పిన గుర్తుల ప్రకారం రమాకాంత్ ఇంటిదగ్గర దూరంగా ఉన్న చెట్టుదగ్గర రాధాకృష్ణ నిల్చున్నాడు.

తలుపు చప్పుడు విని శకుంతల లేచి తలుపు తెరిచింది.

"రమాకాంత్ ఇప్పుడే బయటకు వెళ్ళారు_" అన్నది శకుంతల.

"సరే మళ్ళీ వస్తా " అంటూ రమాకాంత్ ఫ్రెండ్ వెళ్ళిపోయాడు.

దూరంగా నిల్చున్న రాధాకృష్ణకి శకుంతల స్పష్టంగా కనిపించింది అతడు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ తన ఇంటివైపు బయలుదేరాడు. శకుంతల లోపలకు వెళ్ళిపోయింది. చాలాసేపటివరకు రమాకాంత్ రాకపోయేసరికి శకుంతలకు ఆదుర్దా ఎక్కువయింది. అతను ఎక్కడికి వెళ్ళివుంటాడు. తను పరాయివ్యక్తి గదిలో రాత్రంతా గడిపిందా? అసలు ఇటువంటి పరిస్థితిని వాళ్ళెందుకు కల్పించాలి రేపు తన తండ్రి ఏమంటాడో - తనను జీవితాంతం సుఖంగా బతకమని అనాడు పంపించాడు అనాడు తనకు ఎన్ని నీతులు చెప్పాడు. పుట్టింటి గౌరవం ఆడపిల్ల ఎప్పుడూ నిలబెట్టాలని, అత్తవారింటనుంచి ఎప్పుడు కాలు బయటపెట్టకూడదని. కాని తను ఏంచేసింది తను ఆ నిప్పుల్లో బతకలేక బయటకు వచ్చేసింది_ రేపు తనను తన తండ్రి ఆదరిస్తాడా_ కాని ఇందులో తన తప్పేముంది. ఇన్నేళ్ళు క్షణంక్షణం చస్తూ బతికింది. ఆత్మాభిమానాన్ని ఒదులుకొని పడివుంది_

ఒకవేళ తను నిన్నరాత్రి కాలు బయటపెట్టకపోయింటే తను .... భరత్.... ఇద్దరూ ఈ లోకంలోనే ఉండేవాళ్లు కాదు....తన విలువైన ప్రాణాన్ని, తన బిడ్డ ప్రాణాలని కాపాడుకునే హక్కు తనకు లేదా - అట్లా చాలాసేపు ఆలోచించుకుంటూ శకుంతల పడుకుంది-

రమాకాంత్ కొన్ని మందులు తీసుకుని వచ్చాడు. బ్రెడ్, పాలు టేబుల్ మీద పెట్టి, శకుంతలను వేసుకోమని టాబ్లెట్లు ఇచ్చాడు. ఆమె వాటిని వేసుకుంది. ఇద్దరూ బ్రెడ్ పాలతో కడుపునింపుకున్నారు. ఆమె పడుకున్నాక రమాకాంత్ బాబుతో ఆడుతూ కూర్చున్నాడు. సాయంత్రం అయింది. అంతవరకు ప్రశాంతంగా గడిపిన వారిద్దరి హృదయాల్లో తుఫాను చెలరేగింది. పదిమంది స్టూడెంట్స్‌ని తీసుకుని సూర్యనారాయణ, రాధాకృష్ణ వచ్చారు. గుమ్మం బయటనుంచి గట్టిగా కేకలేయడం మొదలుపెట్టాడు సూర్యనారాయణ.

"శకుంతలా...." గట్టిగా అరిచాడు సూర్యనారాయణ.

కాని శకుంతల బయటికి రాలేదు. రమాకాంత్ వీరందరినీ చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి నా యింటిమీదికి ఈ దండయాత్ర-" కోపంగా అన్నాడు రమాకాంత్.

స్టూడెంట్స్ అందరూ గుసగుసలు మొదలుపెట్టారు.

"ముందు దాన్ని పిలు-"

"ఎవరిని...."

"దాన్నే.... ఆ రాక్షసినే.... కోడలుగా నా ఇంట్లో అడుగుపెట్టిందే- అదే ....దాన్నే.... దాన్ని నీ యింట్లో ఉంచుకోవడానికి సిగ్గులేదు-"

"ఇందులో సిగ్గుపడాల్సింది ఏముంది. మీరు అర్ధరాత్రి ఆమెను వెళ్ళగొట్టారు- నేను నా గొడుగుకింద ఇంత నీడనిచ్చాను-తప్పా-"

"దాన్ని ఎవడూ వెళ్ళగొట్టలేదు- నీతో ఎన్నాళ్ళనుంచి ఈ సంబంధం ఉందో- అందుకే నేరుగా నీ రూమ్‌కి వచ్చి పడుకుంది- ఒరేయ్ రాధాకృష్ణా- ఆ భరత్‌గాడు, నీ కొడుకు కాదు- వాడు వీడి కొడుకే .."

వింటున్న రమాకాంత్ ముఖం ఎర్రబడ్డది. పళ్ళు పటపట కొరికాడు- తనకి ఆమెకి మధ్య సంబంధమా.... అతడికి తల తిరుగుతున్నట్లుగా అనిపించింది.

ఇక్కడ ఏం జరుగుతోందా అని_మరికొందరు మూగారు - కొంతమంది వెకిలిగా నవ్వుతున్నారు.

లోపలినుంచి ఈ మాటలన్నీ విన్న శకుంతల భరత్‌ని ఎత్తుకుని బయటకి వచ్చింది

"అదుగో....చూసారా....ఎంత సిగ్గులేకుండా పరాయి మగాడి గదిలో ఉందో_ ఇంతవరకు పెళ్ళయిన ఏ ఆడదీ ఇట్లాంటి అవినీతిపని చేసిఉండదు_ ఇది మన ధర్మాన్ని....మన పవిత్రతని మంటగలిపింది. ఛీ దీని ముఖం చూస్తేనే .." అక్కడ ఉన్న నలుగురితో చెబుతున్నాడు సూర్యనారాయణ.

"ఓహో... ఇప్పుడర్థమయింది. అంత రాత్రిపూట కూడ ధీమాగా ఎందుకు వెళ్ళిపోయావో - వీడిక్కడున్నాడన్నమాట_" అన్నాడు రాధాకృష్ణ వ్యంగ్యంగా.

"ఛీ మీరు మనుషులే_ నన్ను అనేక బాధలు పెట్టారు. చివరికి ఇంకేం చేయలేక నాకు ఈ చిన్నబాబుకి ప్రాణాపాయం కలుగుతుందన్న పరిస్థితిలో బయటకు వచ్చాను_ మాలినీదేవి ఆశ్రయం ఇస్తుందనుకున్నా... కాని ఆమె..."

"ఎంత నాటకం ఆడగలవే. ఇప్పుడు మీ ఇద్దరిని ఇట్లా పట్టుకున్నాం కాబట్టి సరిపోయింది. లేకపోతే మీరిద్దరూ మామీద ఎన్ని అభాండాలు వేసేవాళ్లో."

"అనవసరంగా ఆతన్ని ఏమీ అనకండి. అతడితో నాకు పరిచయం నిన్న రాత్రినుంచే..."

"ఎంత నంగనాచిలా మాట్లాడుతున్నావు. ఆడదంటే ఎంత పవిత్రంగా ఉండాలి_"

"మా ఇద్దరికి ఎటువంటి సంబంధం లేదు. విశాల్... సత్యం.... మీరు నా మాట వినండి_" అన్నాడు రమాకాంత్.

అక్కడే ఉన్న విశాల్....సత్యం.... ఇంకెవరు ఏమీ మాట్లాడలేదు.

"మీ అందరికీ సంజాయిషీ చెప్పవల్సిన అవసరం మాకేమాత్రం లేదు. మే మిద్దరం ఎటువంటి తప్పు చేయలేదు_" నిర్భయంగా అంది శకుంతల.

"అవును .... మీ రిద్దరూ .... మీ రిద్దరూ చరిత్రహీనులు...." అన్నాడు సూర్యనారాయణ

"మీరు ఎంత నీచానికి దిగజారారు_" అన్నాడు రమాకాంత్.

"ఇంతకుముందు మీరిద్దరూ ఎన్ని రాత్రులు గడిపారో ఎవరికేం తెలుసు_ నిన్నరాత్రి మీరిద్దరూ ఒకే రూంలో ఉన్నారు_ఒకే గదిలో పడుకున్నారని ఊరం




దరికి తెలిసింది – ఇన్ని గంటలు ఒంటరిగా గడిపిన మీ రిద్దరూ చరిత్రహీనులు కాక.. మరి పవిత్రులా—" అన్నాడు సూర్యనారాయణ.

"ఆడ మొగ ఒక్క రాత్రి... కొన్ని గంటలు ఒకే గదిలో గడిపినంత మాత్రాన, వాళ్ళ చరిత్రలకు కళంకం ఆపాదించే హక్కు మీ కెవరిచ్చారు—" అన్నాడు రమాకాంత్ ఆవేశంగా.

"ఈ సంఘం.... ఈ సంఘంలోని మనుష్యులే మీరు...."

"అయితే ఆ సంఘం తగలబడి పోనీయండి – మేమిద్దరం పవిత్రంగా నే ఉన్నాము. మా ఇద్దరి మధ్య ఇన్ని గంటలు స్నేహం మాత్రమే రాజ్యం చేసింది ఆమెకు జ్వరంగా ఉంది – ఈ రాత్రి మీ ఇంటికి తీసుకువెళ్ళండి—"

"ఆ చరిత్రహీనురాలిని మళ్ళీ నా గడప తొక్కనివ్వను – దీనికోసం నా ధర్మాన్ని నా పవిత్రతని మంటగలపమంటారా—"

"మళ్ళీ ఆ మాటంటే మీ నాలుక కోసేస్తాను—" ఉద్రేకంగా సూర్యనారాయణమీదకు ఉరికాడు – రాధాకృష్ణ రమాకాంత్ చెంపమీద చెళ్ళున కొట్టాడు.

రమాకాంత్ చెయ్యెత్తాడు.

"రమాకాంత్ ప్లీజ్ ఆగండి – అనవసరంగా గొడవల్లో చిక్కుకోకండి వీళ్ళు రాక్షసులు. మిమ్మల్ని ఏమైనా చేస్తారు– నేను ఎటూ వెళ్ళిపోతాను." ఎత్తిన చెయ్యిని దించాడు రమాకాంత్.

"ఆవిడ చెప్పారు కాబట్టి నిన్ను వదిలేస్తున్నా...."

"అది నీకేమవుతుందని - నీకు చెప్పటానికి — ఊ....రా...." ముందుకు, ముందుకు వచ్చాడు రాధాకృష్ణ.

"ఇవాళ ఏదో ఒకటి తేల్చుకోవాలి—" రంకెలు వేస్తూ అన్నాడు సూర్య నారాయణ. రమాకాంత్ చేయి పైకి లేవలేదు. అతను శాంతంగా నిల్చుని ఉన్నాడు.

"అయితే నీవు దాని మాటకు అంత విలువ ఇస్తున్నావన్నమాట - నన్ను కాదని వెళ్ళిపోయినదాన్ని, నిన్ను చూడు ఏం చేస్తానో—" అన్నాడు రాధాకృష్ణ.

అక్కడ చేరిన జనంలో కొంతమంది నవ్వుకుంటున్నారు. కొంతమంది గుసగుసలాడుతున్నారు. రమాకాంత్‌కి వాళ్ళందరిని ఒక్కసారి కాల్చిపడేద్దామా అన్నంత ఆవేశం వచ్చింది. కాని శకుంతల మాటప్రకారం ఇంకేమీ మాట్లాడ లేదు.

మెల్లి మెల్లిగా అందరూ వెళ్ళిపోయారు.

రమాకాంత్ లోపల అడుగుపెట్టాడు. శకుంతల లోపల వెక్కి-వెక్కి ఏడుస్తోంది.

"అంత ధైర్యంగా వాళ్ళని ఎదిరించిన మీరు-ఇట్లా....ఏమీ బాగా లేదు—"

"రమాకాంత్..." ఆమె స్వరంలో బాధ, ప్రేమ మిళితమయింది.

"ప్లీజ్ ఏడవకండి..." రమాకాంత్ ఆమె కళ్ళల్లోంచి వస్తున్న కన్నీళ్ళను తన చేత్తో తుడిచాడు.

శకుంతలకెంతో తృప్తిగా అనిపించింది— అతని ఆదరణకు ఆమె మనస్సు కరిగిపోయింది—

ఆ రాత్రంతా గడిచిపోయింది— శకుంతలకి కాస్త వొళ్ళునొప్పులు తగ్గటం వల్ల, తేలికగా అనిపించింది. శకుంతల చేతిలోనుంచి భరత్‌ని రమాకాంత్ తీసుకున్నాడు. ముద్దులవర్షం కురిపించాడు - బాబుని ఇంకా ఇవ్వకపోవడం చూసి—

"బాబుని ఇటివ్వండి— మరి నే వెళ్తా—" అన్నది శకుంతల.

"మిమ్మల్ని ఒంటరిగా వెళ్ళనివ్వను. మీతోపాటు నేనూ వస్తాను—"

"మా వూరికి మీరూ వస్తారా—"

"మిమ్మల్ని క్షేమంగా మీ నాన్నగారికి అప్పచెప్పి నే వెనక్కి వచ్చేస్తా—"

"రమాకాంత్ "

"నన్ను రానివ్వండి—"

శకుంతల ఇంకేమీ మాట్లాడలేకపోయింది. గడియ సరిగ్గా పడకపోవడం వల్ల భరత్‌ని శకుంతల చేతికి ఇచ్చాడు రమాకాంత్. సరిగ్గా ఆ సమయానికే వారిద్దరికీ తమ ముఖాలమీద ఏదో వెలుగువడి మాయమయినట్లుగా అనిపించింది. ఇద్దరూ ఒకరి ముఖంవంక ఒకరు చూసుకున్నారు. ముందుకి బయలుదేరారు. రైలు వారిద్దరిని శకుంతల ఊరికి చేర్చింది. ఆ రోజు శకుంతలకు తన ఊరు ఎందుకో కొత్తగా అనిపించింది–

శకుంతల ఇంటి అరుగుమీద కూర్చుని ఉన్న తండ్రిని చూసింది. అతని చుట్టూ ఓ పదిమంది ఉన్నారు. అక్కడ ఏం జరిగిందా అని ఆమె మనస్సు ఆందోళన పడసాగింది. శకుంతల, రమాకాంత్ ఇద్దరూ ఇంటికి దగ్గరగా రాగానే అక్కడున్నవాళ్ళందరూ – ఆదోరకంగా చూడసాగారు. కొంచెం అవతల ఉన్న కారుని చూసింది శకుంతల. అయితే వాళ్ళిద్దరూ ఇక్కడికి వచ్చారన్నమాట–వేడి నిట్టూర్పు విడిచింది శకుంతల. రావు కూతురికి దగ్గరగా వచ్చాడు ఆమె పక్కనే ఉన్న రమాకాంత్‌ని ఎగాదిగా చూశాడు.

"అమ్మా...శకుంతలా . నీభర్త నీ మామగారు చెబుతున్నది నిజమేనా–"

"ఏం చెప్పారు–"

"ఇంట్లోంచి లేచిపోయిన నీకు నాకు ఇంకేం సంబంధంలేదని, వాడితో కులికే ఈ చరిత్రహీనురాలిని నా గడప తొక్కనివ్వవని చెప్పా–" అన్నాడు రాధాకృష్ణ.

"మీకు...నాకు, ఇంకేం సంబంధం లేదని నేనే చెబుతున్నా..."

"అమ్మా... శకుంతలా.... ఏమిటా మాటలు. ఏదో చిన్నది తెలిసో తెలియకో వెళ్ళిపోయింది. ఈ చిన్నారిబాబు కోసమయినా ఆమెను స్వీకరించండి. వాడి భవిష్యత్తుకోసమయినా మా అమ్మాయిని స్వీకరించండి–" దీనాతిదీనంగా అడిగాడు రావు.

"వాడు నా కొడుకు కానేకాదు–"

"మీరట్లా మాట్లాడటం భావ్యంకాదు–"

"నాన్నా నీవు వాళ్ళని అంత బతిమిలాడవల్సిన అవసరం లేదు. మీ కూతురు ఎటువంటి తప్పు చేయలేదు–"

"అర్ధరాత్రి ఆడది ఇంట్లోంచి కాలు బయటపెట్టడం, ఓ ఒంటరి మగాడితో కులకటం తప్పుకాదా ." అన్నాడు సూర్యనారాయణ.

"నేను ఆ పరిస్థితిలో కాలు బయటపెట్టకపోయిఉంటే మీకు మీ కూతురు-మనుమడు దక్కేవాళ్ళు కాదు నాన్నా. "

"ఏవ్వ... ఇంట్లోంచి వెళ్ళిపోతావా .. మన వూళ్ళో ఏ ఆడకూతురైనా ఇంతవరకు ఇటువంటి పని చేసిందా. మాష్టారుగారూ దీన్ని ఇంక మీ గడప తొక్కనివ్వకండి- దాని ఇష్టం ఎటన్నా పోనీయండి - ఇది మన ఊరికే అప్రతిష్ఠ-" అన్నాడు ఆ ఊళ్ళోని పెద్దల్లో ఒకడు

"అవును అంతే. ఆడదానికి అత్తగారిల్లే గతి అక్కడే తిట్టినా, కొట్టినా, చంపినా పడుండాలి - దాన్నే గుణవంతురాలంటారు-" అన్నాడు మరొకడు

"ఆడదానికి భర్తే దైవం. ఈ పవిత్ర భారతంలో పుట్టి నీవు మరొకడితో తిరుగుతావా-" అన్నాడు ఇంకొకడు.

ఈ మాటలన్నీ రమాకాంత్‌కు, శకుంతలకు ఈటెల్లా తగలసాగాయి. కొంతమంది ఆడవాళ్లు ఈ చోద్యం ఏమిటా... మాష్టరుగారి ఇంటిముందు ఈ గలాభా ఏమిటా అని ఆగారు - వాళ్ళ చంకల్లో నీళ్ళబిందెలున్నాయి. వాళ్ళు ఒకళ్ళ చెవులు ఒకరు కొరుక్కోవడం మొదలెట్టారు.

"ఈ పవిత్రమయిన గంగాపురంలో నీవంటి ఆడది ఉండటానికి వీల్లేదు-" అరిచిందో గొంతు

"ఆమెను ఉండటానికి వీల్లేదు . "

"ఈ పవిత్ర భారతావనికే తలవంపులు తెచ్చింది. అవును ఆమె వుండటానికి వీల్లేదు-" అన్నది ఇంకో గొంతు.

"ఉండటానికి వీల్లేదు . "

"వీల్లేదు—"

"వీల్లేదు "

ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు అన్ని గొంతుకలూ.. ఆ ఊరు మొత్తం ఇదే అరుపు అరిచింది.

"ఈ భారతదేశం.. ఈ గంగాపురం పవిత్రమయినవేనా " అడిగాడు రమాకాంత్

"అవును పవిత్రమయినవే " రెండు మూడు గొంతులు అన్నాయి

"అంత పవిత్రమయింది - మీ ఊరి శకుంతల కూడ-"

"ఆమె పవిత్రురాలు అనటానికి ఋజువేమిటి-" అన్నాడు ఆ గుంపులో ఒకడు.

"మాష్టరుగారూ.... మీ శకుంతల ఎంతో పవిత్రమయింది-మీరు ఆమెను వడిదారిలో వదిలేయకండి- ఈ సంఘంకోసం ఈ నలుగురు చెప్పిన మాటలు విని ఆమెను పుట్టింటికి కాకుండా చేయకండి. రేపు మీకు శాంతిసుఖాలను ఇచ్చేది-శకుంతల మీ మనవడు మాత్రమే...." అన్నాడు రమాకాంత్ రావుతో.

"నాన్నా .... మీరే నన్ను కాదనుకుంటే నేనింక బతకవలసిన అవసరం లేదు. మీ కూతురు ఇంక నుయ్యో గొయ్యో చూసుకుంటుంది-" అన్నది శకుంతల భరత్ తల నిమురుతూ-

"మాష్టరుగారూ....మే మిద్దరం పవిత్రులం- ఇంట్లోకి శకుంతలను రానీయండి-"

"అమ్మా....శకుంతలా- రమాకాంత్ నా మనస్సు మీ ఇద్దరు పవిత్రులని చెబుతోంది-శకుంతలా లోపలికి రా-నిన్ను-నా మనవడిని వొదులుకోలేనమ్మా "

"అయితే మీకు ధర్మం ఒక్కరలేదన్నమాట. కన్న కూతురే ముఖ్యం అన్నమాట-" అన్నాడు సూర్యనారాయణ.

"ఇందులో ఏది ధర్మమో.... ఏది పవిత్రమో... ఏది అపవిత్రమో నా కనవసరం-నా మనస్సు విశ్వసించినట్లు నేను నడుస్తా-" శకుంతల మనస్సు తేలికపడ్డది. ఆమె కళ్ళనుంచి ఆనందబాష్పాలు రాలాయి.

"ఇంక మీకు-మాకు ఎటువంటి సంబంధం లేదు-" అన్నాడు సూర్యనారాయణ కోపంగా కారుఎక్కి కూర్చుంటూ-

రాధాకృష్ణకు రమాకాంత్ అంటే ద్వేషం ఏర్పడింది. ఈ విషయంలో తను అతనిముందు పరాజయం పొందాడు, తప్పకుండా బదులు తీర్చుకోవాలి-పగ తీర్చుకోవాలి- అతను కారెక్కాడు-

ఇంట్లోకి వెళ్తున్న - రావు-శకుంతల-రమాకాంత్‌లను చూసి అందరూ ముఖాలు ముడుచుకున్నారు.

ఆ తరువాత కొన్నాళ్ళకు రావు, శకుంతల ఆ ఊళ్ళోవాళ్ళ మాటలు భరించలేక మరో ఊరు వెళ్ళిపోయారు. డబ్బు చేతిలో ఉండటంవల్ల పెద్దగా ప్రతిదానికి అంతగా ఇబ్బంది పడవల్సిన అవసరం లేకపోయింది. ఇద్దరి ఉద్దేశ్యం ఒక్కటే-భరత్‌ని బాగా చదివించాలి. గొప్పవాడిని చేయాలి - రెండో

సారి శకుంతలకి గర్భస్రావం జరిగింది- కాలచక్రంలో సంవత్సరాలు గడిచి పోయాయి- భరత్ పెరిగి పెద్దవాడయ్యాడు-ప్రయోజకుడయ్యాడు.

## 14

"అమ్మా.... నీలో ఇంత ఆవేదన దాగివుందా- వాళ్ళు మళ్ళీ మన గడప తొక్కకుండా నాలుగు అడుగుతా- దేవతలాంటి మా అమ్మని ఇంతగా ఎందుకు నాశనం చేశారని అడుగుతా- రానీ అమ్మా....రాని, వాళ్ళు ఈసారి రానీ-" భరత్ తన తల్లి చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ప్రేమగా శకుంతల భరత్ తలను నిమిరింది.

"తాతయ్యా.... అందరినీ ఎదిరించి మా అమ్మను నన్ను ప్రాణప్రదంగా చూసుకుని నన్ను ఇంతవాడిని చేసినందుకు నేను నీకు ఎంతో రుణపడి ఉన్నా .." భరత్ తాతయ్యను గట్టిగా కౌగలించుకున్నాడు.

"అంత పెద్దమాటలు మాట్లాడకురా! నేను పోయాక అమ్మని కనురెప్పలా చూసుకుంటా అని చెప్పు- నా కంతే చాలు - పరేకాని సరూ తల్లి ఎట్లా ఉందో- వెళ్ళి చూసిరా-"

"అవును పాపం సరూ తల్లికి ఎట్లా ఉన్నదో-" అన్నది శకుంతల.

"అదుగో అమ్మా సరూ వస్తోంది-" అన్నాడు భరత్ కిటికీలోంచి చూస్తూ. శకుంతల లేచి గబగబా డ్రాయింగ్‌రూమ్‌లోకి వచ్చింది. సరూ లోపల అడుగు పెట్టింది. ఆమె ముఖం పీక్కుపోయి ఉంది - కళ్ళు బాగా లోతుకుపోయి ఉన్నాయి. సరూ- శకుంతలని గట్టిగా పట్టుకుని - ఆంటీ.... ఆంటీ అంటూ ఏడ్వసాగింది. శకుంతలకు కాళ్ళు చేతులు ఆడలేదు. లోపలనుంచి వచ్చిన భరత్ రావు ఈ దృశ్యం చూసి అట్లాగే ఉండిపోయారు.

"ఆంటీ.... అమ్మ చనిపోయింది- ఆంటీ... " పెద్దపెట్టున ఏడ్వసాగింది సరూ-

"ఆ...." ముగ్గురూ ఒకేసారి అన్నారు

"అరె.... ఎంత అన్యాయం జరిగిపోయింది-" అన్నది శకుంతల.

"ఆ రోజు- నువ్వు రాలేదు... అమ్మ కోలుకుంటోంది అని అన్నావు-" అన్నాడు భరత్.

"కాని తరువాత అది సెప్టిక్ అయింది-ఆంటీ ఇప్పుడే ఆయాలో పోవటం లేదు- హాస్పిటల్‌వాళ్ళు తీసుకెళ్ళిపొమ్మన్నారు-"

"పద అందరం హాస్పిటల్‌కి వెళ్దాం-" అన్నాడు రావు




సరూకి దుఃఖం పొర్లుకువచ్చింది. రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చేసింది.

“సరూ....ఇటువంటి పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కోవాలి - నీకు మేం ఉన్నాంగా-” అంటూ శకుంతల ఆమెను ఓదార్చసాగింది. అందరు హాస్పిటల్‌కి బయలుదేరారు.

## 15

“శకుంతలా....” ఆ పిలుపులో ఎంతో ప్రేమ ఉంది- ఎంతో ఆప్యాయత ఉంది. ఎన్నాళ్ళనుంచో ఎన్నేళ్ళనుంచో ఆ పెదిమలమధ్య ఆ హృదయంలో దాచి ఉంచిన ఆ పేరు- ఇప్పుడు ఒక్కసారి సముద్రం ఉవ్వెంగినట్లుగా పైకి వచ్చింది.

శకుంతల శిలాప్రతిమలా నిల్చుండిపోయింది.

“శకుంతలా...” మరోసారి ఆ కంఠం తీయగా పిలిచింది.

“శకుంతలా.... నన్ను గుర్తుపట్టలేదా-”

ఆ ప్రతిమలో చలనం వచ్చింది. ఆ కళ్ళలో వింత కాంతి వచ్చింది- ఆ పెదిమల్లో కదలిక వచ్చింది.

“మీరు....మీరు.... రమాకాంత్....” శకుంతల కొంగుతో ముఖాన్ని తుడుచుకుంది.

“అయితే మీకు రమాకాంత్ గుర్తున్నాడన్నమాట-”

"మరి మీకు నేను గుర్తున్నానా...."

"అసలు....మిమ్మల్ని....అ....నిన్ను మరచిపోతేగా–"

"శకుంతలా.... బాబూ.... మీ నాన్నగారు ఎక్కడున్నారు–" ఇంత సేపటినుంచి వాళ్లెవరు కనిపించకపోవడంవల్ల అడిగాడు రమాకాంత్.

"భరత్.... మా నాన్నగారు....సరూ.... ఇప్పుడే బయటకి వెళ్ళారు–"

"సరూ ఎవరు?...."

"భరత్ స్నేహితురాలు– భరత్ చాలా ఎదిగిపోయాడు. ఇప్పుడు ఓ పెద్ద గొప్ప పైంటిస్టు అయ్యారు– రమాకాంత్ నా ఆశ నెరవేరింది–"

"చాలా సంతోషం శకుంతలా– ఈ సంతోష సమయంలో ఈ వార్త ఎట్లా చెప్పాలో తెలియడంలేదు. కాని చెప్పక తప్పదు–" అంటూ జేబులోంచి ఓ కవరు తీసాడు. అందులోంచి ఫోటోలు బయటకి తీసాడు. శకుంతలకు ఈయడా నికి చేయి చాపాడు. మళ్ళీ వెనక్కి తీసుకున్నాడు. ఇవ్వడమా....మానడమా.... సంశయించాడు.

"ఇవ్వండి రమాకాంత్–"

"రమాకాంత్ ఆమె చేతికి ఇచ్చాడు. శకుంతల ఒకటీ–రెండు చూసి మళ్ళీ కవరులో పెట్టేసింది. ఇద్దరు ఒకేసారి ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ఇద్ద రిలో తెలియని సిగ్గేదో కలిగింది. శకుంతల మొహం మరల్చుకుంది.

"ఇవి మీ కెట్లా చేరాయో నాకు తెలుసు–"

"అయితే మీకు ముందే తెలుసన్నమాట. మీ మామ సూర్యనారాయణ నా దగ్గరికి వచ్చాడు. మీ భరత్ ఇన్వే ట్రీట్మెంటు ముందు అతనికి కావాలిట– భరత్ అందుకు నిరాకరించాడట– మవ్వే శకుంతలని అడిగితే ఆమె కాదనదు– ఆమె చెబితే భరత్ ఒప్పుకుంటాడు....ఒకవేళ నువ్వు వెళ్ళి వాళ్ళని ఒప్పించక పోతే ఈ ఫొటోలు అందరికీ చూపిస్తాను. నీకు శకుంతలకి ఉన్న సంబంధం పేపరుకెక్కిస్తా. దీనివల్ల ఇప్పుడు నీకున్న పేరుప్రతిష్ఠలు మంటకలుస్తాయి– ప్రజల కవి అయిన నిన్ను ప్రజలే ద్వేషిస్తారు. నీవు ఆమె కాపురాన్ని ఎట్లా నాశనంచేశావో అందరికీ తెలుపుతా– ప్రజలు నిన్ను అసహ్యించుకుంటారు. అత దాని కాపురంలో చిచ్చుపెట్టాడని, నీవు చెడివని అందరికీ అభిప్రాయం ఏర్పడుతుంది. అప్పుడు నీ జీవితం ఎ వుతుందో ఊహించుకో అని అన్నాడు. నా కసలు మీరెక్కడున్నారో తెలియదు– భరత్ గురించి ఇప్పుడిప్పుడే పేప రులో చదివాసని, మీరు ఈ విధంగా చేయడం ఏమీ బాగాలేదని నే నన్నా–ఇష్టం

వచ్చినట్లు దులిపా. ఎడ్రస్ ఇచ్చాడు- ఎన్నేళ్ళనుంచో మీకోసం వెతుకుతున్న నేను ఇన్నాళ్ళకు మిమ్మల్ని కలుసుకోగలిగా-"

"ఆయన మనల్ని ఏమీ చేయలేడు. నేను భరత్‌కి జరిగిన విషయాలన్నీ చెప్పేసా-"

"ఒకవేళ ఆయన చెప్పినట్లే చేస్తే మన అందరి గౌరవాలు-"

"ఆ పరిస్థితే వస్తే మనం ఎదిరిద్దాం- జరిగిన కథను మనమూ అందరికీ తెలుపుదాం- ఈ ఫోటోలన్నీ అతడు కావాలని కుట్రతో తయారుచేశాడని చెబుదాం-"

"శకుంతలా- ఆనాటి శకుంతలలో కంటే ఈనాటి శకుంతలలోనే ఇంకా ధైర్యం ఎక్కువగా ఉన్నట్లు అనిపిస్తోంది. శకుంతలా ఆనాడు మిమ్మల్ని, ఆ సూర్యనారాయణ, ఆ రాధాకృష్ణ, మీ ఊరివాళ్ళు వెలివేసినప్పుడు-నేను మిమ్మల్ని గుండెల్లో దాచుకుని, మీ చేయి పట్టుకుని ముందుకు నడిచే ఉంటే, మిమ్మల్ని నా శకుంతలగా చేసుకుని ఉంటే నా జీవితం వేరుగా ఉండిఉండేది. ఇన్నాళ్ళు, ఇన్నేళ్ళు మన ఇద్దరం హాయిగా ఉండి వుండేవాళ్ళం." అంటూ ఆవేశంగా రమాకాంత్ శకుంతలని గట్టిగా కౌగలించుకున్నాడు. మత్తుగా ఆమెవంక చూశాడు. ఆ స్పర్శ ఇద్దరిలో పులకింత కలిగించింది రమాకాంత్ ఆ స్పర్శకోసమే ఇన్నాళ్లు జీవించినట్లు, ఇద్దరిని మరెవ్వరు విడతీయలేనంతగా ఆ కౌగిలిలో తనను తాను మరచిపోయాడు. ఆమె ముంగురులు సవరించాడు. ఆమె బుగ్గలు నిమిరాడు. ఆమె పెదవులతో తన పెదిమలు కలిపాడు- జరుగుతున్న ప్రతి పనిలో మాటలు రానిదానిలా, తన్ను తాను అతనిలో లీనం చేసుకుంది. కొంచెంసేపటికి ఆమె లోని వివేకం మేల్కొంది. కౌగిలి విడిపించుకొని దూరంగా వెళ్ళింది.

"శకుంతలా ఆహ్ ఎంత హాయిగా ఉంది-" ఇంకా అతనిలో మత్తు వదలలేదు.

"రమాకాంత్ .. ఇప్పుడు మనం . ఇప్పుడు ..." శకుంతల పెదవులు వణికాయి- తను ఎప్పుడూ అతనిని ఆ విధంగా ఊహించలేదు- కాని అతడు తనని___ఏమిటి ఇదంతా .

"శకుంతలా ఇన్నాళ్ళబట్టి నీవు ఈ హృదయంలో దేవతగా నిలిచి పోయావు. ప్రతిక్షణం నిన్ను నా ప్రేమ కుసుమాలతో పూజిస్తూనే ఉన్నా - నీకు తెలియదు శకుంతలా ఆనాడు నిన్ను వదిలి వెళ్ళాక జరిగిన సంగతులు-" అప్పుడు తెలుసుకున్నా- సంఘం అంటే ఏమిటో-చదువు మానేయాల్సివచ్చింది-"

"అయితే మీరు... ఆ తరువాత ఏమీ చదువుకోలేదా-"

"మీ ఊరినుంచి వచ్చాక కాలేజీకి వెళ్ళా - అక్కడ అందరూ ఎంతో అవమానపరిచారు-" ఆ రోజు జరిగిన సంఘటన అతని కళ్ళముందు కదలాడ సాగింది-

ఆ రోజు రమాకాంత్ కాలేజీకి వెళ్ళగానే అక్కడి వాతావరణం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది - స్టూడెంట్స్ చాలామంది అతన్ని వింతగా చూసు కుంటూ - వెకిలిగా నవ్వుకుంటూ వెళ్తున్నారు - ఓ చోట కొంతమంది గుంపు అతన్ని చుట్టుముట్టింది.

"హాయ్ రమాకాంత్-" గళ్ళషర్టు అతను అన్నాడు-

"హల్లో రమాకాంత్-" మరొకడన్నాడు-

"హల్లో " మామూలుగా నవ్వుతూ అన్నాడు రమాకాంత్.

"మనవాడు ఇవాళ ఏదో కొత్తగా కనిపిస్తున్నాడు కదు గురూ " అన్నాడు ఇంకొకడు.

"హాయ్ భాయ్ రెండురాత్రుల కొత్త అనుభవాలని మాకు చెప్పు-"

రమాకాంత్ ఏమీ అర్థంకానివాడిలా చూశాడు.

ఒక అతను రమాకాంత్ చొక్కా కాలరును పట్టుకుని కాస్త ముందుకి లాగాడు-

"అహ . . నీ దెంత అదృష్టం- ఆ పిట్టను ఎంత గట్టిగా కౌగిలించుకున్నా వేమిటి- బొట్టుగుర్తు ... భలేగా పడ్డదోయ్- ఏ భంగిమలో ఉన్నావేంటి-"

"రేపు, నీ రెండురాత్రుల కామలీలలు మాకు వ్రాసి ఇవ్వు-"

"అవన్నీ ప్రాక్టీసు చేయడానికి మనకి మరో శకుంతల దొరకొద్దూ-"

"కాలేజీలో - మహా పెద్ద ప్రవరాఖ్యుడిలా ఉంటావేం - కాలేజీ గరల్స్ కన్నా పెళ్ళయినవాళ్ళే బాగుంటారా భాయ్-"

"నీ ధైర్యానికి జోహర్లు. రెండు రాత్రులు ఓ ఇంటి కోడలిని వాళ్ళ ఎదురుకుండానే నీ రూమ్‌లో ఉంచుకున్నావంటే- నువ్వు నిజంగా రమాకాంత్ వి గ్రేట్ వే "

"అందులోను ఆ రెండురాత్రులు విపరీతమయిన చలిట - అంత చలిలో వెచ్చని కౌగిలిలో హయ్ నీదే అదృష్టం అంటే "

"స్టాప్ఇట్ " కాలేజీ అంతా దద్దరిల్లేలా పెద్దగా అరిచాడు రమాకాంత్.

"మీరు విన్నవన్నీ అబద్ధం" అన్నాడు రమాకాంత్ నిప్పులు కక్కుతూ-

"చూసినవాళ్ళు, నమ్మకమయినవాళ్ళు చెప్పాక అబద్ధం ఎట్లా అవుతుంది_" అన్నాడు ఓ స్టూడెంట్ వెనక్కి జరుగుతూ.

ఇంతలో బెల్ మోగింది — అందరూ క్లాస్ ఎటెండ్ అవ్వడానికి చెదురు మదురయ్యారు.

రమాకాంత్ ఒంటరిగా నడుస్తున్నాడు_ హఠాత్తుగా అతని దృష్టి గోడమీద పడ్డది 'రమాకాంత్ శకుంతలల కామలీలలు — శకుంతల రమాకాంత్‌ల ప్రణయ లీలలు_' అని వ్రాసిఉన్నాయి. వాటికింద ఆడ మొగ ముద్దుపెట్టుకున్నట్లుగా కౌగలించుకున్నట్లుగా బొమ్మలువేసి ఉన్నాయి. రమాకాంత్‌కి విపరీతమయిన కోపం వచ్చింది_ వాటిమీద పెన్‌తో ఇంక్ చల్లాడు. అంటించబడిన కాగితాలను చింపిపడేశాడు. వెనకనుంచి పకపకలు పకపకలు వినబడసాగాయి. అతడు తన క్లాస్‌లో అడుగుపెట్టాడు. లెక్చరర్ రానందువలన అందరూ కబుర్లుచెప్పుకుంటున్నారు .రమాకాంత్‌ని చూసి అందరూ ఘొల్లున నవ్వారు. అతను తను ఎప్పుడూ కూర్చునేచోట కూర్చున్నాడు_ ఎదురుకుండా బోర్డుమీద ఆడ మొగ ఇద్దరూ కౌగలించుకున్నట్లుగా బొమ్మవేసి ఉంది_దాని కింద రమాకాంత్_శకుంతల అని వ్రాసి ఉంది_ అది చూడంగానే వెంటనే లేచి బోర్డుమీద ఉన్నదాన్ని చేత్తో తుడిపివేశాడు — చేతికి అంటుకునిఉన్న చాక్‌పీస్ పౌడర్‌ని దులుపుతూ బయటకి వెళ్ళిపోదామని అడుగు ముందుకువేశాడో లేదో ఎదురుకుండా ప్రిన్సిపాల్ లోపలకి వస్తూ కనిపించాడు_ అంతసేపటినుంచి అరుపులు, కేకలతో, నవ్వులతో అల్లరిగా ఉన్న క్లాస్ నిశ్శబ్దంగా అయింది — కాని అతను లోపలికి రాలేదు — రమాకాంత్‌ని చూసి అక్కడే ఆగిపోయాడు రమాకాంత్ ప్రిన్సిపాల్‌ని విష్‌చేశాడు.

ప్రిన్స్‌పాల్ రెస్పాన్స్ ఇస్తూ_"మిస్టర్ రమాకాంత్ నా రూంకి పద ..." అంటూ తన రూమ్‌వైపుకు నడిచాడు.

ఇద్దరూ రూంలోకి వెళ్ళారు_

"నీ గురించి నేను విన్నది నిజమేనా.... సూర్యనారాయణగారు.... విషయం అంతా చెప్పారు_" అన్నాడు ప్రిన్సిపాల్.

"ఆయన మీ కెట్లా తెలుసు_"

"బాగా పేరున్నవాళ్ళతో మాకు తప్పకుండా పరిచయం ఉంటుంది_"

"ఆయన చెప్పిందంతా అబద్ధం_"

"ఆయన ఒక్కరే కాదు_ ఇంకా చాలామంది చెప్పారు — నీకు కాలేజీలో మంచి పేరు ఉంది_ అదంతా చేజేతులా పాడుచేసుకున్నావ్. కాలేజీకే నీవు తలం

వంపులు తెచ్చావ్. నీవింకా చదవదలుచుకుంటే ఆయనకి క్షమార్పణ పత్రం వ్రాసి ఇవ్వాలి- ఆయన ఈ కాలేజీకి అతి ముఖ్యమైనవాడు- విద్యార్థుల క్యారక్టర్‌కి మేం ఎంతో ఇంపార్టెన్స్ ఇస్తాం-"

"నేను ఎవరికి క్షమార్పణ చెప్పను- ఎవరో ఏదో అన్నారని వాళ్ళందరి కాళ్ళు నేనెందుకు పట్టుకోవాలి- అది మాత్రం జరగదు-"

"నువ్వు వ్రాసి ఇవ్వాల్సిందే. ఇది అందరూ అనుకుని తీర్మానించుకున్న విషయం. నీచేత క్షమార్పణ చెప్పిస్తామని మేం ఆయనకు వాగ్దానం చేసాం-"

"నేను ఆ పని చస్తే చేయను-" నుదుటిమీద పడుతున్న వెంట్రుకలను విసురుగా వెనక్కి తోస్తూ బయటకి నడిచాడు. ప్రిన్సిపాల్ అట్లాగే చూస్తూ ఉండిపోయాడు.

రమాకాంత్ చకచకా నడుస్తూ కాలేజీ ఆవరణ దాటాడు.

"శకుంతలా మన ఇద్దరికి అనాడు లేని సంబంధాన్ని అంటగట్టి నానా హేళన చేశారు- దీనికి సూర్యనారాయణ, రాధాకృష్ణ ఇద్దరే కారణం. ఆ అవమానం భరించలేక బయటకి వచ్చేశా-అంతే మళ్ళీ కాలేజీలో అడుగు పెట్టలేదు-"

"మీ జీవితం ఈ విధంగా కావడానికి కారణం నేనే కదూ- కాని ఆ రాత్రి ఎటూ తోచక మీ ఆశ్రయం కోరా - అద మగ కొన్ని గంటలు ఒంటరిగా గడిపినంత మాత్రాన ఈ సంఘంవాళ్ళ జీవితాలని ఏ విధంగా నాశనం చేస్తుందో మనకు బాగా అనుభవమయింది-" శకుంతల కళ్ళలో నీళ్ళునిండాయి.

"శకుంతలా.... ఒక రకంగా ఇదంతా నా మంచికే జరిగింది- ప్రతి కవి వెనక ఒక స్త్రీ ఉంటుంది అన్న సత్యాన్ని నేను నమ్ముతా- గొప్పగొప్ప కవుల వేదనవల్లే ఎన్నో కావ్యాలు వ్రాశారు. గీతాలు రచించారు. కొన్ని సంఘటనలు మనిషిలో వేదనని పుట్టిస్తాయి- ఆ వేదనే కవితాస్రవంతి అవుతుంది - ఆదికవి వాల్మీకి నోటినుంచి ఈ ఆవేదనే శ్లోకరూపం దాల్చింది-

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీ సమాః
యత్ క్రౌంచ మిథునాదేక మవధీం కామ మోహితమ్-

ఈ వేదనే మనకు రామాయణ కావ్యాన్ని మిగిల్చింది - యక్షుడి విరహ వేదనే కాళిదాస మేఘసందేశరూపాన్ని దాల్చింది - విద్యాపతి, తులసీ, మీర, సూర్, ఘనానంద్ మొదలైన గొప్ప హిందీ కవులందరి మనసుల్లో వేదనే దీపాన్ని వెలిగించింది- ప్రముఖ హిందీ కవి పంత్ ఏమన్నాడో తెలుసా-




వియోగి హోగా పహలా కవీ–
అహ్ సే ఉపజా హోగా గాన్
ఉమడ్‌కర్ ఆంఖోం మే చుప్‌చాప్
బహీ హోగీ కవితా అన్‌జాన్–

విరహవేదనే జయశంకర్ ప్రసాద్ యొక్క– అంసూ– విరహకావ్యాన్ని మనకిచ్చింది– అతని వేదనే కన్నీళ్ళయ్యాయి– కన్నీళ్లే కావ్యం అయింది–

జో ఘనీభూత్ పడాథీ
మస్తక్‌మే స్మృతి సీఛాయా
దుర్‌దిన్‌మే అంసూ బన్‌కర్
వహ్ ఆజ్ బరసనే ఆయీ

తన అలౌకికమైన ప్రియుడిని కలవాలనే తపనే, ఆ ప్రియుడి విరహవేదనే మహాదేవి వర్మను ఓ గొప్ప కవయిత్రిని చేసింది–

నిరాలా, బచ్చన్‌ల జీవితాలలో భార్యావియోగం పెద్ద అపూర్వ సంఘటనగా మారింది– వాళ్ళని గొప్ప కవులను చేసింది – అరిస్టూ – గేటీల జీవితాంలో కూడ ప్రేమసంఘటనలే వేదనను మిగిల్చాయి. షెల్లీ–అవర్ స్వీటెస్ట్ సాంగ్స్, ఆర్ దోజ్ దట్ టెల్ ఆఫ్ శాడెస్ట్ థాట్స్' అని అన్నాడు లాంగ్‌ఫెలో, 'ఇన్ ఈచ్ లైఫ్ సమ్ రైన్ మస్ట్ ఫాల్– సమ్ డేస్ మస్ట్ బి డార్క్– .ఎండ్ డ్రియరీ' అని ఎందుకన్నాడు– తెలుగు కవుల జీవితాల్లోని కొన్ని విషాద సంఘటనలే వాళ్ళని గొప్పవాళ్ళుగా చేశాయి– శకుంతలా. 'సుమన్' పేరు విన్నావుగా–"

"అతడు గొప్ప కవి— ఈనాడు అతని కెంతో గొప్ప పేరు ఉంది—"

"అతడిని గొప్ప కవిగా చేసింది ఎవరూ . ఈ శకుంతలే "

"ఇందాక మీ మాటలువల్ల మిమ్మల్ని కవిగా ఊహించా — కాని సుమన్ గారు మీరు ఒకరేనని తెలియదు— మీరు ఇంటర్వ్యూలు ఇవ్వడానికి ఇష్టపడేవారు కాదు కదూ—"

"అవును ఫోటో—ఇంటర్వ్యూ ఇవ్వడం నా కిష్టం వుండదు—"

"అందుకే ఇన్నేళ్ళబట్టి మీరే సుమన్ అని నాకు తెలియలేదు—"

"నాకు నా అనేవాళ్ళు ఎవరూ లేరు— పొలంమీద వచ్చే పంటమీద డబ్బును మా దగ్గర పనిచేసే పాలేరు పంపిస్తూ ఉండేవాడు — ఎక్కడెక్కడో తిరిగా ఎక్కడా శాంతి దొరకలేదు. మీ ఊరికి వచ్చా— మీరు అక్కడినుంచి వెళ్ళిపోయారని తెలిసింది. ఎన్నో క్షణాలు—ఎన్నో రోజులు—ఎన్నో ఏళ్ళు విలపించా— ఎందుకో మీ మీద మనస్సు మళ్ళేది— ఆ వయస్సులో ప్రతి మొగాడు కోరేదే నేను కోరుకున్నా— మీ తోడుకోసం పరితపించా— ప్రతిక్షణం మీ సాన్నిధ్యం మీ పొందు కావాలనిపించేది— ప్రతిరాత్రి నేను మీతో గడుపుతున్నట్లుగా అనుభవం పొందేవాడిని— ఏవేవో ఊహించుకునేవాడిని ప్రకృతిలో ప్రతిచోట మీరే ఉన్నట్లుగా అనిపించేది. ఎటు చూసినా సన్నజాజులే, ఎటుచూసినా మల్లెలే. ఎటు చూసినా వసంతమే— ప్రతి పూవును మీలాగా, ప్రతి భ్రమరం నాలాగా అనిపించేది. శకుంతలా మనం గడిపిన ఆ రాత్రులలో మీతో నాకేమీ సంబంధం లేదు— కాని ఆ తరువాత ప్రతి రాత్రి మన ఇద్దరినీ ప్రేయసీ ప్రియులుగా భార్యాభర్తలుగా ఊహించుకునేవాడిని— ఎక్కడో దూరంగా ఉన్న మిమ్మల్ని చేరుకోవాలని తపించిపోయేవాడిని. నిన్ను నాలో లీనంచేసుకోవాలని ఆశపడేవాడిని. నాలోని ప్రతి భావం అక్షరాల రూపం దాల్చింది. ఫలితంగా ఒంటరిగా ఎన్నో రాత్రులు— పగళ్ళు ఏవేవో కవితలు వ్రాసేవాడిని ఒకటి కాదు—రెండు కాదు—కొన్ని వందలు వ్రాసేవాడిని వాటిని పదేపదే చదువుకుంటూ ఆకాశంలో విహరిస్తూ ఉండేవాడిని— నాలోని భావాలు పొర్లి పైకివచ్చాయి. ఇదొక ప్రవాహం— అదే కవితాస్రవంతి— ఆ కవితా స్రవంతిలో నేను కొట్టుకుపోయా— ఆ కవిత ప్రేమకవిత ఆ కవితలోని ప్రతి అక్షరం—ప్రతి పదం— శకుంతల గురించే నా కలంలోని సిరాలో మిమ్మల్ని రంగరించి పోసా—కాని నా భావకవిత్వానికి అవకట్ట పడ్డది. ఆకాశంలో విహరించే నేను భూమిమీద పడ్డా— అతివృష్టి—అనావృష్టిలవల్ల పొలంలో ఏమీ పండేది కాదు— ఒక పైసా ఆదాయం లేదు—కొన్ని రోజులు— రోజులు ఆకలితో

ఉన్నా—ఆ ఆకలిలో కూడ మిమ్మల్ని తలుచుకుంటూ కొంతకాలం గడిపా— కాని కొన్నాళ్ళకి ఆ ఆకలిబాధని ఓర్చుకోలేక బ్రతుకుతెరువుకై బయలుదేరా—నా చేతిలో ఏ సర్టిఫికెట్లు లేవు— ఎక్కడా ఉద్యోగం దొరకలేదు— చివరికి నడుంవంచి బొగ్గు గనుల్లో పనిచేసా— అలవాటు లేదేమో ఆరోగ్యం బాగా పాడయింది. అప్పుడు నేను అసలు ప్రపంచంలోకి వచ్చా— అన్ని గంటలు నిద్ర ఆహారాలు మాని పని చేసినా కడుపునిండని కార్మికులను చూస్తే నాకు జాలేసేది. నేను వారిలో ఒకడినై వారితో జీవించా— వారి దుర్భరపరిస్థితిని కళ్ళారా చూసా — అందుకే వారికోసం ఆకలిగీతాలని పాడా — దోపిడీ చేయబడుతున్నవారికి నా చేయిని అందించా — నా కవిత్వం శకుంతలని వదిలి ప్రజలవైపు మళ్ళింది. నేను ప్రజాకవిని అయ్యా..."

"రమాకాంత్.... మీ రెంత గొప్పవారు—"

ఇంతలో భరత్ రావును రెండుచేతులతో పట్టుకుని నెమ్మదిగా లోపలికి నడిపించుకుంటూ వచ్చాడు. రావు ముఖం కళావిహీనంగా ఉంది — శకుంతల వెంటనే—తండ్రిని తనూ చేయిపట్టుకుని తీసుకువచ్చి సోఫాలో కూర్చోబెట్టింది— అమ్మయ్య....అంటూ రావు తల వెనక్కి వాల్చి కూర్చున్నాడు.

"ఓరేయ్ భరత్! తాతయ్యకు ఏమయింది—" ఆందోళనగా అడిగింది శకుంతల.

"సడన్‌గా గుండెపోటు మొదలయింది—వచ్చేటప్పుడు డాక్టరుదగ్గరికి వెళ్ళి వచ్చాం— లోపల పడుకోపెడదాం...." అన్నాడు భరత్—

అక్కడే ఉన్న రమాకాంత్‌ని భరత్ గమనించాడు — రమాకాంత్ రావు దగ్గరిగా వచ్చాడు.

"మాష్టరుగారూ...."

ఎవరా అని కళ్ళుతెరిచి చూచాడు రావు.

"నువ్వు....నువ్వు.... రమాకాంత్‌వి కదూ...."

"అవును .... గుర్తుపెట్టుకున్నందుకు...." రమాకాంత్ భరత్ వంక చూశాడు—

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషం — మిమ్మల్ని ఈ జీవితంలో మరచిపోలేం—" అన్నాడు భరత్.

## 16

ఆ వ్యక్తి లోపలికి అడుగుపెట్టాడు. అక్కడ కూర్చున్న అందరూ అతని వంక చూశారు— ఇంతలో అతని దృష్టి సోఫాలో రావుకి కొంత పక్కగా

కూర్చున్న రమాకాంత్‌మీద పడ్డది. రమాకాంత్ ఆ వ్యక్తిని చూసి చిరునవ్వు నవ్వాడు. లేచి వెళ్ళి అతనికి షేక్‌హాండ్ ఇచ్చాడు.

"నేను మీకు గుర్తున్నానా— అనాడు మా కార్మికులకోసం మీ దగ్గర కొన్ని గేయాలను వ్రాయించుకుని వెళ్ళా—" అన్నాడా వ్యక్తి.

"అవును. మీ పేరు వేణు కదూ— ఆ తరువాత మీరు నన్ను అందరికీ పరిచయం చేస్తాను రమ్మనమని అడిగారు కదూ— మీ ఉత్తరాలకి జవాబు ఇద్దాం అనుకుంటూ ఉండగానే టైం గడిచిపోయింది—"

"మీరు 'మే'డే సెలబ్రేషన్స్‌కి వ్రాసి ఇచ్చిన గేయాలు బాగున్నాయని అందరు ఎంతో మెచ్చుకున్నారు. వాటిని నేను పాడుతూ ఉంటే ప్రజలు ఉద్రూత లూగిపోయారు— వారు చైతన్యపూరితులయ్యేవారు—" అన్నాడు వేణు.

"...మన్‌గారిగురించి ఇంకా చెప్పండి వినాలని ఉంది. మీరు నిన్న ఫోన్ చేసినప్పుడు నేను చాలా బిజీగా ఉన్నా అందుకే ఇవాళ రమ్మనమని చెప్పా—" అన్నాడు భరత్,

"భరత్‌గారూ మీతో ఏకాంతంగా మాట్లాడాలనుకుంటున్నా—"

"ఏ విషయం గురించి మీరు మాట్లాడాలనుకుంటున్నారు—"

వేణు చెప్పటానికి సందేహించాడు.

"పరవాలేదు చెప్పండి అందరూ మా వాళ్ళే—"

"మీరు రీసర్చ్ చేసి కనుక్కున్న ఫార్ములాని ఈ ప్రపంచానికి అందించవద్దని నా మనవి. ప్రపంచ పత్రికలన్నీ, ప్రపంచ వ్యక్తులందరూ పొగుడుతున్న ఆ వయస్సు పొడిగింపు ఈ ప్రపంచాన్ని నాశనంచేస్తుంది - మీరు ఆ ట్రీట్‌మెంటు ఎవరికీ ఇవ్వడానికి వీల్లేదు— వీల్లేదు " ఆవేశంగా అన్నాడు వేణు.

అక్కడున్న శకుంతల, రావు, రమాకాంత్, సరోజ, భరత్ అందరూ ఆశ్చర్యంగా నోళ్ళు తెరుచుకుని చూస్తున్నారు ప్రతిరోజూ ఏదో ఒక చోటనుంచి తమకి ఆ ట్రీట్‌మెంటు కావాలంటూ ఎన్నో ఉత్తరాలు వస్తున్నాయ్ కొందరు స్వయంగా వచ్చి అడుగుతున్నారు. అంత విలువయినదాన్ని, ఇన్నేళ్ళనుంచి కష్టపడి రీసర్చ్ చేసింది ఈ ప్రపంచానికి అందించకుండా ఉండటానికా— ఇతనెవరో పిచ్చివాడిలా ఉన్నాడే— ఇంతవరకు ఎవరి నోటినుంచి ఇటువంటి మాట వినలేదు! ఉహూ.. ఇతను చెప్పింది వినడానికి వీల్లేదు. ఆలోచిస్తున్న భరత్‌కు వేణు మాటలు అంతరాయం కలిగించాయి—

"భరత్‌గారూ— నేను ఇట్లా మాట్లాడుతున్నందుకు కోపం వస్తోంది కదూ— మీరు మీ ప్రయత్నం విరమించుకు తీరాల్సిందే—"

"ఇది నా వ్యవిషయం - ఈ ప్రపంచానికి ఎంతో విలువైనదాన్ని మీ ఒక్కరు కాదన్నారని నేను తెలపకుండా ఊరుకోను - నా జీవిత పరమలక్ష్యం ఒక్కటే- అదే నేను మనిషికి ఆయువు పెంచాలి - మనిషి వయస్సు పెరిగితే వారిలో ఇంకా ఆశలు పుడతాయి - అనుభవిత్వం మానవోత్సాహంతో వాళ్ళు బతుకుతారు- ఎన్నో గొప్పగొప్ప కార్యాలు చేయగలుగుతారు - ఈ ప్రకృతినే జయించగలుగుతారు- మానవుడు ఇంత తక్కువ వయస్సులోనే తెలివి ఉపయోగించి, ఎన్నెన్నో పరిశోధనలు చేశాడు. ఎన్నో సాధనాలు కనుక్కున్నాడు- భూతల స్వర్గానికి దారులు తెరిచాడు- ఇంకా.... ఇంకెన్నో చేయగల శక్తి మానవుడిలో ఉంది-

"మానవుడి ప్రగతికి మీ వయస్సు పొడిగింపు ఎంతో ఉపయోగకరమయినదని మీరనుకుంటున్నారు. కాని అది మానవుడిని అధోగతికి దింపుతుంది. ప్రస్తుతం ఈ ప్రపంచంలో దారుణ మారణహోమాలు జరుగుతున్నాయి - ప్రతీ రోజూ ఎంతోమంది తిండిలేక చనిపోతున్నారు. పుడుతున్న ప్రాణికి సరియైన పోషణ దొరకని ఈ రోజుల్లో పండిపోతున్న ఆ వయస్సుమళ్ళిన వాళ్ళకి వయస్సెందుకు? పండుటాకులు నేలరాలిపోవాల్సిందే. అప్పుడే కొత్తగా వస్తున్న చిగుళ్ళకి బలం- అప్పుడే ఆ చిగుళ్ళకి జీవితం-"

"మీరు మాట్లాడుతున్న ప్రతీమాట అర్థంలేనిది. నేను కనుక్కున్నది దివ్యమయిన ఔషధం- అదే రేపటి వసంతం- తోటలోని ప్రతి పూవు - ప్రతి కాయ నిన్న పుట్టి నేడు నేలరాలిపోతున్నాయి- అదే వాటికి రేపు కూడ ఉంటే... అవి ఇంకా బాగా వికసిస్తాయి- వాటిలో ఇంకా బలం వస్తుంది- అందరికీ ఎక్కువ ఉపయోగిస్తాయి- ఈ ప్రపంచం అనే పెద్ద తోటలో మనుషుల సంగతి అంతే-"

" పెద్దపెద్ద మానులు నీరు గాలి, భూమిలోని శక్తినంతటిని పీల్చుకుంటూ జీవితకాలాన్ని పొడిగించుకుంటుంటే పక్కన నాటబడిన విత్తనాల సంగతి ఏంకావాలి. వేళ్ళు బాగా లోతుగా పాతుకుపోయిన ఆ మానులు విత్తనాలను పైకి రానీయవు- వాటికి పోషకపదార్థాలను దొరకనీయవు - అవి అవిలోనే అంతమవుతాయి- ఇప్పుడు అదే జరుగుతుంది. మనిషి వయస్సు పెరగడంవల్ల ఇంకా గొడవలు ఎక్కువ అవుతాయి- ఇప్పటికే ఉద్యోగాలు దొరకక ఎంతోమంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారు- నిరుద్యోగసమస్య ఇంకా పెరుగుతుంది - ధనవంతులు - పేదవాళ్ళు రెండే రెండు జాతులు ఉన్న ఈ ప్రపంచంలో పేదవాళ్ళు ఎప్పుడూ తిండిలేక డబ్బులేక అనారోగ్యాలతో చనిపోతారు. ఈ ప్రపంచంలో

ధనవంతులకే ఎక్కువ ప్రాముఖ్యత - వారు ఏంచేసినా చెల్లిపోతుంది. వాళ్ళు చేస్తున్న దారుణాలు ఎన్ని వినడంలేదు. వాళ్ళ చేతిలో డబ్బు ఉంది కదా అని ఇప్పటికే విర్రవీగుతున్నారు. మానవత్వాన్ని మరచి తమ కిందవాళ్ళని దారుణంగా హింసిస్తున్నారు- అటువంటివారికి ఇప్పుడు వయస్సు కూడ వాళ్ళ చేతుల్లోకి వస్తే - ఇంక చెప్పక్కరలేదు-వాళ్ళు రాక్షసులకన్నా హీనంగా ప్రవర్తిస్తారు. ఖరీదైన ప్రతిదీ వాళ్ళ చేతుల్లోనే ఉంది. పేదప్రజలు ఎప్పుడూ కన్నీళ్ళు కారుస్తూ బతకాల్సిందే మీరిచ్చే ఆ ఖరీదైన ట్రీట్‌మెంట్ ధనవంతులకే లభిస్తుంది-సూర్యా సంస్థలాంటివి ధనమే కాకుండా వయస్సు కూడ తమ గుప్పిటిలో గట్టిగా బిగించుకుంటే మాలాంటి కార్మికులందరూ ఆత్మహత్యలు చేసుకుని చావల్సిందే-

"మీరు ప్రతిరోజూ పత్రికలు చదువుతూనే ఉంటారుగా-ఇదిగో ఈ పేపర్ కటింగ్స్ చదవండి - ప్రపంచంలో ఎన్ని ఘోరాలు జరుగుతున్నాయో తెలుస్తుంది- ప్రపంచంలో ప్రతి క్షణం జరుగుతున్న మారణకాండ, ఒక దేశం మరో దేశంమీద బాంబులు ప్రయోగించడం- ముస్లిం-హిందూ క్రైస్తవమతాలు అనుక్షణం పోట్లాడుకోవడం గురించి వింటూనే ఉన్నాంగా- మనిషి- మనిషికి మధ్య సామరస్యం లేదు- దొంగతనాలు, ఆత్మహత్యలు - మానభంగాలు - హత్యలు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి- భరత్‌గారూ మీరు ఇంకా పీటన్నింటినీ, ఇంకా పెంచినవాళ్ళు అవుతారు. మేం పడుతున్న కష్టాలు మీకు తెలియవు. మా జీవితాల్లో కన్నీళ్ళు, నిట్టూర్పులు తప్ప మరేం ఉన్నాయి. ధనికవర్గంవారికే అన్ని సుఖాలు అన్ని భోగాలూ-"

"మిస్టర్ వేణూ! అగ్గిపుల్ల నిప్పంటించి వంటచేసుకోవడానికి పనికి వస్తుంది- ఇల్లు తగలబెట్టడానికీ పనికివస్తుంది - సైన్స్‌ని సద్వినియోగ పరచుకోవాలే కాని అది మానవుడిని ఎంతో ముందుకు తీసుకువెళుతుంది. సైన్స్ మానవుడికి ఒక వరంలాంటిది- పరిస్థితుల్లో చాలా మార్పు వచ్చింది. ఇదివరకు జమీందారులు, దొరలు, ఫాక్టరీయజమానులు దారుణాలు చేసేవారు. కాని ఇప్పుడు జనం తెలివిమీరారు, నేడు పేదవారు తమ హక్కులకోసం పోరాడుతున్నారు. కార్మికులు తమ స్థితిని ఎంతో మెరుగుపరచుకున్నారు. ప్రపంచ కార్మికులందరూ నేడు ఏకం అయ్యారు. మీరు చెప్పినదాంట్లో కొంతవరకే నిజం ఉంది - మీరు మరీ అతిశయోక్తిగా చెబుతున్నారు-" అన్నాడు భరత్ పేపర్‌కటింగ్స్‌ను తీసుకుంటూ

"భరత్‌గారూ! మీరు ఆ ఫార్ములాని కాల్చివేయండి. మరి నే వస్తా-" అంటూ వెళ్ళిపోయాడు.




తరువాత వాళ్ళందరూ ఈ విషయం గురించి చాలాసేపు చర్చిస్తూ కూర్చున్నారు

## 17

ఆ వార్త పేపర్లనిండా మారుమ్రోగిపోయింది. భరత్ కనిపించడంలేదని, ఇంకా ఆచూకీ పోలీసులకి దొరకలేదని పత్రికలన్నీ ప్రకటించాయి – పోలీసు డిపార్టుమెంటువారు, దేశనాయకులు భరత్ ఇంటికి వస్తున్నారు – వెళ్తున్నారు– శకుంతల, రావు, రమాకాంత్, సరూ ప్రతి క్షణం భరత్‌కోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు. వారి బాధ వర్ణనాతీతం– వాళ్ళు నిద్ర – ఆహారాలు మానేసి భరత్ అంటూ అతని గురించి చెప్పుకుని ఏడుస్తున్నారు – 'అంటీ భరత్ లేకపోతే నే బతకలేను–' అంటూ శకుంతలని పట్టుకుని ఏడ్చే సరూని ఆ ఇంటివాళ్ళందరూ ఎంతో జాగ్రత్తగా కాపాడుతున్నారు. ఈ వార్త విన్నతరువాత రావు ఆరోగ్యం మరీ పాడయింది. అందరికీ ధైర్యం చెబుతూ శకుంతల ఒంటరిగా కూర్చుని కుమిలి కుమిలి ఏడ్చేది– రమాకాంత్ ఇటుఇటూ తిరుగుతూ ఫోన్లుచేస్తూ భరత్ జాడ కనుక్కోవడానికి ప్రయత్నిస్తున్నాడు. వాళ్ళందరికీ వేణుమీద అనుమానం బలపడసాగింది. నలుగురు అక్కడికి వెళ్ళారు.

"నా భరత్‌ని ఏంచేశావో చెప్పు....చెప్పు...." అంటూ సరూ ఏడ్వసాగింది–

"ఆ రోజు నువ్వు ఒద్దన్నా భరత్ ఆ ట్రీట్‌మెంటుని అందచేస్తానని అన్నాడనేగా మా భరత్‌ని హఠాత్తుగా మాయంచేయించావు. చెప్పు .... భరత్

ఎక్కడున్నాడు— ఈ కన్నతల్లి కడుపులో చిచ్చు రగల్చకు— ఆ రోజు నువ్వే భరత్‌ని బెదిరించావు—" అన్నది శకుంతల వేణుతో.

"వేణు ప్లీజ్ చెప్పండి— మేం పోలీసులకి మీ విషయం తెలియచేయం, భరత్ ఎక్కడున్నాడో చెప్పండి— ప్లీజ్—" రమాకాంత్ అతన్ని బతిమిలాడుతూ అడిగాడు—

రావు అడిగాడు—

అన్నీ విన్న వేణు విభ్రాంతుడయ్యాడు.

"భరత్ విషయం నాకేమాత్రం తెలియదు — ఈ విషయం తెలిసినప్పటి నుంచి నాకు ఎట్లాగో ఉంది— నేనే మీ దగ్గరికి వద్దామనుకుంటున్నా—"

"మర్యాదగా చెప్పు— భరత్‌ని ఏంచేశావు—"

"నేనంత నీచుడిని కాను— అతడు ఏమయ్యాడో నాకు తెలియదు — తెలియదు—"

ఇంక ఏం అడిగినా లాభంలేదని నలుగురూ బయలుదేరారు—

వేణు భరత్ గురించి ఆలోచిస్తున్నాడు— అతడిని గుప్పిటిలో పెట్టుకోవాల్సిన అవసరం ఎవరికి ఉందా అని తనను తను ప్రశ్నించుకున్నాడు— అతనికి సమాధానం దొరికింది— అతనిలో ఆశ చిగురించింది— భరత్‌ని ఎట్లాగయినా రక్షించాలి— అతడు గబగబా అడుగులు ముందుకువేశాడు—

## 18

"అమ్మా! ఈ వార్త మీ కెట్లా చెప్పాలో తెలియడంలేదు—" అన్నాడు ఆ వ్యక్తి విచారంగా—

అక్కడే ఉన్న శకుంతల, రావు, రమాకాంత్, పరూలు అతని నోటి నుంచి ఏం మాట వస్తుందో అని ఎదురుచూస్తున్నారు—

ఆ వ్యక్తి మళ్ళీ నసిగాడు.

అందరి గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగాయి.

"మీ భరత్.... హత్యచేయబడ్డాడు—" అన్నాడా వ్యక్తి.

"ఆ...." నలుగురూ ఒకేసారి అన్నారు—

"భరత్ ...." అంటూ రావు కుప్పలా కూలిపోయాడు—

ఆ వ్యక్తి అతని తలను ఒళ్ళో తీసుకుని—నాడిని చూశాడు.

"నాన్నా.... నాన్నా.... రమాకాంత్ డాక్టర్ని పిలవండి—" అంది శకుంతల ఆందోళనగా—

"డాక్టర్ని పిలవాల్సిన అవసరం లేదు. అతడు మరణించాడు—" అన్నారు అ వ్యక్తి రావుతలని నేలమీద పెడుతూ—

శకుంతల బావురుమని ఏడ్చింది—తండ్రి శవం పక్కన కూర్చున్న శకుంతల అ వ్యక్తి చెబుతున్న విషయాన్ని బొమ్మలా వినసాగింది.

"ఇక్కడికి కొన్ని వేలమైళ్ళ దూరంలో ఓ విమానం కూలిపోయిందన్న వార్త విన్న మేం అక్కడికి చేరాం. అ విమానం సూర్యావంస్థకి అధిపతి అయిన సూర్యనారాయణది. విమానం నేలకూలడంవల్ల అందులో ఉన్న సూర్యనారాయణ, రాధాకృష్ణ, పైలెట్ ముగ్గురూ అతి ఘోరంగా చనిపోయారు. తరువాత భరత్ ఆచూకి తమకోక్కగలిగాం— సముద్రప్రాంతంలో నిర్మానుష్యంగా ఉన్న అ ప్రదేశంలో ఒక వ్యక్తి పిచ్చివాడిలా అరుస్తున్నాడు— 'నేనే....హత్యచేసా— ఇంకా అ విమానం రాలేదా అంటూ అతను పిచ్చిపిచ్చిగా మాట్లాడసాగాడు. అసలు విషయం భరత్ని అ నిర్జనప్రదేశంలో బంధించి సూర్యనారాయణ, రాధాకృష్ణ అ ట్రీట్మెంట్ విషయం చెప్పమని బలవంత పెశాడు— భరత్ వాళ్ళకి అ ట్రీట్మెంట్ ఇవ్వడానికి నిరాకరించడంవల్ల అతన్ని హింసించాడు— చివరికి భరత్ తన లాబ్నుంచి కావలసిన సామాన్లు తెస్తే తెలుపుతానని అన్నాడు—వాళ్ళు విమానంలో బయలుదేరారు—భరత్కి కాపలాగా నటరాజ్ అనే వ్యక్తిని వుంచారు. నటరాజ్ విషయం తెలుసుకుని వీళ్ళ వయస్సు పెంచితే ఇంకా ఎన్ని ఘోరాలు చేస్తారో అని అనుకున్నాడు — అంతకుముందు, నటరాజ్ సూర్యనారాయణవల్ల ఎన్నో బాధలకు గురిఅయ్యాడు — వాళ్ళమీద పగ మొదటినుంచి తనికి ఉంది. అ ట్రీట్మెంటు వాళ్ళు పొందకూడదని, అనాలోచితంగా అవేశంలో ఒంటరిగా బందీ అయిఉన్న భరత్ని చంపేశాడు. అతనికి మెంటల్షాక్ వచ్చింది—"

బొమ్మలా కళ్ళార్పకుండా చూస్తూ కూర్చున్న శకుంతలలో చలనం వచ్చింది—

"అంటి.... భరత్.... అతడు లేకుండా నేను బతకలేను...." వెక్కి వెక్కి ఏడుస్తున్న సరూని శకుంతల దగ్గరికి తీసుకుంది—

"సరూ....ఏడవకమ్మా.... ఏంచేస్తాం.... విధి వ్రాత అట్లా ఉంది—" సరూని ఓదారుస్తున్న శకుంతలకి ఎంత అపుకుందామనుకున్నా ఏడుపును అపుకో లేకపోయింది:

"భరత్—నాయనా.... వెళ్ళిపోయావా— మీ ఇద్దరిని కోల్పోయిన నేను బతికి ఏంచేయాలిరా— భరత్ నువ్వో పెద్ద సైంటిస్టువి కావాలని కలలు కన్నావు— ఈ ప్రపంచానికి ఎంతో మేలు చేయాలనుకున్నావు— కాని....కాని.... ఈ నువు

షుల్లో కొందరు రాక్షసులుంటారురా.... వీళ్ళ జీవితం పెంచాలని, వీళ్ల ఎన్నో వసంతాలు చూడాలని నీవనుకున్నావు. కాని వీళ్ళు నీకేమిచ్చారు— నీ జీవితాన్నే బలితీసుకున్నారు. బాబూ వీళ్ళకోసమా నీవింత కష్టపడ్డది— నీవు వీళ్ళకోసం రేపటి వసంతాన్ని కనుక్కున్నావు— కాని నీ జీవితంలో ఇప్పుడిప్పుడే ప్రవేశించిన వసంతాన్ని వీళ్ళెంత నిర్దాక్షిణ్యంగా నాశనంచేశారురా.... బాబూ భరత్.... నాన్నా.... ఆడదానికి అత్తవారింట్లో మనసుగల మనుషులు దొరకపోతే జీవితం ఎట్లా సర్వనాశనం అవుతుందో.... చూశావా నాన్నా.... ఈ కూతురిని వదిలి ఎందుకు వెళ్ళిపోయావు.... ఇవన్నీ చూస్తూ నా గుండె ఎందుకు ఆగిపోలేదు—" అంటూ విలవిలా ఏడవసాగింది శకుంతల.

"శకుంతలగారూ....మీ కెట్లా ధైర్యం చెప్పాలో తెలియడంలేదు— మనస్సును గట్టిచేసుకోండి...." అన్నాడు వేణు— అతని కళ్ళలోంచి కన్నీళ్లు రాలి కిందపడ్డాయి.

"వేణూ మొన్నటిదాకా మేం అనవసరంగా అనుమానించాం. ఏమీ అనుకోకండి—" అన్నాడు రమాకాంత్

"నా మీద అనుమానం రావడం సహజం— చాలా చెడు జరిగిపోయింది— ఓ పెద్ద గొప్ప సైంటిస్టుని ఈ ప్రపంచం కోల్పోయింది—" అన్నాడు వేణు

"భరత్....భరత్...." అంటూ పిచ్చిదానిలా లేచి ద్వారం దాకా పోతున్న సరోజను వేణు గట్టిగా పట్టుకున్నాడు—

చక్రాల్లాంటి కళ్ళను మరీ పెద్దవిచేస్తూ వేణువంక చూసింది సరోజ.

"శకుంతలా.... ధైర్యం తెచ్చుకోండి. మనం విధితోటి పోరాడటం నేర్చుకోవాలి—" అంటూ రమాకాంత్ శకుంతల చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

బయట వర్షం కురవసాగింది. ఆకాశం తనకోసం ఏడుస్తోందా అని అనిపించింది శకుంతలకి.





# నీ శిక్షేమిటి

శారదా అశోకవర్ధన్

రోజూ ప్రకారం కాలేజీకి తయారవుతూన్న సునీతి, మామయ్య గొంతు విని బయటకొచ్చింది.

"ఏమే కోడలుపిల్లా బాగున్నావా?" పలకరించాడు గోవిందంమామయ్య.

"ఆ.... ఆఁ.... ఇదేనా రావడం?" అంటూ ఆతని చేతిలోని చక్రకేళీలు, అరటిపండ్ల బుట్ట, బందరులడ్డూల పొట్లం అందుకుంటూ అడిగింది సునీతి.

గోవిందం గొంతువిని లోపలినుంచి పరుగెత్తుకొచ్చింది సావిత్రీదేవి.

"ఏమే అక్కాయ్ బాగున్నావా, బావగారు కులాసాయేనా? మధుబాబు బాగున్నాడా?" ప్రశ్నలవర్షం కురిపిస్తున్న గోవిందంకేసి చూసి నవ్వుతూ, "అంతా క్షేమం. మరదలూ, పిల్లలూ అంతా బాగున్నారా?" ఆతని చేతిలోంచి బ్రీఫుకేసునందుకుంటూ అడిగింది సావిత్రీదేవి.

"అందరూ బాగానే వున్నారు. కానీ రాజేశ్వరికి ఈ మధ్య కాళ్ళనొప్పులూ, నడుంనొప్పి వచ్చాయి. మందులిప్పిస్తున్నా ననుకో."

"ఏం? మరదలికి కొడలు తొందరగా రావాలనుందేమో! అందుకే కీళ్ళనొప్పులూ, కాళ్ళనొప్పులూ అంటోంది" నవ్వింది సావిత్రీదేవి.

ఈ సంభాషణ వాళ్ళకి మామూలే కాబట్టి, ఇవేమీ వినిపించుకోకుండా, కాలేజీకి ప్రయాణమవుతోంది సునీతి.

స్నానంచేసి అప్పుడే లోపలికొస్తున్న రాజారావు బావగారిని ఆప్యాయంగా పలకరించాడు "ఏమే కోడలుపిల్లా! నేను

సాయంత్రం వెళ్ళిపోతున్నాను. ఇవాళ కాలేజీకి సెలవు పెట్టి వుండిపోకూడదూ" అన్నాడు గోవిందం, పుస్తకాలు సదురుకుంటూన్న సునీతిని చూసి.

"ఇవాళ ఇంపార్టెంటు సైన్స్ క్లాసుంది. సెలవు పెట్టడమే!" అంటూ "వెళ్ళొస్తా నమ్మా" అని వెళ్ళిపోయింది సునీతి.

"ఎప్పుడు సెలవు పెట్టమన్నా, ఏదో ఒక సాకు. కొంపమునిగిపోయేంత ముఖ్యమైన పనుంది అంటుంది. ఏం చదువులో ఏమిటో" విసుక్కుంది సావిత్రీదేవి.

"ఇంకెన్నాళ్ళులే అక్కాయ్! ఆ మూడుముళ్లూ పడేస్తే సరి. రాజేశ్వరికి ఒంట్లో అసలు బాగుండడంలేదు. రేపు వేసవికాలంలో రవికి పెళ్ళి చేసెయ్యాలనుకుంటున్నాం. వాడూ సరేనన్నాడు, బ్యాంకులో ఉద్యోగం దొరికింది కదా. మువ్వు సరేనంటే, రాజేశ్వరినీ పిలిపిస్తాను. మిగతా విషయాలన్నీ మాట్లాడుకుందాం."

"అలాగేరా గోవిందం! తప్పకుండాను. మాకుమాత్రం ఎంతమందున్నారు. ఒక్క కూతురూ ఒక్క కొడుకూను. దీని పెళ్ళి ఘనంగా చెయ్యాలనే మా కోరికామా."

"అంత తొందరెందుకు బావా! ఇంకొక్క సంవత్సరంపోతే డిగ్రీ అయిపోతుందిగా" అన్నాడు రాజారావుగారు తలదువ్వుకుంటూ

"ఏం పెళ్ళయ్యాక ఆ ఒక్క సంవత్సరం పూర్తిచెయ్య కూడదేంటి!" వెంటనే అందుకుంది సావిత్రీదేవి.

"చెయ్యకపోయినా, నష్టమేముంది! ఉద్యోగం చెయ్యాలా? ఊళ్లేలాలా? ఏదో భగవంతుడి దయవల్ల, మనకి బాగానే వుంది. తినటానికి, ఉండటానికి లోటు లేదు" అన్నాడు గోవిందం.

"అమ్మాయి కాలేజీనుంచి రానివ్వు బావా! అన్ని విషయాలూ మాట్లాడుకుందాం" అన్నారు రాజారావుగారు, ఆఫీసుకెళ్ళడానికి బయలుదేరుతూ.

"తమ్ముడొచ్చాడు కదా, మీ రివాళ ఆఫీసుకి సెలవుపెట్టకూడదూ! ఆ మాతుకి తగ్గ తండ్రి" చెప్పుతూ అంది సావిత్రీదేవి.

"అందుకే కదా నేను ఫోంచెయ్యకుండా ఆఫీసుకెళుతున్నాను. మధ్యాహ్నం ఒచ్చేస్తాలే. ఇంతకీ మీ తమ్ముణ్ణి చూసిన హడావుడిలో నేను ఫోంచెయ్యలేదన్న విషయంకూడా మర్చిపోయావన్నమాట. అంతేలే! ఈ ఆడవాళ్ళకి పుట్టింటివాళ్ళని చూసేసరికి, మతిపోతుంది." అందరూ నవ్వుకున్నారు కాస్సేపు. మధ్యాహ్నం ఒచ్చేస్తావనిచెప్పి రాజారావుగారు ఆఫీసుకి వెళ్ళిపోయారు.

* * *

"నాకి పెళ్ళొద్దు, చదువుకుంటాను" అంది సునీతి!

సావిత్రీదేవికి, దాని పట్టుదలా, అలా మాట్లాడ్డం చూస్తున్నకొద్దీ కోపం

వస్తోంది. "ఈ పెళ్ళొద్దా! అసలు పెళ్ళే వొద్దా!" ఉరుములా వుంది ఆమెకంఠం.

"పోనీలే బావా! పెళ్ళయినా ఆ ఒక్క సంవత్సరం పూర్తి చేసేస్తే, డిగ్రీ చేతి కొస్తుందిగా. నీతీ! నీకేం దిగులు లేదు. హాయిగా చదువుకుందువు గానీ, పెళ్ళి చేసుకుందువుగాని" అన్నారు రాజారావు గారు. ఆ క్షణంలో సునీతికి తల్లిమీద చచ్చేంత కోపమూ తండ్రంటే ఎంతో గౌరవమూ, ఆప్యాయతా అనిపించింది. మాట్లాడకుండా అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది.

మౌనం అంగీకారమే కదూ! వెంటనే పురోహితుణ్ణి పిలిపించడం, రాజేశ్వరికి కబురు పెట్టడం, ముహూర్తాలు పెట్టేసుకోవడం, కట్నకానుకలు మాట్లాడుకోవడం అన్నీ ఒకదానివెంట ఒకటి జరిగిపోయాయి.

చూస్తుండగా, రెండునెలలూ రెండు రోజుల్లో గడిచిపోయాయి. సావిత్రీదేవి కసలు టైము తెలీడంలేదు. ప్రతిరోజూ, పట్టుచీరల దుకాణాలచుట్టూ తిరగడం, వెండీ బంగారాలకొట్లు తిరగడం, ప్రతి వారితోటీ పెళ్ళివిషయాల గురించి మాట్లాడటం, ఏర్పాట్లు చెయ్యడంతోటే గడిచిపోయింది

సునీతి కసలు ఈ గొడవంతా ఇష్టం లేదు. కానీ తన మాట వినేదెవరు! నోరు మూసుకుని కూర్చుంది. ఎందుకో తనకి ఏమాత్రం ఉత్సాహం కలగడంలేదు. కానీ, తల్లికి భయపడి నోరుమూసుకు కూర్చుంది.

ఆ శుభముహూర్తం రానే వచ్చింది. తళతళ మెరిసే పట్టుచీరలూ, జిగేలుమని పించే ఒంటెడు నగలూ, ఎన్నున్నా ఏదో కొరత సునీతిని వేధిస్తోంది. హాయిగా నవ్వలేక పోతోంది సునీతి. రవిని చూస్తుంటే, తమ్ముడు మధులా అనిపిస్తున్నాడు!

అయిన సంబంధమే అయినా, అన్ని లాంఛనాలతోటీ వివాహం జరిపించారు సావిత్రీదేవీ రాజారావులు! ఇంకా ఒక్క సంవత్సరం చదువూ పూర్తికావాలని సునీతి పట్టుపట్టింది కాబట్టి, చదువయ్యే వరకూ శోభనం చెయ్యొద్దనుకున్నారు. సునీతి నాలుగైదుసార్లు విజయవాడ అత్తారింటికి వెళ్ళొచ్చింది. పండుగలకీ పబ్బాలకీ రవి కూడా హైదరాబాద్ వొచ్చి వెళ్ళాడు రెండుమూడుసార్లు. పెళ్ళయ్యాక సునీతిలో పెద్ద ఉత్సాహం కనిపించక పోవడం, అందరికీ ఏదో కొరతగా వుంది. అర్థంకాకపోయినా, ఏదో చిన్నపిల్లలే అని సర్దుకుని ఊరుకున్నారు.

సునీతి ఫైనలియర్‌లో కాలుపెట్టింది. రాజేశ్వరమ్మ కోడలిచదువు ఎప్పుడు పూర్తవుతుందా అని రోజులు లెక్కపెడుతోంది. సావిత్రమ్మకి, వీలైనంత త్వరలో మనవణ్నెత్తుకోవాలని వుంది. సునీతి మాత్రం తన చదువూ, కాలేజీ గొడవతప్ప ఏమీ పట్టించుకోవడంలేదు.

సంక్రాంతి సెలవుల్లో కోడల్ని పంపించమని రాసింది రాజేశ్వరమ్మ. కానీ కాలేజీనుంచి 'ఖజురాహో'కి ఎక్స్‌కర్షన్ ఏర్పాట్లు చెయ్యడంవల్ల సునీతి ఖజురాహో వెళతానని పట్టుబట్టింది. స్నేహితులంతా కలిసి, సరదాగా వెళుతున్నారు, వెళ్ళనివ్వమన్నారు రాజారావుగారు.

సునీతి ఎంతో ఉత్సాహంతో ప్రయాణమైంది. కావలసినన్ని తినుబండారాలూ, చేతినిండా డబ్బూ తీసుకుని స్నేహితులంతా ప్రయాణమయ్యారు. ఇన్నేళ్లుగా కలిసి చదువుకున్న వాళ్ళంతా, ఈ సంవత్సరం కాగానే. ఒక్కొక్కరూ తలో మూలా విడిపోతారన్న భావం వాళ్ళలో జీర్ణించుకుపోయి, ఫైనలియర్‌లో అందరూ ఎంతో కలిసిమెలిసి ఉంటారు

* * *

యావత్ ప్రపంచం తిరిగొచ్చినా, మన భారతదేశంలోని సాంప్రదాయ సిద్ధమైన కొన్ని కళలూ సంస్కృతి మరెక్కడా కనిపించవనిపిస్తుంది. ముఖ్యంగా లలితకళలకు పట్టుకొమ్మవంటి దేవాలయ శిల్పసంపద! ఆ గాథలూ, సొంపుసొంపుల నృత్య భంగిమలూ, కళ్ళకు కట్టినట్టు చెక్కిన ఆ శిల్ప సౌందర్యం వర్ణనాతీతం! మైమరచి చూస్తున్నారు అందరూ. తన్మయత్వంలో మునిగి బాహ్య ప్రపంచాన్నే మరచిపోయింది సునీతి. అలాగే నిలుచుండిపోయింది.

"ఎక్స్యూజ్ మీ! మీదేవూరు!" ఆ అపరిచిత కంఠం విని ఉలిక్కిపడింది సునీతి. కలవరపాటుతో చుట్టూ కలయజూసింది. తన స్నేహితులు కాలేజీవాళ్ళూ అప్పుడే అక్కడినుంచి వెళ్ళిపోయి, పదిగజాల దూరంలో కనిపిస్తున్నారు!

సునీతి గబగబా వెళ్ళబోయి, చీరకుచ్చెళ్లు అడ్డుపడి తూలిపోయింది. వెంటనే అతను పడిపోకుండా ఆమెని పట్టుకున్నాడు. ఆ స్పర్శలో ఏదో కమ్మదనం, ఏదో హాయి ఒక్క-క్షణం అలాగే వుండిపోయి, అతని కళ్ళల్లోకి చూసింది. అతని మొహంలోని ఆకర్షణ, అతని చూపుల్లో కావ్యాని కందని కమనీయ భావాలూ, దృష్టి మరల్చుకోలేకపోయింది సునీతి. అతను చిరునవ్వు నవ్వాడు! తనూ నవ్వింది! వెంటనే తేరుకుని, "సారీ" అంది ఎలాగో గొంతు పెగల్చుకుని

"ఫరవాలేదు, పూర్తిగా పడలేదు" అన్నాడు నవ్వుతూ.

"మీరు పట్టుకున్నారు కాబట్టి సరిపోయింది. లేకపోతే పడేదాన్నే" అంటూ కంగారుగా వెళ్ళబోయింది.

"మేడమ్! ఇంతకీ నా ప్రశ్నకి మీరు సమాధానం చెప్పలేదు" అన్నాడతను అదే చిరునవ్వుతో.

"ఏ ప్రశ్న?" ముందుకు నడుస్తూ అడిగింది.

"మీదేఊరు!"

"అదా! హైదరాబాదు."




"మీ పేరు?"

'మీ కెందుకు?' అని అనాలనివున్నా అనలేకపోయింది.

"సునీతి."

"చక్కటి పేరు!"

అతనలా అంటూవుంటే, తనకెందుకులే అనిపించినా అడగాలనిపించింది! అడిగేసింది.

"మీదే వూరు?" అని.

"కాకినాడ!"

"మీ పేరు?"

"డాక్టర్ ప్రహ్లాద్" అంటూ జేబులోంచి విజిటింగ్‌కార్డ్ తీసిచ్చాడు.

అప్రయత్నంగానే అందుకుంది.

"అఁ.... ఎక్కడ దిగారు?" వెళ్ళిపోతూవున్న సునీతికేసి చూసి దిగ్గరగా అడిగాడు.

"గెస్టుహావుసులో". గబగబా వెళ్ళిపోయింది సునీతి.

ఇదంతా దూరంనుంచి చూస్తున్న స్నేహితులు చెవులు కొరుక్కున్నారు.

"ఎవరతను?" కొంటెగా అడిగింది ఒక ఫ్రెండు.

"దూరంనుంచి సినిమా షూటింగులా అనిపించింది" అంది ఇంకో ఫ్రెండు.

సునీతి చిన్నబుచ్చుకున్నా వాళ్ళ మాటలకి, అతని రూపం మదిలో మెదిలి, అతని స్పర్శ గుర్తుకొచ్చి, వారి మాటలని పెడచెవిని పెట్టింది. ఆ మర్నాడు అతడు 'గెస్టుహావుస్'కి వచ్చాడు. అతణ్ణి చూడగానే, సునీతిని వొదిలిపెట్టి, స్నేహితురాళ్ళంతా దూరంగా వెళ్ళిపోయారు.

"ఇక్కడి కెందుకొచ్చారు?" అని అడగాలనుకుంది సునీతి. "వచ్చారా?" అంది.

"రాకుండా ఎలా వుంటాము?"

"అతని మాటలు సంగీతంలా అని పించాయి."

"ఎందుకని?"

"నాకు మీ బొమ్మ గియ్యాలని వుంది."

సునీతి కళ్ళు ఆనందంతో మెరిశాయి. మీరు బొమ్మలు కూడా గీస్తారా?"

"ఓ...గియ్యాలని బుద్ధిపుట్టినప్పుడు." నవ్వితే అతని బుగ్గలు సొట్టలు పడు తున్నాయ్.

"ఒకే మనిషిలో, ఒక సైంటిస్టూ, ఒక కళాకారుడూ వున్నాడన్నమాట."

"మొదటిది నా వృత్తి, రెండోది ప్రవృత్తి."

"కవిత్వంలోకూడా ప్రవేశమున్న ట్టుందే" కొంటెగా నవ్వుతూ అంది సునీతి.

"ఊఁ...కదిలించే బొమ్మలు కనిపించి నప్పుడు."

ఇలా చిలిపిగా ఇరువురూ ఎంతసేపు మాట్లాడుకున్నారో, అందరూ భోజనానికి బయలుదేరేవరకూ తెలీలేదు సునీతికి.

"నే వెళ్ళాలి" అంది అతని పర్మిషన్ కోసం ఎదురుచూస్తూన్నట్టు సునీతి.

"మనం వేరే హోటల్‌కి వెళ్ళి భోం చేద్దామా?" అడిగాడు ప్రహ్లాద్.

"అమ్మబాబోయ్" కేక పెట్టినట్టుగా అంది సునీతి.

"ఏం?"

"రా! సునీతి ఫరవాలేదు "

"మరోసారి."

"ఎప్పుడూ?"

"రేపే మేం వెళ్ళిపోతున్నాం."

"మరి?"

"మీరు హైద్రాబాదుకి వచ్చినప్పుడు."

"అయితే మీతో నే వచ్చేస్తాను."

"ఊఁ..." నవ్వింది సునీతి.

సునీతి ఫ్రెండ్సందరూ భోజనానికి వెళ్ళిపోయారు, ఆమె నొదిలేసి. "వాళ్ళం దరూ నన్నొదిలేసి వెళ్ళిపోయారు" అంది భయంగా సునీతి.

"పోతే ఏం? నే వున్నాగా?" నవ్వుతూ అన్నాడు ప్రహ్లాద్. అతనంత చనువుగా, నిబ్బరంగా మాట్లాడుతూవుంటే, ఆశ్చ ర్యం, ఆనందం, ఏదో తెలియని అను బంధం ఆమెని అతనికి దగ్గరకి చేర్తోంది. సిగ్గుతో తల వాలిపోయింది. అప్రయ త్నంగా ఆమె చూపులు గుండెలమీద వేలాడుతూన్న మంగళసూత్రాల పైన పడ్డాయి. అంతే! ఏదో భయం, ఏదో ఆందోళన కలవరపెడుతూవుంటే పిచ్చి దానిలా లోపలికి పరుగెత్తి వెళ్ళిపోయింది.

"సునీతి....సునీతి" అని అతని పిలు పులు చెవులకి వినబడుతూనే వున్నాయ్.

అన్నం తినాలనిపించలేదు. తన గదికి వెళ్ళి పడుకుంది.

భోంచేసి వొచ్చిన స్నేహితులూ లెక్చరర్లూ సునీతిని భోజనానికెందుకు

రాలేదని అడిగారు. తల నొప్పిగా వుందని చెప్పి మాట్లాడక పడుకుంది.

ఆ సాయంత్రం అందరూ సినిమా ప్రోగ్రాం పెట్టుకున్నారు. సునీతి రానంటే ఎవ్వరూ బలవంతం చెయ్యలేదు. అందుకు సునీతి మరింత బాధపడింది. తననొదిలేసి, అందరూ వెళ్ళిపోయేసరికి భోరుమని ఏడవాలనిపించింది. గుండె పగిలి పొంగుకొస్తున్న కన్నీటిని ఆపలేక పోతోంది. ఏడ్చి ఏడ్చి అలసిపోయిన సునీతి మంచంమీద వాలిపోయి ఆలోచనలతో మునిగిపోయింది.

రవీ, ప్రహ్లాద్ మార్చి మార్చి కన బడుతున్నారు. ఒకరి తరువాత ఒకరు ఇద్దరూ తనని కాళ్ళకేసి లాగుతూన్నట్టని పించింది. ఎందుకనో రవి అంటే అభిమానంతప్ప ప్రేమ కలగడంలేదు. అది తప్పే కావచ్చు! కానీ ఏం చేస్తుంది తను? ఎంత కాదన్నా ప్రహ్లాద్‌తో కలుసుకున్న మధురక్షణాలని మరచిపోలేకపోతోంది. రవీ, తనూ చిన్నప్పుడు ఆడుకున్న ఆటలూ, చెప్పుకున్న కబుర్లూ తమాషాగా, హాయిగా అనిపిస్తాయి కానీ, ఆ కబుర్లలో పులకరింత లేదు. వలపులేదు. అందుకనే రవితో పెళ్ళంటే తనకేమీ అనిపించలేదు. కానీ ఇప్పుడెలా? ఈ బలవంతపు పెళ్ళిచేసుకుని, ఇష్టంలేని కాపురం చెయ్యాలి! 'మనసులేని మనువు కన్నా మరణం మేలు'. ఆలోచనలతో తల బద్దలవుతూవుంటే 'అమ్మా మీ కోసం ఎవరో వచ్చారు' అంటూ ఆయా వొచ్చి చెప్పింది. చెరిగిన బొట్టు సరిచేసుకుని, చెదిరినజుట్టు సవరించుకుని బయటి కొచ్చింది సునీతి. నవ్వుతూ ప్రహ్లాద్ కనిపించాడు. పాలసముద్రంలో అమృతం దొరికినంత ఆనందం! వెయ్యి ఏనుగుల బలం ఒక్కసారొచ్చింది. క్షణంలో అతని చేతుల్లో వాలిపోవాలనిపించింది. కానీ నిలదొక్కుకుని "వచ్చారా?" అంది.

"రాకుండా వుండగలనా?" అదే నవ్వు, అవే చిలిపిచూపులు.

ఇద్దరూ అక్కడ మెట్లమీద కూర్చున్నారు. ఇరువురి మధ్యా ఏదో మౌనం! ఇరువురి హృదయాల్లో ఏదో కల్లోలం! అలా కొంతసేపు గడిచింది.

"మీకు తెలుసా? నేను వివాహితని."

"తెలుసు."

ఎలా?"

"నీ గుండెలమీద ఊగులాడుతూన్న ఆ మంగళసూత్రాలే చెబుతున్నాయి."

"మరి?"

"అయినా, నీ మనసు నాదనిపిస్తోంది."

"అయితే ఏం లాభం?" అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

"సునీతీ! నేనొక డాక్టర్ని. ఎందరో ఆడవాళ్ళు నా జీవితంలో తటస్థపడ్డారు. అమ్మ పెళ్ళిచేసుకోమని పోరుపెట్టింది. నాన్నగారు మందలించారు అన్నీ కాదన్నాను. నేను మెచ్చినపిల్ల దొరికితే తప్ప

కుండా చేసుకుంటానన్నాను. ఆ రోజు నువ్వు ఆ శిల్పాల మధ్య, అపురూప శిల్ప సుందరిలా అగుపించావు. అయస్కాంతంలా నీ పైపుకు ఆకర్షితుడనయ్యాను! ఆనాడే తెలుసు నాకు! నాకూ మీకూ మధ్య ఇంత పెద్ద అఘాతముందని! కానీ, నిన్ను మరచిపోవడం నావల్ల కాలేదు. నీ పరిస్థితి అలాగే వుందని ఒక ప్రేమికుడిగా కాక, ఒక వైద్యుడిగా గ్రహించాను. అందుకే మళ్ళీ మళ్ళీ నీ దగ్గరికొచ్చాను. సునీతీ! మీ కాపురాన్ని పాడుచెయ్యాలని కాదు. కానీ, నా కెందుకో అనిపించింది, మీకా వివాహం ఇష్టం అయివుండదని!"

సునీతి చెంపలమీదుగా కన్నీళ్ళు ధార కట్టాయి. జరిగినదంతా అతనితో చెప్పింది! తన సమస్యకి పరిష్కారం కోరింది.

"సునీతీ! మన ప్రేమని సమాజం హర్షించదు. మన కలయిక పెద్దలు ఒప్పుకోరు. నువ్వు రాజీపడి అతనితో సంసారం చెయ్యడమే మేలు."

"మానవత్వమున్న మనిషి మానసిక శాస్త్రాన్ని చదివిన వైద్యుడిగా మీరూ ఆ మాటే ఎలా అనగలుగుతున్నారు! బలవంతపు పెళ్ళి చెయ్యడం, మెడకి ఉరి తాడు బిగించడమవదా!" వెక్కి వెక్కి ఏడ్చింది.

"అయితే మీకు ధైర్యముంటే పెద్దల నెదిరించు! ఉన్నది ఉన్నట్టు చెప్పెయ్." సునీతి తల నిమురుతూ లాలిస్తూ అన్నాడు ప్రహ్లాద్.

"కానీ,......"

"ఏమిటి! ఇన్నాళ్ళూ అతనితో కాపురంచేసి, ఎలా తెగతెంపులు చేసుకోవాలనే నీ బాధ!"

"అసలు నేను కాపురానికే వెళ్ళలేదు."

ప్రహ్లాద్ ఆమెని గుండెలకి హత్తుకున్నాడు. జేబురుమాలు తీసి, కళ్ళు తుడిచాడు ఓదార్పుతో.

గుండె గుండె కలిసి, ఎన్నో గుసగుసలు చెప్పుకున్నాయి! ఇరువురిలోనూ ఏదో నిబిడలాంటి ప్రశాంతత ఏర్పడింది. పక్కపక్కగా కూర్చుని ఎన్నో విషయాలు చర్చించుకున్నారు. కాలం క్షణాలమీద దొర్లిపోయింది.

"వెళ్లొస్తా" నన్నాడు ప్రహ్లాద్.

"సరే" నంది సునీతి.

కనుమరుగయ్యేవరకు చెయ్యూపుతూ ఒకరికి ఒకరు వీడ్కోలు చెప్పుకున్నారు.

తేలికపడ్డ హృదయంతో వచ్చి మంచమీద వాలిపోయింది. సినిమానుంచి స్నేహితులంతా తిరిగొచ్చాక, అందరితో పాటు తానూ కాస్త ఎంగిలిపడింది.

* * *

సునీతి మాటలు విని నోట మాటరాక మూగవాడిలా కూర్చున్నారు రాజారావు గారు. నెత్తీనోరూ కొట్టుకుంది సావిత్రీదేవి.

"ఈ ఇంటిపేరు పాడుచేస్తున్నావు" అన్నాడు తమ్ముడు మధుబాబు, అవహేళించుకుంటూ.

సునీతి చలించలేదు ధృఢ విశ్వయంతో మనోనిబ్బరంతో, అసలు తొణకలేదు

ఆ రోజు ఇంట్లో అందరూ ఉపవాసమే. పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు, ఎవరూ. ఆ సాయంత్రానికి ఉన్నట్టుండి రాజారావుగారు, 'గుండెనొప్పి' అన్నారు. మధూ డాక్టర్ని పిలుచుకురావడం, రాజారావుగారిని ఆస్పత్రిలో చేర్పించడం అంతా జరిగిపోయింది. దాంతో మధూ, సావిత్రీదేవీ సునీతితో మాట్లాడ్డం కూడా మానేశారు. తండ్రి పరిస్థితి ఆందోళనకరంగా వుందని తెలిసి, వెయ్యిదేవుళ్ళకి మొక్కుకుంది సునీతి, ఆయనని కాపాడమని. దాదాపు పదిహేనురోజులు పట్టింది, రాజారావుగారు ఇల్లుముఖం పట్టడానికి. ఈలోగా ఈ వార్త తెలిసి గోవిందం, రాజేశ్వరమ్మ, రవీ, అంతా వచ్చారు, రాజారావుగారిని చూడ్డానికి.

సావిత్రీదేవి ద్వారా విషయాలన్నీ తెలుసుకున్న గోవిందం చిందులు తొక్కాడు. తమ ఇంటి పరువుమర్యాద అంతా గంగలో కలిసిపోయిందని కుమిలిపోయింది రాజేశ్వరమ్మ.

"పదిమందిలో ఒకసారి తాళికట్టించుకుని ఏ సంబంధమూ లేనట్టు ఆ తాళి తెంచుకుని మరొకడిచేత పుస్తె కట్టించుకోవడానికి ఏనాడయితే నా కూతురు సిద్ధపడిందో, అప్పుడే అది నాకు కూతురు కాదనుకున్నాను." తల బాదుకున్నారు రాజారావుగారు.

అందరి చూపులూ సునీతిపైన బడ్డాయ్. బోనులో నిలబడ్డ దోషిని చూస్తున్నట్టు చూస్తున్నారు అందరూ.

సునీతిలో ఆత్మాభిమానం బుసలు కొట్టింది. వాళ్ళందరి మాటలూ వింటూ వుంటే, వాళ్ళమీద అసహ్యం పుట్టింది.

"ఒకడిని పెళ్ళిచేసుకుని, ఇంకొకడితో సంసారం చెయ్యాలనుకోవడం వ్యభిచారంతో సమానం" కసిగా అన్నాడు రవి.

"రవీ!" కోపంగా అరిచింది సునీతి.

"చెయ్యగా లేనిది చెప్తే తప్పా? పౌరుషం, రోషం బాగానే వుందే!"

ఆ మాటలలోని ఏహ్యభావాన్ని హేళనని భరించలేకపోయింది సునీతి. "షటప్! నా ఇష్టం. తాళి కట్టాను కదా అని నీ ఇష్టం వొచ్చినట్టల్లా మాట్లాడే హక్కు నీకు లేదు." ప్రతిమాటా నొక్కి పలుకుతూ అంది సునీతి.

"మాట్లాడే హక్కే కాదు, తాళికట్టిన భర్తగా నాలుగు తగిలించే హక్కు కూడా వాడికుంది" కొడుకుని సమర్థించింది రాజేశ్వరమ్మ.

"చేసింది చాలక హక్కుల గురించి మాట్లాడుతోంది, పెద్ద లాయరులాగా" అన్నారు గోవిందంగారు.

"అవును. నేను లాయర్నే అవుతాను. మీకు బుద్ధిచెప్పడానికయినా 'లా' చదువుతాను," ఉక్రోషంతో అంది సునీతి

"ఏం చదువుతే ఏం? మనిషికి నీతి, నీతి వుండాలి" పళ్ళు పటపటా కొరికాడు గోవిందం.

"నీతిమాలిన పని నేనేం చెయ్యలేదు, మామయ్యా."

"ఇంకా ఏం చెయ్యాలే! పదిమంది లోనూ తలెత్తుకోలేకుండా చేశావు." తల బాదుకున్నారు రాజారావుగారు.

"పెళ్ళిచేసుకున్న భర్త బతికుండగానే వేరొకడితో కాపురం పెట్టడానికి సిద్ధమయ్యావు. పరువుగా బతికేవాళ్ళకి ఇంతకన్నా అవమానం ఇంకోటి లేదు" సునీతకేసి కొరకొరా చూస్తూ అంది సావిత్రీదేవి.

"అసలు నా కిష్టంలేని పెళ్ళి చెయ్యడం మీ తప్పు కాదా? ఎంత ప్రయత్నించినా రవిని నేను ప్రేమించలేక పోతున్నాను. ప్రహ్లాద్ నేను చిత్రంగా కలుసుకున్నాం. కానీ, మిమ్మల్ని బాధపెట్టి, నేను అతణ్ని పెళ్ళి చేసుకోను! కానీ, ఒకటి మాత్రం నిజం, రవితో మాత్రం సంసారం చెయ్యను" ఎవరి సమాధానం కోసం ఎదురుచూడకుండా, గిరుక్కున వెనక్కి తిరిగి లోపలికి వెళ్ళిపోయి, తన మంచంమీద పడుకుని, వెక్కి వెక్కి ఏడ్చింది సునీత.

గోవిందం, రాజేశ్వరమ్మ, నానా మాటలూ అన్నారు, 'గుణంలేని పిల్ల' అని, 'చెడిపోయిన పిల్ల' అని!

సావిత్రిదేవి, రాజారావులు ఎంత వారించినా వినక, ఇక ఆ ఇంటికో ఆ రోజుకో సంబంధం తెగిపోయిందంటూ, గోవిందం రాజేశ్వరమ్మా రవీ వెళ్ళిపోయారు

'విడాకులకు దరఖాస్తుపెడదాం, కావాలంటే రవికి మళ్ళీ పెళ్ళిచేసుకోమని' బతిమాలారు రాజారావుగారు గోవిందాన్ని.

• • •

కాలం గడుస్తోంది. ఫస్టుక్లాసులో ప్యాసయిన సునీత 'లా' కాలేజీలో చేరింది. రవి మాత్రం ఒక మంచి శుభ ముహూర్తాన, తల్లికి తండ్రికి నచ్చిన పిల్లని చేసుకుని ఓ ఇంటివాడయ్యాడు. బి.కాం. పూర్తిచేసిన మధూ ఇక చదవనని, బ్యాంకులో చేరాడు. రాజారావుగారు మాత్రం మంచం దిగడంలేదు. సావిత్రీదేవికి బ్లడ్‌ప్రెషరు, గుండెదడ పట్టుకున్నాయి.

సునీతీ, ప్రహ్లాద్ కేవలం మంచి స్నేహితులుగా మిగిలిపోయారు. డా॥ ప్రహ్లాద్ కాకినాడలోనే ప్రాక్టీస్ పెట్టాడు. ఉత్తరాలతో తప్ప, సునీతకీ, ప్రహ్లాద్‌కీ కలుసుకునే అవకాశాలే లేకపోయినా, అపనిందలూ, అభాండాలూ, రోజుకొకటి పుడుతూనే వున్నయ్. అయినా సునీత జీవిస్తూనే వుంది, చావాలనుకోలేదు.

కాలం ఎవరికోసమూ ఆగదు. ఆస్తిపాస్తులున్నాయ్. ఒక్కడే కొడుకు. మధు బాబుకు సంబంధాలొస్తూనే వున్నాయ్.



సావిత్రీదేవిని ఒంటరితనం బాధిస్తోంది. సునీతితో మనసువిప్పి మాట్లాడలేక పోతుంది. ఉన్న ఒక్క తోడబుట్టువూ, సునీతి వివాహం ద్వారా, దూరమయ్యాడు. భర్త అనారోగ్యం ఆమెని పీడిస్తోంది. కనీసం కోడలైనా వొస్తే ఇంట్లో కొత్తదనం, కొత్త ఆశలూ చిగురిస్తాయనుకుంది. మంచి సంబంధం చూసి ఖాయంచేసింది, ఇప్పుడు ఒక్క సునీతి తప్ప ఆ ఇంట్లో ఎవ్వరూ ఒంటరివారు కారు.

మధుబాబు భార్య జయకి సునీతిమీద గౌరవం లేదు. ఏవో సూటిపోటీ మాటలంటూనే వుంటుంది, అవకాశం వొచ్చినప్పుడల్లా.

వంశోద్ధారకుడు కలిగాడని మురిసిపోయారు రాజా రఘుగారు, సావిత్రీదేవి. సునీతి ఆ సంవత్సరమే 'లా' పట్టానందుకుందన్న విషయం ఎవరూ పట్టించుకోలేదు. ఆ సంతోషం ఒక్క ఆమెకే పరిమితమై పోయింది. ప్రహ్లాద్ మాత్రం నాలుగుపేజీల ఉత్తరం రాశాడు. ఉత్తరంతోపాటు, ఒక రష్యన్ 'ఫర్మ్'లో 'లా' ఆఫీసరుకోసం చేసిన ప్రకటన కూడా పంపించాడు. వేరే ఊళ్లో అంటే ఇంట్లో వాళ్ళు అనుమానపడతారేమో కాని. ఉన్న

ఊళ్లోనే కాబట్టి ఎవ్వరూ అభ్యంతరం చెప్పలేదు. సునీతికి ఆ ఉద్యోగం అవలీలగా వచ్చింది.

రవికి ఒక కొడుకు ఒక కూతురూ. మధూకీ ఒక కొడుకూ ఒక కూతురూ. కాలం ఏవి వేగానే గడిచిపోతోంది. సునీతి సంపాదనలో, ఏ పండగొచ్చినా అందరికీ బట్టలు కొంటుంది. మేనకోడలు 'వర్ష'కి గొలుసు మురుగులూ చేయించింది. ఇప్పుడు సునీతిపైన ప్రత్యేకంగా ప్రేమ చూపించకపోయినా, కనీసం అసహ్యించుకోవడంలేదు. సునీతి జీవితంలో సంతోషకరమైన రోజు, ప్రహ్లాద్ దగ్గరి నుంచి ఉత్తరం వచ్చినరోజు.

కాలప్రవాహంలో మరో మూడు వసంతాలు గడిచాయి. రాజారావుగారూ, సావిత్రీదేవి ఇంచుమించు ఒకరి తరువాత ఒకరు, సంవత్సరం తిరక్కుండానే కళ్లు మూశారు. ఎంతో గోవిందం, రాజేశ్వరమ్మ వచ్చి మధుని పలకరించి వెళ్లారు. సునీతి మాత్రం శత్రువుగానే మిగిలిపోయింది తల్లి తండ్రీ పోవడం, మరదలు జయ రుసరుసలూ, సునీతికి ఆ ఇంట్లో వుండడం కష్టంగానే వుంది.

భగవంతుడు చిమ్మని చీకట్లో మిణుగురు పురుగుని ప్రవేశపెట్టి, వెలుతురుందనే భ్రమతో చిరుఆశలు కల్పిస్తాడు! లేకపోతే మనిషి నిరాశతో కుమిలిపోతాదేమో!

సునీతికి కంపెనీద్వారా డిప్యుటేషన్ మీద రెండేళ్ళకోసం రష్యాకి వెళ్ళే అవకాశం వొచ్చింది సునీతి ప్రయాణమయింది. ప్రహ్లాద్ హైదరాబాదొచ్చాడు సునీతిని సాగనంపడానికి! సునీతి ప్రహ్లాద్‌ని, ఎవరినైనా మంచి అమ్మాయిని చూసి పెళ్ళిచేసుకోమని ఎంతో నచ్చచెప్పింది. అతను 'ససేమిరా' కాదన్నాడు. 'మనువాడనంత మాత్రాన, మనసులు కలిసిన మనం భార్యాభర్తలం కాదంటావా?' ప్రశ్నించాడు ప్రహ్లాద్.

"కాదు ప్రదా.... కానీ.... నేను నీ దాన్నయి, నీ కేమీ చెయ్యలేనప్పుడు, నా సాంగత్యం నీకు ఎండమావిలాంటిది కాదూ? నీళ్ళలా అగుపించినా దప్పిక తీర్చదుగా."

"నీతీ! నీ మనస్సులోని చల్లదనం నా దప్పికే తీరుస్తుంది. నీ మాటలలోని కమ్మదనం, నాకు కొండంత బలాన్నిస్తుంది.

"నీ ఉత్తరాలు నాకు తోడుగా నీవులేని కొరత తీరుస్తాయి. సునీతీ! వారానికో ఉత్తరం రాస్తావుకదూ!" అతని గొంతులోని జీర, సునీతిని కదిలించి వేసింది.

"ప్రదా! ఇది ఎన్ని జన్మలబంధమో, ఈ జన్మలోనూ పరిస్థితులకు దూరమైన మనని, దగ్గరకి చేర్చింది. కానీ, సమాంతర రేఖల్లా, మనంమాత్రం వేరువేరుగా మిగిలిపోయాం" కన్నీళ్లు తుడుచుకుంటూ అంది సునీతి.

"సునీతీ! నీ కభ్యంతరం లేకపోతే మనం ఇప్పుడు పెళ్ళిచేసుకోవొచ్చుగా! అభ్యంతరం చెప్పిన అమ్మా నాన్నా పోయారు. రవీ, మధూ పిల్లల తండ్రులయ్యారు. మన కెందుకీ శిక్ష!"

"ప్రదా! ఇంకా గోవిందం మామయ్యా, అత్తయ్యా వున్నారుగా! పైగా, మాట తప్పినదాన్నవుతానేమో" ఆలోచనగా అంది సునీతి.

ప్రహ్లాద్ పకపకా నవ్వాడు. "ఏ మాట ఎవరికి జ్ఞాపకముంది నీతీ! నీ మాటే జ్ఞాపకం వుంచుకున్నారు. ఈనాడు, నీ సంపాదనంతా వాళ్ళు తినిపోతున్నారు అందుకే కిక్కురుమనడంలేదు. అదీ లేకపోతే, ఏనాడో నీ ధర్మానికి సున్నాది లేపేవారు" అన్నాడు.

"ఛ! మీరు మరీ అన్యాయం! అదేం కాదులెండి." చిరుకోపం ప్రదర్శించింది సునీతి.

"సునీతీ! నువ్వు రష్యా వెళ్ళడం, మానుకోకూడదూ?" అన్నాడు సీరియస్‌గా ప్రహ్లాద్.

"ఏమి? ఎందుకనీ?" ఆశ్చర్యంగా అడిగింది సునీతి.

"నీతీ! నాకేదో భయంగా వుంది, నువ్వెళ్ళిపోతానంటూంటే!"

సునీతి పకపకా నవ్వింది. "నేనేం చిన్నపిల్లనా ప్రదా!" అంటూ మరి కాస్సేపటిలో ఆమె మొహంలోని నవ్వు మాయమయింది ప్రహ్లాదకేసి చూసింది

"ప్రదా! నువ్వు నన్ను మర్చిపోయి పెళ్ళిచేసుకోకూడదూ? ఎందుకు నీ జీవితాన్ని పాడుచేసుకుంటావు?"

ప్రహ్లాద్ తలెత్తి సునీతి కళ్ళలోకి తీక్షణంగా చూశాడు.

"నీతీ! నువ్వీమాట ఎలా అనగలిగావు? మనసా వాచా నువ్వు తప్ప, నాకే స్త్రీ రూపం గుర్తుండదు. మనకి పెళ్ళి జరగకపోయినా, ఒకరి శ్రేయస్సును కోరి ఇంకొకరం బ్రతుకుతున్నాం. ఈ జీవితానికి పెళ్ళంటూ జరిగితే, అదొక్క నీతోనే! కలలో కూడా మరో స్త్రీని నా భార్యగా ఊహించుకోలేను." నీతిచేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు.

నీతికళ్ళు నీటికుండలయ్యాయి. ఆవేదనతో, ప్రదమీద అభిమానంతో గుండె బరువెక్కింది; ప్రదలాంటి వ్యక్తిని భర్తగా పొందేభాగ్యానికి నోచుకోకపోయినా, కనీసం, అతనితో కలిసిన స్నేహబంధానికి, మనసులోనే భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకుంది. మరో జన్మంటూ వుంటే, తప్పకుండా ప్రదకి భార్యలా పుట్టాలని కోరుకుంది.

ఇరువురి గుండెల్లోనూ ఏదో అవ్యక్తమయిన బాధ! ఇరువురి మనస్సుల్లోనూ ఏదో వ్యధ, ఇరువురి కళ్ళలోనూ ఏవేవో కోరికలు!

ఏవీ నెరవేరక, మూగగా ఒకరినొకరు చూసుకుంటూ కాలం గడుపుతున్నారు ఇద్దరూ

సునీతని ఫ్లైట్ ఎక్కించి, కాకినాడ వెళ్ళిపోయాడు ప్రహ్లాద్। ఆ రోజల్లా, వారిద్దరి గురించి, కధలు కధలుగా చెప్పు కుని నవ్వుకున్నారు జయా, మధూ, గోవిందం, అందరూనూ।

* * *

కాలం గమనంలో రెండు వసంతాలూ, ఇట్టే గడిచిపోయాయి. క్షేమంగా తిరి గొచ్చింది సునీత।

సునీత వచ్చేసరికి తమ్ముడు మధూ ఊర్లో లేడు. తీరిక కలగలేదనీ, జయ కూడా ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళలేదు.

గాయపడ్డ మనస్సుతో, తనవాళ్ళె వరూ రాలేదని, కాళ్ళీడ్చుకుంటూ వొస్తున్న సునీతకి, ప్రహ్లాద్ ఎదు రయ్యాడు. దారిమధ్యలో, కారు టైరు పంక్చరవడంవల్ల, రావడం ఆలస్యమైం దన్నాడు.

ప్రహ్లాద్‌ని చూడగానే క్షణంలో సునీత బాధ మాయమయింది. జీవితంలో తనకోసం ఎదురుచూసేవారొక్కరయినా ఉన్నారన్న విషయం, తనకెంతో తృప్తి నిచ్చింది। కబుర్లు చెప్పుకుంటూ ఇల్లు చేరుకున్నారు.

సునీత ప్రహ్లాద్‌తో రావడం, జయ భరించలేకపోయింది। కనీసం అతన్ని పలకరించకపోగా, నిర్లక్ష్యంగా చూసింది. సునీత మనస్సు చివుక్కుమంది. తనే లోపలికి ఆహ్వానించింది.

తన గదిలోకి దారితీసిన సునీత, తన గదిలో ఏవేవో ఇతర వస్తువులుండడం చూసి ఆశ్చర్యపోయింది

"జయా! ఈ సామాన్లన్నీ ఎవరివి? నా అల్మారా, నా మంచం, నా టేబిలూ అవ్వీ ఏవీ?" అడిగింది సునీత.

"ఏ వస్తువులు, నువ్వు లేవు కదా అవి, అవతల అవుటుహావుస్‌లో పెట్టించి, ఈ గదిని, ఇద్దరు కాలేజ్ స్టూడెంట్స్, 'బాచ్‌లర్స్'కి అద్దెకిచ్చాం. వాళ్ళు హోటల్‌లో తిని కాలేజీకెళ్లొచ్చి, ఊరికే ఇక్కడ పడుకుంటారు. అనవసరంగా ఈ గది ఖాళీగా ఎందుకుంచాల్లని, మీ తమ్ముడే ఈ పని చేశారు. గుక్క తిప్పు కోకుండా, పాఠం అప్పజెప్పినట్లు చెప్పింది జయ.

సునీత మనస్సు చివుక్కుమంది "పోనీ తను లేనప్పుడు అద్దెకిచ్చినా, తనొస్తున్నానని తెలిసినప్పుడయినా ఖాళీ చెయ్యమనొచ్చుకదా!" అనుకుంది, కానీ అమాటే పైకి అనలేకపోయింది సామా నంతా ఒక మూలగాపెట్టి, జయ అందిం చిన కాఫీ కప్పునందుకుని, "జయా! మరొకప్పు ప్రహ్లాదుకి కూడా ఇవ్వు" అంది. అయిష్టంగానే వెళ్ళి మరొకప్పు కాఫీ తీసుకునొచ్చి ప్రహ్లాద్ కిచ్చింది

కాఫీతాగాక, సునీత తను తెచ్చిని సూట్‌కేస్‌లు తెరిచింది. అందులోంచి, ఒక చక్కని బ్లూ టీషర్టు, ఉలెన్ పాంటు పీసూ, టూ ఇన్‌వన్ చక్కటి టేప్‌రికా

ర్థరూ తీసి ప్రహ్లాద్ కిచ్చింది. జయ అవోలా మొహంపెట్టింది. అటువంటిదే తీసి, "ఇవి మధూకి," కొన్ని డ్రెస్ తీసి 'పిల్లల'కనీ, కొన్ని చీరలు, 'జయ కోసం,' తను తెచ్చినవన్నీ చూపించి, జయకిచ్చింది.

మరికాస్సేపు కూర్చుని, ప్రహ్లాద్ సాయంత్రం కలుస్తానని హోటల్ కెళ్ళి పోయాడు.

"ఫోంచేసి వెళ్ళమని చెప్పాలనిపించినా, జయ పిలవనందువల్ల, సునీతి చెప్పలేక పోయింది.

హోటల్ సరోవర్, రూం. నెంబరు 109 అని చెప్పి ప్రహ్లాద్ వెళ్ళిపోయాడు.

"అతన్నిక్కడే ఫోంచెయ్యమంటే పోయేది" అంది నెమ్మదిగా సునీతి.

"మ తమ్ముడొప్పుకోడు" ఖచ్చితంగా అంది జయ.

సునీతికి ఆత్మాభిమానం దెబ్బతిన్న ట్లనిపించింది. అంటే ఆ ఇంట్లో, తన తమ్ముడికీ, మరదలుకీ ఇష్టంలేనిది, వాళ్ల అనుమతిలేకుండా, తను ఏ పనీ చెయ్య కూడదన్నమాట. చివరికి, ఒక మనిషిని భోజనానికి పిలిచే హక్కు కూడా తనకి లేదన్నమాట!

"వాడేమిటి ఒప్పుకునేది? నా కన్న చిన్నవాడు, వాడి పర్మిషన్ కావాలా నాకు" అంది మామూలుగానే సునీతి.

ఆ మాటలకి జయ శివమెత్తినదానిలా అరిచింది. "చిన్నవాళయితేనేం? బుద్ధిలో పెద్దవారే!" అంటూ.

ఇద్దరిమధ్యా మాటామాటా పెరిగింది. అనుకోకుండా, మధ్యాహ్నానికే, కేంపు నుండి తిరిగొచ్చిన మధూ, ఈ గొడ వంతా చూసి విసుక్కున్నాడు. "అక్కా! దానికి బుద్ధిలేకపోతే, నువ్వు నోరు మూసుకోకూడదూ" అనే టప్పటికి సునీతికి కళ్ళుతిరిగినంత పనయింది. జయముందు మధూ అట్లా మాట్లాడడం అవమాన మనిపించింది. తనకి తెలీ కుండానే కళ్ళంట నీళ్ళు జలజలా రాలాయి.

ఏదో అందరూ, ఎంగిలిపడి లేచారు. మధూ, జయా,పిల్లలూ, ఎవరి ధోరణిలో వాళ్ళున్నారు కానీ, అభిమానంగా సునీతిని పలకరించేవాళ్ళే కరువయ్యారు.

ఏడ్చిఏడ్చి అలసిపోయిన సునీతి, ఏదో నిర్ణయానికొచ్చినదానిలా, లేచి మొహం కడుక్కుని బట్టలు మార్చుకుని తయారైంది.

"నేనలా బయటికెళ్ళొస్తాను" అంది ముక్తసరిగా.

"ఎక్కడికి? ప్రహ్లాద్ దగ్గరికేనా?" కటువుగావుంది మధూ కంఠం.

"అవును." నిశ్చలంగా అంది సునీతి.

"ఎందుకు?"

ఒక్క నిమిషం సునీతికి ఏం చెప్పాలో తెలీలేదు.

"మనశ్శాంతికోసం" అంది.

"అదిక్కడ లేదా?"

"లేదు గనకనే" అంటూ సమాధానం కోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయింది సునీత।

జరిగిందంతా విని ఎంతో బాధపడ్డాడు ప్రహ్లాద్.

"నీతి। ఇప్పటికయినా మించిపోయింది లేదు. మనం పెళ్ళిచేసుకుందాం। విన్ను వాదాన్ని చేసుకుని ఎవ్వరూ వ్రేలెత్తకుండా చేస్తాను" అన్నాడు ప్రహ్లాద్.

"ప్రహ్లాదా। ఈ వయస్సులో మనం పెళ్ళిచేసుకుంటే నవ్వుతారేమో!" అమాయకంగా అంది సునీత.

ప్రహ్లాద్ పకపకా నవ్వాడు. "నీతి। వయస్సు పెరుగుతూంటేనే, తోడు అవసరం. యౌవనంలో తోడుకంటే ఉద్రేకం ఎక్కువ. అయినా, నీకు నలభై దాటినా, పెళ్ళిచేసుకోవడానికి. నేను సిద్ధపడ్డాక ఎవరో నవ్వితే మనకేం।"

సునీత మనస్సు ఆనందంతో తేలిపోయింది। ప్రహ్లాద్ దేముడిలా అనిపించాడు. అతని చెంత శేషజీవితం గడపడం తన్న వేరే పరమార్థం లేదనుకుంది. పైగా తను ఎవరికోసం త్యాగం చెయ్యాలి?' అనిపించింది. వెంటనే "సరే" నంది.

ప్రహ్లాద్ ఉబ్బి తబ్బిబ్బయ్యాడు। ఆ నిమిషంలో రెండు మనసులూ ఏకమై ఆనందంలో తేలిపోయాయి.

• • •

రిజిష్ట్రార్ · ఆఫీసులో · ప్రహ్లాద్, సునీత నోటీసిచ్చారని మధూ ద్వారా తెలుసుకున్న రవి సునీతకి లాయర్ నోటీసు పంపించాడు.

"తనకి సునీతకి విడాకులు జరగలేదు కాబట్టి, లా ప్రకారం ఆమె ఇంకా తనకు భార్యేననీ, అప్పుడు ఆమెకి మతిస్థిమితం లేకపోవడం వల్ల. తను మరో పెళ్ళి చేసుకోవలసి వచ్చిందనీ, ఇప్పుడు, బాగు పడింది కనుక, భార్యగా తాను అంగీకరించడానికి సిద్ధమేననీ" అందులో వుంది.

అది చదివిన సునీత కుప్పలా కూలిపోయింది. తల్లిదండ్రుల మాటప్రకారం. తప్పుకెక్కడం ఇష్టంలేక, తను కోర్టుకెళ్ళి విడాకు లడగలేదు. పైగా, రవి మళ్ళీ పెళ్ళిచేసుకున్నాక, తన పెళ్ళికి వారు పెట్టిన నగలూ, బట్టలూ కూడా తిరిగి పంపించేసింది.

ఇన్నాళ్ళూ లేని అభ్యంతరం ఇప్పుడు తను ప్రహ్లాద్‌ని చేసుకుంటున్నానంటే పంపిన నోటీసుకి అర్థమేమిటో బోధపడలేదు కాస్సేపు. తరవాత తెలిసింది ఇది మధూ, రవీ అందరూ కలిసి పన్నిన కుట్ర అని। తనని భయపెట్టి తన దగ్గర డబ్బు లాగడానికి పన్నిన కుట్ర అని। వెంటనే బుర్ర కేవలం ఒక ఆడదానిలా కాక, ఒక లాయరులా ఆలోచించడం మొదలుపెట్టింది. కొంటరు నోటీసు పంపించింది, అసలు తనకు మతిస్థిమితం



లేదని, ఎలా, ఎప్పుడు ఎవరు ఋజువు చేశారనీ. కోర్టుద్వారా ఆ విషయాలు ఋజువై, విడాకులు లేనిదే, తాను ఎలా పెళ్ళిచేసుకుని ముగ్గురు పిల్లలకి తండ్రి కూడా అయ్యాడనీ"....వగైరా.. వగైరా పాయింట్లతో.

తనకి తెలుసు న్యాయం తనవైపే వుందనీ, ధర్మం గెలుస్తుందనీ! తేలికపడ్డ మనసుతో, వెళ్ళి అద్దం చూసుకుంది. అక్కడక్కడా వున్న తెల్లవెంట్రుకలు, తనని పరిహసిస్తున్నట్టనిపించింది! కంటి కింద ఏర్పడ్డ చారలు, తనకేసి చూసి చిరునవ్వు నవ్వుతూన్నట్టనిపించింది!

మనసుమాత్రం. పురివిప్పిన మయూరిలా, నాట్యంచేసింది, భవిష్యత్ దర్శనం చేసుకుంటూ! అంతలోనే 'భయం', హృదయాన్ని కలవరపెట్టింది. 'సమాజం హర్షిస్తుందా? నేను చేసింది న్యాయమని నమ్ముతుందా? స్త్రీకో న్యాయం, పురుషుడికో న్యాయం విధించిన ఈ సంఘం, కోర్టు తీర్పుచెప్పి న్యాయం చేకూర్చినా, దాన్ని గౌరవిస్తుందా?

అసలు ఏది న్యాయం? ఏది ధర్మం?

ఈ చదరంగంలో తప్పెవరిది? ఈ ప్రశ్నలకు సమాధానం దొరకక తల పట్టుకుని కూర్చుంది సునీతి! కాదు—న్యాయవాది సునీతిదేవి!



# నాకు నచ్చిన నా కథ



చలసాని ప్రసాదరావు

నేను కథలేవీ కాలక్షేపానికి రాయలేదు. ప్రతి కథలోనూ ఏదో ఒక విషయం, నలుగురూ ఆలోచించవలసి ఉన్న విషయం — వారి దృష్టిలోకి తేవాలనే లక్ష్యంతోనే రాస్తూవచ్చాను. కథలు రాసినా, కబుర్లు రాసినా, వ్యాసం రాసినా తొలి నుండీ నా రచనా లక్ష్యం అదే.

నేను స్వయంగా చిత్రకారుడిని. ఆరేళ్ళు ఫైన్ ఆర్ట్స్ కాలేజీలో చదివి, డిప్లొమా పొంది, పదేళ్ళు చిత్రకారుడిగా ప్రభుత్వోద్యోగం చేసినవాడిని. వందలాది స్థానిక, జాతీయ, అంతర్జాతీయ కళా ప్రదర్శనలను చూసినవాడిని. చిత్ర, శిల్ప కళల్ని గురించి చదవగలిగినంత చదివి, రాయగలిగినంత రాసినవాడిని. ఎమర్జన్సీ మీద పెయింటింగులు వేసి అమెరికాలో కూడా ప్రదర్శింపజేసినవాడిని. "నభూతో......"గా నలుగురూ మెచ్చుకున్న ఏకైక చిత్రకళా "సంచిక" అనదగిన "కళ" ఆరు సంపుటాలు ఎడిట్ చేసి, ప్రచురింపచేసినవాడిని.

కనుక — ఈ చిత్ర శిల్పకళా రంగాల్ని గురించి సాధికారంగా మాట్లాడగల అర్హత నాకున్నదని ఇపుడుగాదు, పన్నెండేళ్ళ క్రితమే అనుకున్నాను. అలా అనుకుని ఈనాటి ఆధునిక కళగా చలామణీ అవుతున్న చిత్రకళలోని కొన్ని వంచనా ధోరణులను.... వాటిని ప్రోత్సహిస్తున్న కళోద్ధారకులనబడే పెద్దలనూ

....ఈ కుహనా కళ గురించి ఏమీ తెలియకపోయినా, తెలిసినట్లు నటించటమే "కళాభిజ్ఞత" అనుకుని ఆత్మవంచన చేసుకునే "కళాభిమాను"లనూ.........

ఈ కథద్వారా బట్టబయలు చేయడం, ఆ విధంగా పాఠకులకు నిజం చెప్పటం నా లక్ష్యం.

అది విజయవంతంగా చేశానని నేను అనుకుంటున్నాను. ఈ కథ రచనా కాలం 1978। మరో విశేషం....ఇలాంటి సంఘటనలు కొన్ని నిజంగా జరిగాయి।

# మాస్టర్ పీసు....

"మన సుబ్రావ్‌గాడు ఈ కళాఖండంద్వారా మన మట్టి బుర్రల్లోకి ఎక్కించ దలచిన మహత్తర సందేశం ఏమిటంటావు?" రావు నుద్దేశించి అడిగాడు దాసు.

రావు బుర్ర గోక్కోలేదు, కళ్ళజోడు సవరించలేదు, ఎదురుగా ఉన్న పెయింటింగును గానీ, పై కప్పునుగానీ పరిశీలించటం లాంటి వేవీ చేయలేదు. అతని చూపులు అల్లంత దూరాన్న ఓ శిల్పం ముందున్న ఇద్దరమ్మాయిల మీద నున్నాయి. ఆ చూపులు నిశితంగా వారి సౌందర్యాన్ని ఎక్స్‌రే తీస్తున్నట్లున్నాయి.

ఆర్ట్ గ్యాలరీలో ఉన్న కొద్దీ ట్యూబ్‌లైట్లు వెలిగిపోతున్నాయి। వాటి క్రింద ఓ పలభైదాకా రంగురంగుల పెయింటింగులు మెరిసిపోతున్నాయి।

ఆ నలభైలోనూ మూడు సుబ్బారావువి. అతను ఎంతో కొంత పేరున్న చిత్రకారుడే। ఆ మూడింట్లోనూ ఒకదానికి వెయ్యి రూపాయల 'అవార్డ్' వచ్చింది. అ పెయింటింగ్ గురించే అడిగాడు దాసు. ఎగ్జిబిషన్లో ఆ అవార్డ్ రావటం అంటే "ఈ దేశంలోని ఈ సంవత్సరపు ఆర్టులోకెల్లా సర్వోత్తమ కళా ఖండం ఇది!" అని చాటి చెప్పటమే. ఓ మంత్రిగారు "తృతీయ పంచవర్ష ప్రణాళిక — కళాభి వృద్ధి — అది ఎటుల జరగగలదు" అనే అంశంపై అనర్గళంగా ఉపన్యసించి స్వహస్తాలతో సుబ్బారావుకు వెయ్యి రూపాయల చెక్కు అందించి, బరువైన దండొకటి వేసి, షేక్‌హాండిచ్చి ఇంకా రెండు గంటలన్నా కాలేదు.

ఆ చిత్రానుద్దేశించే అడిగాడు దాసు. కానీ, రావు పలకలేదు. కనీసం ఇటు చూడనన్నా లేదు.

"మన వాడికి ఈ పెయింటింగుల కన్నా ఆ ఆడపిల్లలే కళాత్మకంగా ఉన్నట్లున్నారు!" అన్నాడు మూర్తి.

"మంత్రిగారు తెగ పొడిగిన వెయ్యి రూపాయల కళాఖండం కళ్ళెదుట ఉండగా రావుగారు ఇలా ఆ ముసలమ్మాయిల్ని చూస్తూ గుటకలు మింగుతూండటం కళారంగానికే ఇన్సల్ట్!" అన్నాడు రాజా.

రావు ఉడుక్కోలేదు. ఎదురుగా సజీవ శిల్పాలు కదలాడుతూండగా చూసి సంతోషించలేని ఈ కళాభిమానం తగలెయ్య! ఏముందోయ్, ఈ సుబ్రావ్‌గాడి పెయింటింగుల్లో?" అన్నాడు నిర్లక్ష్యంగా.

"అక్షర లక్షలు చేసే మాట సెలవిస్తివిరా రావూ! నువ్వో ఎగ్జిబిషన్ పెట్టి అందులో ఇలాంటి అమ్మాయిల్ని కళాత్మకంగా వేలాడదీయరాదురా! చూసి తరిద్దుము గదా!" అన్నాడు దాసు.

"నా సంగతికేం గానీ, పోనీ నువ్వు చెప్పరాదురా మూర్తీ! ఈ కళాఖండం లోతుపాతులు! రోజూ సాయంత్రం సుబ్రావ్‌గాడితో కలిసి వన్ బై టూ కాఫీ త్రాగి ఈరానీ హోటల్లో ఆర్టును గురించి ఉపన్యాసా లిస్తుంటావుగదా!" అన్నాడు రావు.

సుబ్బారావు ఈ నలుగురికీ కూడా పరిచయస్తుడే! మూర్తికి మాత్రం మంచి మిత్రుడు!

"ఏమైనా సుబ్రావ్‌లో ఈ మధ్య కొంత ప్రోగ్రెస్ కనిపిస్తోందిలే." అన్నాడు మూర్తి!

"అవునవును! ఈ మధ్య వాడు గడ్డం, మీసాల్లో చాలా అభివృద్ధి కనిపిస్తోంది సుమా! ఈ మధ్య దూరాన్నుంచి చూసి పోల్చుకోలేకనే పోయాను!" అన్నాడు దాసు

~~"వాడి వేషంలాగే వాడి కళాఖండాలూ గుర్తుపట్టటం~~ కష్టమయిపోతుందిలే! ఇంతకీ ఈ మాస్టర్ పీస్ మనకిచ్చే మహత్తర సందేశం ఏమిటంటారూ!" ప్రశ్నించేడు రావు.

ఎదురుగా సుబ్బారావు పెయింటింగ్ ట్యూబ్‌లైట్ల పాల వెలుగులో కాంతులు విరజిమ్ముతోన్నట్లుంది. ఆ నలుగుర్లోనూ మూర్తి ఇక్కడే కాస్త ఆర్టును గురించి ధాటీగా మాట్లాడగలవాడు.

"ఏముంటుంది! మీరు ఇలాగే రంగులు అర్చుపెట్టి కాన్వాసులు ఖరాబుచేసి అవార్డులూ, వెయ్యేసి రూపాయలూ సంపాదించండి! అని కావచ్చు!" అన్నాడు రాజా.




"వెయ్యికాదు! రెండువేలు అను! ఇందాక మ్యూజియం వాళ్ళు వచ్చి కొనేందుకు సెలక్టుచేసిన వాటిలో ఈ పెయింటింగ్ కూడా ఉంది దీని ధర వెయ్యి రూపాయలు!" అన్నాడు దాసు.

"వారేవా! ఈ రాత్రికి సుబ్రావ్‌గారిచేత వాట్ బుడ్డీ ఖాళీచేయించకుండా కదలగూడదు!" అన్నాడు మూర్తి.

"నాన్సెన్స్ మా స్కూల్ పిల్లకాయలు కళ్ళుమూసుకొని రుద్దగలరు ఈ మాత్రం కళాఖండాలు!" అన్నాడు రావు.

"తగ్గరా, నాయనా! పిల్లగాళ్ళు కళ్ళు మూసుకుని వెయ్యగల కళాఖండాన్ని ఆర్టు కాలేజీల్లో అయిదారేళ్ళు తలక్రిందులుగా తపస్సు చేసిన కళాకారులు వేయగలగటం అంత తేలికేం కాదు!" అన్నాడు మూర్తి.

"అసలు ఏ ఆర్టిస్టయినా చిత్రాలు ఎందుకు వేస్తాడంటారూ?" ప్రశ్నించాడు దాసు.

"తిన్నది అరక్క!" అన్నాడు రావు.

"ఇంకెందుకు! ఆత్మ సంతృప్తికే!" అన్నాడు రాజు.

"ఈ ఎగ్జిబిషన్లతో, అవార్డుల్తో మన ఆర్టిస్టుల ఆత్మలు శాంతించి నిద్ర పోతున్నాయనా?"

"ఏమైనాగానీ, అసలు ఆత్మశాంతికని గీసేవాడూ, రాసేవాడూ అదేదో వాడి ఆత్మలోనే ఏడవక ఇలా ఇంత డబ్బు తగలేసి రంగులూ, కాన్వాసులూ, ఫ్రేములు పాడుచెయ్యటం...."

"ఆ తర్వాత ఏగ్జిబిషన్లకు పంపి ప్రైజుకోసం పైరవీలు చెయ్యటం, జడ్జీలకు ట్రైర్లు కొడుతూ తిరగటం...."

"రాకపోతే ఏడవటం... ఎందుకూ... ?" రెట్టించేడు రావు.

"మరి ఎగ్జిబిషన్లలో కాకుంటే మీరంతా చూసేదెలాగోయ్?" ప్రశ్నించేడు మూర్తి.

"చూసి?...."

"తరించటం....లేకుంటే అప్రోప్రి కంపెనీవాడి లాభాలు పెంచటం!"

మరి అంత తేలిగ్గా నోరుజారేయకండోయ్! కళల్ని ఆస్వాదించాలంటే కొంతన్నా అనుభవం కావాలి! కళాదృష్టి అలవరచుకోవాలి!" అన్నాడు మూర్తి.

"అవును సుమా! రోజూ మా బామ్మ తెల్లారే చన్నీళ్ళ స్నానంచేసి చాలా సేపు ఏదో గొణుగుతూ కూర్చుంటుంది. ఎంతవిన్నా నాకది అర్థంగాక మా అమ్మ నడిగితే 'ఆవిడ శివస్తోత్రం చదువుతుందిరా' అంది. నిజమే అనుభవం ఉంటేగాని ఏదీ అర్థం అయిచావదు. ఆ దేవుడికికూడా ఈ అనుభవం ఉన్నట్టులేదు. మా బామ్మకు ఇంతవరకూ ప్రత్యక్షం కానే లేదు!" అన్నాడు రావు.

"అయితే ఈ ప్రైజులిచ్చేవాళ్ళూ, వాటిని ఇప్పించే జడ్జీలూ, వాటిని పంచి పెట్టిన మంత్రులూ వీళ్ళంతా అప్రోప్రి కంపెనీ ఏజంట్లంటావేమిట్రా!"

"అబ్బెబ్బే! ఏదో ఓ చిన్న ఎడ్వొకేటు గాడివి! అంత పచ్చి నిజాలు నేనెలా ప్రవచించగలను!"

"అంత తేలిగ్గా కొట్టెయ్యకండోయ్! ఈసారి వచ్చిన జడ్జీలు సామాన్యులేం గారు! తల నెరిసిన, పండ్లూడిన ఆర్ట్ క్రిటిక్కులు! కలకత్తా, ఢిల్లీ, బొంబే ల్నుంచి తలా ఒకరూ వచ్చారు!"

"రైల్లోకూడా కాదు! విమానాల్లో!" అందించాను రాజు.

"అయితే విమానాల్లో తిరిగేవాళ్ళు మహా మేధావులన్నమాట!"

"అక్షరాలా! ఈ మధ్య చాలా విమానాలు దార్లోనే చతికిలపడుతున్నవిజే వారి విజ్ఞానాన్ని మొయ్యలేకనే!"

"మన రావుగాడికి ఈ అర్థంచే గిట్టదని తెలిసి కూడా వాడితో పోట్లా టెందుకురా!" వారించాడు దాసు.

"మీ కున్నంత కళాహృదయం నాకు లేదుగానీ నన్ను వదిలేసి మీరంతా ఈ కళాఖండాల్ని మేసి వంసంస్కృతిని ఉద్ధరించండిరా నాయనలారా!" అని తప్పు కున్నాడు రావు.

మూర్తి కాలర్ సర్దుకుని కళ్ళతోడు సవరించుకున్నాడు. "మనకు అర్థం కానంత మాత్రాన ఈ అద్భుతకళా చెత్తక్రింద జమకట్టటం...." అంటూ ప్రారంభించాడు.

"కాస్త చదువుకున్న అజ్ఞానులం! పైగా సుబ్రావ్‌గాడి దోస్తులం! మనకే అర్థంగాకుంటే మరింకెవరికోసంరా బాబూ ఈ బొమ్మలు?" అడ్డువచ్చాడు దాసు.

"ఏం ఎందుకు అర్థంగావు? సుబ్రావ్ ఈ పెయింటింగ్స్‌లో కొన్ని సింబల్స్ వాడాడు. అవేమిటో ముందు తెలుసుకుంటే సరి!" అన్నాడు మూర్తి.

ఎవరూ మాట్లాడలేదు. ఉత్సాహంతో విజృంభించాడు మూర్తి.

"మీరింకా గుర్తించటంలేదుగానీ, సుబ్రావ్‌గాడు ఈ మధ్య చాలా ఎదిగాడు! మొన్న ఆదివారం సత్యజిత్‌రాయ్ సిన్మాకు కూడా వచ్చేడు!"

"అలాగా! మొన్న మా బొమ్మ చేతుల్లో సినిమాపాటల పుస్తకం చూశాను!" అందించాడు రావు.

"నువ్వుండరా నాయనా!" విసుక్కున్నాడు మూర్తి! "ఈ మధ్య సుబ్రావ్ చాలా చదివేడు! వాంగో జీవితం చదివీ, అతని చిత్రాలు ఆల్బంలో చూసీ మన వాడో వారంరోజులపాటు ఈ లోకంలోనే లేడు!"

"కొంపదీసి వాంగోలాగే చెవి కోసుకుని కట్లుకట్టుకుని ఆస్పత్రిలో పడుకోలేదు కదా?"

"నాన్సెన్స్ మాట్లాడకు? అ మాటకొస్తే చెవిగానీ, ముక్కుగానీ కోసుకో గల దమ్ములు ఒక్క కళాకారులకే ఉంటాయి!" గద్దించేడు దాసు.

"సరే! మరి సుబ్రావ్‌గాడు చెవి కోసుకోకుండా ఏం చేసినట్టు?" ఉత్సాహం చూపించేడు రావు.

"వేస్తే వీళ్ళందర్నీ మించిపోవాలి! లేదా తిని నిద్రపోవాలి! అని తేల్చుకున్నాట్ట!" వివరించేడు మూర్తి

"శభాష్! మరి తిని నిద్రపోక ఇవన్నీ వేసి మన దుంపలేందుకు రాంపుతున్నట్టు?"

"ఎందుకా; వాడెంతగా ఎదిగాడో నీకెలా తెలియటం? వాడి ఆలోచనలే మారిపోయాయి! విప్లవభావాలు ఎక్కువయ్యాయి!"

ఎదురుగా ఉన్న సుబ్రావ్ పెయింటింగ్ అకస్మాత్తుగా ఓ బాంబుగా మారి పేలినంతగా ఉలిక్కిపడ్డారు ఆ ముగ్గురూ? నమ్మలేనట్లుగా మూర్తివంక సంభ్రమంతో చూసేరు.

మూర్తి మందహాసం చేశాడు. ఈ పెయింటింగులో రంగుల ముద్దలు తప్ప మరేం లేవనేగదా మీ గోల! నిజమే! కానీ, అంతా ఆ రంగుల్లోనే ఉంది. కాస్త పరికించి చూడండి. పై భాగంలో ముద్దముద్దగా చిక్కగా ఉన్న ఆ ఎర్ర రంగు ప్రగతికి! విప్లవ భావాలకు సంకేతం, తెలుసుగా....?"

"ఆ....ఆ.... అవును?" నసిగేడు దాసు.

"మధ్యలో పసుపురంగులో కలగాపులగంగా, పెంటకుప్పలా కనిపిస్తున్నదే.... అది మనచుట్టూ ఉన్న ఈ సమాజానికి సింబల్."

"ని. . న్ని....న్నిజమే?...."

"కాకేం! సుబ్రావ్‌గాడేమన్నా నీలాటి ఎడ్డివాగాడనుకున్నావా! వాడీమధ్య చాలా సీరియస్‌గా, తెగింపుగా ఆలోచిస్తున్నాడులే!"

"తర్వాత. ..?"

"ఇహ ఈ చిత్రం క్రిందిభాగంలో ఉబ్బెత్తుగా కనపడే నల్లరంగు ఓ బలిసిన పందికి సింబల్!"

"పందా?.... అంటే....?"

"పంది దేనికి సింబల్ అయిందీ కూడా తెలీదూ." గద్దించేడు మూర్తి.

"పంది పరిశుభ్రతకు చిహ్నం. అవే లేకుంటే మా బెజవాడ ఈ మాత్రం శుభ్రంగావన్నా ఉండేది గాదు!" అందించాడు రాజు.

"నీ శోకులకేంగానీ, విను," ఉపక్రమించేడు మూర్తి. "స్వార్థంకోసం సమాజాన్ని ఛండాలంగా రూపొందనిచ్చి అందుమూలంగా లాభపడాలని చూసే దుష్టవర్గాలకు సింబల్ ఈ పంది!"

"అవునవును!" అడ్డంవచ్చాడు దాసు.

"మా ఆఫీసులో ఓ లావాటి ఆఫీసరుగాడున్నాడు! ఎవరికీ దక్కకుండా మామూళ్ళన్నీ వాడే మింగుతాడు. అందుకని అందరూ కలసి వాడికి 'పీమపంది' అని బిరుదిచ్చేరు."

"అవలా ఉండనీ!" విసుక్కున్నాడు మూర్తి. ఆ నల్లపంది ఈ పసుపు సమాజాన్ని లద్దుండలా మింగేయాలని చూస్తోంది. ఈ సందర్భంలో ఆ నలుపుకూ ఈ ఎరుపుకూ జరిగే సంఘర్షణను ప్రదర్శించటమే ఈ చిత్రంలో సుబ్రావ్ చేసింది!"

రాజు, దాసు తృప్తిగా తల లూపేరు.




"నువ్వన్నట్లు ఆళల్ని అర్థంజేసుకోవాలంటే కాస్త అనుభవం ఉండాల్సిందే!" అన్నాడు రాజు.

"సరేగానీ. ఇదంతా సుబ్రావ్‌గాడే చెప్పాడా? లేక నీకే తట్టిందా?" అనడిగేడు దాసు.

కళ్ళతోడు సవరించుకున్నాడు మూర్తి. "ఈ మాత్రానికి వాడిని అడగాలా! వాడి పెయింటింగ్‌కు పెట్టిన పేరు చూస్తే తెలీటంలా!"

"మాకు తట్టనేలేదు సుమా! 'సంఘర్షణ' అంటే ఇదన్నమాట! మొత్తం మీద ఈ పెయింటింగ్‌తో బాగానే సంఘర్షించావులే!"

అందరూ రాజీ కుదిరినట్టుగా, బరువు తగ్గినట్టుగా కదిలేరు.

ఆ చర్చలోంచి బయటపడిన రావుకు ఇందాకటి సజీవ కళాఖండాలెక్కడా కనుపించలేదు.

వాళ్ల కళాస్వాదనతో కడుపునింపుకునో, కడుపునొప్పితోనో ఎప్పుడో బయటకు పోయినట్లున్నారు. హాల్లో జనం దాదాపు లేరు.

అటుగా వరండాలోకి చూసిన రావుకు అటే వస్తూన్న సుబ్రావ్ కనుపించేడు.

"నూరేళ్ళాయుష్షు. రావోయ్!" కేకేశాడు మూర్తి.

ముసిముసి నవ్వుల్తో వెయ్యిరూపాయల వాయినం ముట్టిన పెళ్ళికొడుకులా లోపలికొచ్చేడు సుబ్బారావు.

"నీ పెయింటింగ్‌ను వీళ్ళకు అర్థమయ్యేలా చెప్పలేక చచ్చాననుకో. మొత్తంమీద చాలా ఎడిగావోయ్!" అన్నాడు మూర్తి.

"కంగ్రాచ్యులేషన్స్!" అన్నారందరూ ఏకగ్రీవంగా.

"థాంక్స్" అంటూ అందరికీ షేక్‌హ్యాండిచ్చేడు సుబ్బారావు. "ఆ ప్రైజు వచ్చిన పెయింటింగునే మ్యూజియంవాళ్ళు వెయ్యిరూపాయలకు కొనేశారు. ఇంతసేపూ వాళ్ళతోనే మాట్లాడుతున్నాను!" అంటూ తృప్తిగా, గర్వంగా ఆ పెయింటింగుకేసి యథాలాపంగా చూసుకొని ఉలిక్కిపడ్డాడు.

"పదండి కాఫీ త్రాగుదాం! ఎగ్జిబిషన్ మూసేసే టైమయింది!" అంటూ బయటికి దారితీశాడు.

"కాఫీ ఏమిటోయ్ నాన్సెన్స్! రెండువేలు కొట్టేసి కనీసం బీరుబుడ్డీ అన్నా ఇప్పించవషరా!" ఎగిరేడు మూర్తి.

"ఓ! అలాగే!" అంటూ వాళ్ళతో కలిసి బయటికొచ్చి, మళ్ళీ అంతలోనే ఏదో గుర్తొచ్చినవాడిలా "ఇప్పుడే వస్తా!" నంటూ ఆర్టుగ్యాలరీలోకి నడిచాడు సుబ్బారావు.

రిసెప్షన్ దగ్గరున్న ఎగ్జిబిషన్ ఇన్చార్జిని లాక్కొని తన పెయింటింగ్ వద్దకు తీసుకొచ్చాడు సుబ్బారావు.

"కనీసం అవార్డువచ్చిన పెయింటింగులన్నా సరిగా వ్రేలాడదీయవద్దండీ! ఇంకా నయం! ఎవరూ గుర్తించలేదుగానీ, మీ-నా పరువు గంగలో కలిసి ఉండును!" అంటూ ఆ పెయింటింగును తలక్రిందులు చేసి, సరిగా సర్ది చేతులు దులుపుకుంటూ బయటికొచ్చాడు సుబ్బారావు.

ఎరుపు నలుపుల కళాత్మకత, కళాకారుల సింబాలిజంను గురించి వరండాలో తీవ్రంగా చర్చించుకుంటున్న ఆ నలుగుర్నీ తోలుకుని తేలికైన హృదయంతో బరువుగా ముందుకు నడిచాడు సుబ్బారావు.





## గోవిందరాజు సీతాదేవి

# చట్టాన్ని గౌరవించాలని చెప్పి, కానీ...

హైదరాబాద్ పాతనగరంలో కర్ఫ్యూతో బైటముఖం చూడకుండా యిళ్ళలో మగ్గుతూన్న సామాన్య కుటుంబీకులు పాలకి, నీళ్ళకి నిత్యావసర వస్తువులకి కటకటపడుతూ ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని ఒక్కొక్క రోజూ గడుపుతూన్న రోజుల్లో ఒకరోజు తెల్లవారుతూ వుంది. తూర్పునుంచి సూర్యుడు మెల్లగా పైకి వస్తున్నాడు. ఒక్కొక్క ఇల్లు తలుపు కొద్ది కొద్దిగా తెరుచుకుంటూ వుంది. ఈ పాత నగరంలో ఇరుకుగల్లీలో దాదాపు పాతికేళ్ళనుంచీ అద్దెకి వుంటున్న సూర్యకాంతమ్మ యిలాంటి కర్ఫ్యూలను యెన్నింటినో చూసింది. భయపడింది. అయితే అక్కడే వుండక తప్పకపోవటానికి కారణం కేవలం పదిహేను రూపాయలకి రెండు చిన్నచిన్న గదులు దొరకటం. కొత్తనగరంలో యెన్ని మార్పులు వచ్చినా పాత బస్తీలో యే మార్పూ రాకపోవటం అద్దె పెరక్కపోవటంవల్ల అక్కడ వుండక తప్పలేదు.

భర్త మతకల్లోలాల్లో సంబంధంలేకున్నా ఆఫీసునించీ వస్తూ దుండగుల బారినపడి చావుదెబ్బలు తిని ప్రాణాలు వదిలాడు.

తండ్రి పోయేనాటికి సరళకి ఇరవై యేళ్ల. టీకాం పూర్తిచేసి షైపు నేర్చుకుంటూ వుంది సూర్యకాంతమ్మకి సరళ తర్వాత యిద్దరబ్బాయిలు. వాళ్ళు యిప్పుడు కాలేజీ చదువులకి వచ్చారు గానీ తండ్రి పోయే నప్పటికి చిన్నవాళ్ళే. గవర్నమెంట్ కనికరించి సూర్యనారాయణ పోతే ఆయన కూతురు సరళకి ఓ గుమాస్తా వుద్యోగం యిచ్చింది. అప్పటినుంచీ సూర్యకాంతమ్మ కూతురి సంపాదనమీద బ్రతుకుతోంది. తమ్ముళ్ళని యెంత జాగ్రత్తగా చూస్తూన్నా క్రమశిక్షణలో పెంచుతూన్నా ఆ పాత బస్తీల్లో వుండే ఆకతాయి కుర్రాళ్లతో స్నేహం సాగిస్తూనేవున్నారు. యీ స్నేహాలు యెలాంటి వుపద్రవాలకి దారితీస్తాయో అని సరళ లోలోపల భయ పడుతూనే వుంటుంది. యిలా రోజులు దొర్లిస్తూన్న సరళకి వయసు పాతిక దాటింది. అయినా సరళ బాధపడటంలేదు. తమ్ముళ్ళ భవిష్యత్ బాగుంటే చాలన్నదే ఆమె కోరిక.

రెండు రోజులుగా పాతనగరంలో అల్లర్ల కారణంగా కర్ఫ్యూ అమలులో వుంది. ఇందువల్ల ఇంట్లోనే వుండి పోవాల్సిరావడం చాలా చిరాకుగా వుంది సరళకి. ఈ పాత ఇంట్లో గాలీ వెలుతురుకి కరువు. యిక్కడే తన బాల్యం గడిచి పోయింది.

వచ్చీరాని వయసులో యెన్నెన్నో కలలు కన్నది. కాశీమజిలీ కథల్లాంటి కలలు. రాజకుమారుడులాంటి అందగాడైన హీరో గుర్రంమీద కాకుండా పెద్ద కారులో వచ్చి తనకోసం వాకిట్లో నిలబడతాడన్న 'ఆశ' చాలా సంవత్సరాల వరకూ పోలేదు రోడ్డుమీద అందమైన శ్రీమంతుడైన యే యువకుడు కన్పించినా తనవైపు చూస్తాడనీ చూసి తన అందానికి ఆకర్షితుడై చిరునవ్వు నవ్వి కారు తలుపుతెరిచి 'రండి; యెక్కడికి వెళ్లాలి. నేను అపుతాను. ఎక్కండి గారు' అని అన్నట్లే భ్రమపడింది నాలుగైదుసార్లు. ఆ భ్రమలో పిచ్చిదై ఆ కారునీ అందులోని హీరోనీ చూస్తూ పక్కవించి పోతూన్న స్కూటర్‌కింద పడబోయింది. ఒకసారి గీసుకుపోయింది కూడా ఒకసారి రిక్షాకిందపడి దెబ్బలుతగిలి రిక్షావాడి బూతులు విని చీరెకి ఒంటికి అంటిన దుమ్ము దులుపుకుని లేచి కుంటుకుంటూ ఇల్లుచేరింది. వేడినీళ్ళకాపు తల్లి కావ నార్థాలూ యివీ తనకి దక్కింది. అంతే సరళ కలలు కనటం మానేసింది. సరళకి రోజూ వుదయం ఆయిదింటికే మెలుకువ వస్తుంది. కానీ పక్కమీదనుంచి లేవదు. లేస్తే అప్పటినుంచీ చేసేందుకు పని వుండదు. పోనీ కదా అని లేచి వాకిలి ముందున్న కాస్త ఖాళీ స్థలంలో కూర్చుందాం అని వస్తే పక్కవాటాలో కాపురం వుంటూన్న పీలకంఠం వెకిలిగా నవ్వుతూ కన్పించి పలకరిస్తాడు.

"ఏం, సరళా అప్పుడే లేచావు.

యేమిటి విశేషం?"

తను జవాబు చెప్పదు.

"రాత్రి నిద్రపట్టలేదా?"

........ ..

"కల్లోకి నే వచ్చానా?"

"... ........ "

"నా కలలోకి నువ్వువచ్చావు. యెలా వచ్చావో చెప్పనా పెళ్ళికూతురై నా మెడలో వరమాలవేసి చెయ్యిపట్టుకుని నాతో కల్సి ఏడు అడుగులు వేశావు పెళ్ళి కూతురిగా నువ్వు యెంత బాగున్నావో చెప్పనా."

"అక్కరలేదు. నా కలాంటి కలలు రావు. నీ కొస్తే ఆ బాధ్యత నాది కాదు."

ఖచ్చితంగా చెప్పేస్తుంది. అయినా ఆతను సరళమాట వినడు.

"సరళా నీకోసం మూడు తులాల బంగారం దాచివుంచాను. నీ యిష్టం ఆలోచించుకో"

"ఇద్దరు పెళ్ళాలు చచ్చినా నీ కింకా పెళ్ళిపిచ్చేనా" అసహ్యంగా చూస్తుంది సరళ.

"వాళ్ళు ఖర్మకాలి వాళ్ళు ఛస్తే నా ఖర్మం కాలిందీ బ్రహ్మచారిగా వుండటానికి చెప్పు. నాకేం తక్కువ. నీ కంటే యిరవై యేళ్ళగా పెద్దవాడిని."

సరళ అక్కనుంచి లేచి లోపలికి వచ్చేస్తుంది.

"వీడెంత జిడ్డుగాడు. తన అయిష్టాలు యింత స్పష్టంగా చెప్పినా వదలడే? ఎలా వీడినుంచి తప్పించుకోవాలి" ఆలోచించి ఆలోచించి అల్సిపోతుంది గానీ ఆలోచన తట్టదు.

ఈ నీలకంఠం ఒట్టి నక్కగాడు. అమ్మదగ్గర అతి వినయం నటిస్తూ అభిమానం సంపాదించుకుంటున్నాడు.

ఈ ఇల్లు ఖాళీచేసి దూరంగా పోదాం అమ్మా అని తను యెన్నోసార్లు అడిగింది. ఆవిడ ఒప్పుకోలేదు.

'ఈ అద్దెలో మనకి మరెక్కడా ఇల్లు దొరకదమ్మా.' అంటుంది అంతే.

అసలే రాబడికి ఖర్చుకీ అందని ఆర్థిక పరిస్థితి.

'తప్పదు యింకా కొన్నాళ్లు యిలా యిక్కడే ఈ మురికికూపంలోనే కాలం వెళ్ళదీయక తప్పదు' అనుకుంటూ స్నానం పూర్తిచేసి ట్రాన్సిస్టర్‌లో వార్తలు విని 'యివాళ ఆఫీసు వుంది' అనుకుని తమ్ముళ్ళని యిద్దరినీ కాలేజీకి వెళ్ళండని చెప్పి తల్లి వడ్డించిన అన్నం కంచంముందు కూర్చుంది.

రెండుముద్దలు తినలేదు. యింతలో యెదురింట్లోనుంచి పెద్దగా యేడుపులు వినిపించసాగాయి. ఏమిటో తల్లి వెళ్ళి కనుక్కుని వచ్చింది.

నిన్న జరిగిన అల్లర్లలో వాళ్ళ అల్లుడు చచ్చిపోయాడట.

"వార్త యివాళ తెల్సింది" సూర్యకాంతమ్మ మామూలుగా చెప్తోంది.

కానీ సరళకి అన్నం తినబుద్ధి కావటం లేదు. మనసు యేదోలా అయిపోయింది.

యెదిరింటిలోవారి అమ్మాయి 'శోభ'కి పెళ్ళిఅయి నెల కాలేదు. అప్పుడే ఆ పిల్ల జీవితం యిలా అయిందా అని బాధ.

సరళ చెయ్యికడిగి లేచింది.

"అదేమిటే" తల్లి కోపంగా చూసింది.

"ఈ పరిసరాల్లోని పరిస్థితులు వింటూ నేను యిక్కడ వుండలేనమ్మా. ఏరోజూ భయమేకదా! ఇక్కడ ఎప్పుడు గలాటా జరిగినా మనం ప్రాణాలు అరచేత్తో పట్టుకుని దాక్కోవాలి ఏం జీవితం యిది. యిక్కడ బ్రతకటంకంటే వూరికి దూరంగా యే చెట్టుకింద వున్నా మన శ్శాంతిగా వుంటుందేమో."

"నిజమే...కానీ మరేదీ దారి" ఆవిడ కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

సరళ తల్లిని చూస్తూ తనలో తనే బాధపడసాగింది.

"నాన్న గుర్తుకి వచ్చాడు" అనుకుని తల్లిని ఓదార్చి బ్యాగ్ తీసుకుని బస్ స్టాండ్‌కి వచ్చింది.

సిటీబస్‌లు చాలా రద్దీగా వున్నాయి.

యెలాగో బస్‌యెక్కి అఫీసు చేరుకుంది.

'అమ్మయ్య' అనుకుని డ్యూటీలో పడిపోయింది. అంతే సరళకి టైము తెలియదు.

## 2

సరళ ఆఫీసువదలి ఇంటికి బయలుదేరింది. సమయం అరుగంటలు కావస్తూ వుంది. తగని రద్దీగా వున్నాయి రోడ్లూ బస్సులూ. సిటీబస్‌కోసం నిలబడిన సరళ అలవాటుగా కల పక్కకి తిప్పి చూసింది.

"హలో బాగున్నారా" గోవిందరావు తన మిరపకాయ బజ్జీల వ్యాపారం జోరుగా సాగిస్తూనే సరళని పలక్కరించాడు.

"వూ" నవ్వింది సరళ.

గోవిందరావు బీకాం ఫెయిల్ అయాడు. యే వుద్యోగమూ దొరక్క డబ్బు సంపాదనకి యే వ్యాపారం అయితే నేం అని యీ వ్యాపారం మొదలెట్టాడు. ఈ వ్యాపారం బాగానే సాగుతోంది. లాభంకూడా వస్తోంది అంటూ కబుర్లు చెప్తూంటాడు. ఆఫీసునించి యింటికి వెళ్ళేప్పుడు ఓ పావుగంట అయినా యితనితో కబుర్లు చెప్తేగానీ మనసుకి బాగుండకపోవడం ఓ పెద్ద అలవాటు అయి కూర్చుంది సరళకి.

ఈ విషయం అతనితో అంటే అతను పెద్దగా నవ్వి—

"నాకూ అంతే సరళగారూ. మిగతా సమయాల్లో యెక్కడెక్కడ తిరిగినా మీరు అఫీసునించి ఇంటికి వెళ్ళే సమయానికి యిక్కడుండాలని అనిపిస్తుంది" అంటాడు.

"నిజమా" ఆశ్చర్యంగా చూస్తుంది సరళ.

అతను మళ్ళి నవ్వేస్తాడు. యిలా మాటల్లో యెన్నెన్నో విషయాలు దొర్లిపోతూవుంటాయి వారిద్దరి మధ్యనా. సరళ యెక్కడ వుండేదీ ఏ వుద్యోగం చేసేదీ ఎవరెవరు వుండేదీ అడిగి తెల్సుకున్నాడు.









అతను, అతని వివరాలూ యథాలాపంగానే అడిగింది సరళ.

అతనూ అతని పదేళ్ళ చెల్లీ అరవై యేళ్ళ తల్లీ మాత్రమే వున్నారని చెప్పాడు.

ఇలా వీరిద్దరి పరిచయం క్రమ క్రమంగా పెరగసాగింది.

సరళని చూస్తూనే నవ్వుతూ పల్కరిస్తాడు గోవిందరావు

"కులాసాగావున్నారా" ఈ పల్కరింపుకి సరళ మనసు గమ్మత్తుగా స్పందిస్తుంది.

"నిన్న చూసి ఈ రోజు మళ్ళా అప్పుడే 'కులాసానా' అని పల్కరిస్తారేమిటి" అంది ఓసారి.

"భలేవారే. నిన్నటంచి నేటికి అంటే ఇరవై నాల్గ్గంటలు. ఇంత సమయంలో యెన్నెన్ని సంఘటనలన్నా జరగవచ్చు."

"మాలాంటి వాళ్ళ జీవితాల్లో అంత వేగంగా మార్పులు రావండీ"

"ఎందుకు రావు. మీకు ప్రమోషన్ రావచ్చు. యింకా యింకో చాలా జరగవచ్చు. ఏ అబ్బాయి అన్నా నచ్చవచ్చు. మీకు పెళ్ళి కుదరవచ్చు."

సరళ నిర్లిప్తంగా నవ్వింది.

"జవాబు చెప్పండి" నవ్వుతున్నట్లు అడిగాడు.

"ఆ విషయం దాదాపు మర్చిపోయాను. ఎందుకంటే మాలాంటి స్థితిలోని వాళ్ళకి పెళ్ళికావటం అన్నది చాలా కష్టమైన విషయం అని"

"భలేవారు. అలా నిరాశపడకూడదు. భవిష్యత్తులో యేం జరుగుతుందో మనం చెప్పలేం కదూ. కనుక 'ఆశ'ని చంపకూడదు.

సరళ యింక ఆ మాట మార్చాలని చూసింది. కానీ అతను వదల్లేదు.

"నాకు చెప్పండి. మీకు యెలాంటి పెళ్ళికొడుకు కావాలి."

"చదువు వున్నా లేకున్నా డబ్బు సంపాదించి నన్ను బాగా చూసుకునే వాడు యెవరైనా సరే దొరికితే నేను చేసుకోవటానికి రెడీగా వున్నాను"

"నిజంగా" అతనికళ్లు మెరవసాగాయి.

"నిజంగా నిజం. మీలాంటి ... మీలాంటి..." సరళ మాట పూర్తిచేయకుండానే బస్సు వచ్చేసింది. అంతే దాన్ని ఒదులుకుంటే మరో బస్ గంటవరకూ లేదు అని త్వరగావచ్చి రద్దీగా వున్నా యెక్కేసింది.

ఇది జరిగినతర్వాత మళ్ళా యిద్దరూ కలుసుకోలేదు కర్మాకారణంగా. తిరిగి యివాళ కల్సుకున్నారు. సరళ బండీ దగ్గరగా వచ్చింది. గోవిందరావు వేడివేడి బజ్జీలు నాలుగు ఆకులో పెట్టి యిచ్చాడు.

"క్షేమంగా వున్నారు కదూ. అసలే మీరుండేది పాతబస్తీలో అని చాలాబాలా వరీపడిపోయాను" తనవ్యధ చెప్పసాగాడు గోవిందరావు.

సరళ బజ్జీలు తింటూనే జవాబు చెప్పసాగింది.

"ఇలా సిటీలో గందరగోళం యేర్పడ్డప్పుడల్లా మీ వ్యాపారం దెబ్బతింటుందా."

"తింటుంది. అయితే నేను గలాటా జరిగే యేరియాలకి దూరంగా వుండేలా చూసుకుంటూ వుంటాను. అయినా కాస్తా కూస్తా నష్టం వస్తూనే వుంటుంది ఇవన్నీ సరే, ఓ విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను. అది యేమిటంటే నేనిలా ఈ బజ్జీల బండీకాక ఓ షాపు చిన్నది అమ్మ కోండి అద్దెకి తీసుకుని ఈ బజ్జీంతోబాటు మరికొన్ని స్వీట్లు కూడా పెట్టాలని ప్లాను చేసుకున్నాను. చిన్న గది దొరికింది. దాన్ని మీరు ప్రారంభించాలని కోరుతున్నాను."

"నేనా!" ఛలేవారు. ఏ మంత్రిగారి నన్నా సినిమాస్టారునన్నా పిలవండి బాగుంటుంది."

అలాంటివాళ్ళు నాకు అక్కరలేదు. మీరు కాదు అనటానికి వీల్లేదు. శనివారం ఉదయం పదిన్నరకి బాగుందని చెప్పాడు సిద్ధాంతి. వస్తారు కదూ" అంటూ తను తీసుకున్న షాపు యెక్కడో యెలా రావాలో గుర్తులు చెప్పాడు.

సరళ ఆలోచిస్తూ వుండిపోయింది.

"ఏం మీ ఇంటికివచ్చి పిలవలేదని అభ్యంతరమా! అయితే చెప్పండి అలాగే వస్తాను."

"కాదు. మీరు రానక్కరలేదు. నే వస్తాను."

గోవిందరావు ఆనందానికి అంతులేదు.

"తప్పక రావాలి. మర్చిపోకండి" సరళ బస్ వస్తూంటే దాన్ని చూస్తూ మరో సారి చెప్పాడు.

"అలాగే" అంటూ బస్ ఎక్కబోతూ యెందుకో తలతిప్పి చూసింది. అక్కడ నీలకంఠం ఏస్ను చూస్తూ నిలుచున్నాడు. అతనికళ్ళు యెర్రగా నిప్పుల్లా వున్నాయి.

సరళ గుండె దడదడ లాడింది. యెలాగో బస్ యెక్కింది. అతనా బస్ యెక్కాడా లేదా అని చూసింది. అతను కన్పించలేదు. నీలకంఠం చాలాసార్లు తనూ-గోవిందరావు మాట్లాడటం చూశా డని సరళకి తెలియదు.

సరళ ఇంటికివచ్చింది. కానీ మనసుకి శాంతిగా లేదు.

## 3

సూర్యకాంతమ్మతో నాలుగిళ్ళ అవతల వుండే యాదమ్మ వచ్చి చెప్తోంది.

"సూర్యకాంతమ్మా 'శోభ' మొగుడిని పంపిన ఓళ్ళని యీళ్ళు యెళ్ళి సంపి ఒచ్చినారంట. అక్కడ పెద్ద గలాటా అయిందంట. మళ్ళా ఆళ్ళు యీళ్ళని సంపుతారు, ఇంతేగా" యాదమ్మ వెళ్ళి పోయింది.

"దేవుడా యీ ప్రతీకారాలకి ముగింపు యెప్పుడు" సూర్యకాంతమ్మ మనసులో అనుకుంది.

"అమ్మా తమ్ముళ్ళు యింకా ఇంటికి రాలేదా" అడిగింది.

"రాలేదమ్మా.... నేనూ వాళ్ళకోసమే చూస్తున్నాను."

"త్వరగా రమ్మని చెప్పలేదా"

"చెప్పాను. వాళ్ళకి నా మాటంటే ఖాతరెక్కడిదే."

సరళ బట్టలు మార్చుకుని కూర్చుండి పోయింది.

కరెంటుపోయింది. గాలి లేదు తల్లి యేదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లు అర్థమై "యేమిటమ్మా అది" తనే అడిగింది.

"నీ పెళ్ళి గురించే నాకు దిగులుగా వుందమ్మా నీ తమ్ముళ్ళా చిన్నవాళ్ళు. రోజులు చూస్తే బాగా లేదు. ఆడవాళ్ళం ఒంటరిగా బ్రతకలేం. మనకో మగాడి అండ కావాలి. యివన్నీ కలిపిచూస్తే ఆ నీలకంఠం . తప్ప మనకి ఎవరు దొరుకు తారు చెప్పు. అతనికి మూడో పెళ్ళే అనుకో. ఆ విషయం మనం ఆలోచిం చటం మానేస్తే మిగతావి బాగానేవుంది. అతనిదగ్గర డబ్బుంది. నలుగురు తన్న టానికి వచ్చినా భయపడడు యెదురు తన్ని వస్తాడు."

"అమ్మా! నాకు పెళ్ళి కాకున్నా పర్లేదు. కానీ నీలకంఠాన్ని చేసుకోను. మనకి మగాడి అండే కావాలంటే యింకె వరి ఆసరా అయినా తీసుకుందాం కానీ నీలకంఠంలాంటి గుండా చేతుల్లో చిక్కు పడకూడదమ్మా."

"సరళా యిక్కడ బ్రతకాలంటే యింకేదారీ లేదే."

"వుంది. కొత్తదారి వుంది. మనం యిక్కడినుండి దూరంగా వెళ్ళిపోదాం. డబ్బుకి యిబ్బంది అయినా అర్ధాకలితో

వుందాం. కానీ నీలకంఠం చేతుల్లో చిక్క వద్దమ్మా. అతను ఇక్కడపుట్టి యిక్కడ పెరిగి తరతరాల కక్షలకీ కార్పణ్యాలకీ వారసుడై కిరాతకుడిలా యెందరిని వరి మార్చలేదు. అయినా చట్టానికి అంద కుండా తప్పించుకు తిరుగుతున్నాడు. అతనిలో మానవత్వం లేదు. అతని గుండెలో మతిపిచ్చి ప్రతీకారం ఇవే రగులుతూ వుంటాయి అవి నీకు తెలియ దామ్మా. నాన్నని చంపినవాళ్ళలో యితనూ వున్నాడని నీకు తెల్సుకదూ!"

సూర్యకాంతమ్మ వెక్కి వెక్కి ఏడవ సాగింది

"వాడు దుర్మార్గుడు. వాడి కళ్ళు నీ మీద వున్నాయి. వాటిని కాదని మనం బ్రతకలేమే తల్లీ."

"ఇదే ఇదే పిరికితనం ఆడదాన్ని అన మర్థురాలిని చేస్తోంది. బానిస మనస్తత్వం పెంచుతోంది."

"సరళా" తల్లి గావుకేక పెట్టింది. సరళ మాటలు ఆపి వెనక్కి తిరిగి చూసింది.

అక్కడ నీలకంఠం నిలబడివున్నాడు.

తమ మాటలు అతను విన్నాడో లేదో తెలియదుగానీ అతని కళ్ళలో యేదో గర్వం కన్పిస్తోంది.

"సూర్యకాంతమ్మా! నీ కూతురు ఏమో అనుకున్నా యిన్నాళ్ళూ. యింక ఒక్క క్షణంకూడా వూరుకోను. చూడూ నాలుగు రోజులే టైము ఇస్తున్నాను. నీ కూతుర్ని యిచ్చి నాకు పెళ్ళి జరిపించావా సరే.... లేకుంటే....నా సంగతి తెల్సుగా. నీ కుటుంబాన్ని సఫాచేసి కాని నిద్దరపోను."

నీలకంఠం కళ్ళు నిప్పుల్లా వున్నాయి ఆ కళ్ళలో సరళని తీక్షణంగా చూస్తూ వెళ్ళిపోయాడు.

## 4

సూర్యకాంతమ్మ కూతురిని ఇల్లుదాటి బైటకి పోనీయలేదు. మూడవరోజు జరుగుతూ వుంది.

గోవిందరావు స్వీటుషాపు తెరిచేది యీ రోజునే. సరళ తల్లి చూడకుండా బైటపడి అటో యెక్కింది. గోవింద రావు కొత్తషాపుని సింపుల్‌గా అలంక రించాడు. షాపుముందు ఓ పది కుర్చీలు వేసివున్నాయి. ఆ కుర్చీల్లో కొందరు యువకులు కూర్చుని వున్నారు. టేపు రికార్డులోనించి హిందీ పాటలు వినిపిస్తూ న్నాయి. గాజు అల్మారాలో కొన్ని స్వీట్లు అందంగా పేర్చివున్నాయి. అటో దిగిన సరళని కుర్చీల్లో కూర్చున్న కుర్రాళ్ళు యెగాదిగా చూడసాగారు. ఆ తర్వాత ఒకతను అడిగాడు. "మీరు సరళగారు కదూ".

"ఔను! గోవిందరావుగారెక్కడ?"

"యిప్పుడే పిలుస్తాం. కూర్చోండి" కుర్చీ చూపాడు.

సరళ కూర్చుంది.

గోవిందరావు వచ్చాడు. కానీ అతను మామూలుగా లేదు. ఎడం చేతికీ తలకీ కట్లువున్నాయి. కుంటుతున్నాడు.




"ఏమైంది!" సరళ అదుర్దాగా అడిగింది.

"తర్వాత చెప్తాను. మీరు కాస్త ఆలస్యంగా అయినా వచ్చారు. అందుకు ముందు థాంక్స్ చెప్తున్నాను రండి. వచ్చి ఈ రిబ్బన్ కత్తిరించండి."

సరళ అతను చెప్పినట్లు చేసింది.

గోవిందరావు పూలదండని సరళ మెడలో వేశాడు స్నేహితులకి స్వీట్లున్న కవర్లు సరళకిచ్చి పంచమన్నాడు. అవి అందుకుని శుభాకాంక్షలు చెప్పి వెళ్ళిపోయారు అందరూ. సరళా గోవిందరావులు కుర్చీల్లో కూర్చున్నారు.

"యిప్పుడు చెప్పండి. మీకీ దెబ్బలు యెలా తగిలాయి."

"ఆ రోజు మీరలా బస్ యెక్కారా. తర్వాత నేను నా వ్యాపారం కట్టిపెట్టి యింక వెళ్ళిపోదామని డబ్బు లెక్క చూసుకుంటూ వుండగా ఓ రౌడీ నామీద వచ్చి పడ్డాడు యెమరుపాటుగా వుండటం వల్ల వాడు కొట్టినదెబ్బలు కొన్ని తగిలాయి. నేను యెదురుదెబ్బ తీసేసరికి వాడు పారిపోయాడు. అయితే అతను నాకు తెలియదు. అయినా నా మీదకి యెందుకు వచ్చాడో అప్పుడు అర్థం కాలేదు. కానీ తర్వాత వాడెవరో నా మీదికి యెందుకొచ్చాడో ఆరా తీశాను విషయం తెల్సుకున్నాను."

"ఎవరతను!" సరళ అదుర్దాగా అడిగింది.

"మీ కెందుకులెండి. ఆ విషయం నే చూసుకుంటాను. అసలు ఆ మర్నాడే నా స్నేహితులని వెంటతీసుకుని వాడిపని పట్టాలని అనుకున్నాను. కానీ యివాళ ఈ షాపు ప్రారంభంవుందనీ మీరు వచ్చి తిరిగివెళ్ళటం బాగుండదనీ ఆగాను."

"మీరు కొట్లాటల్లో తలదూరుస్తారా."

"దూర్చను. కాని అకారణంగా నామీద కొస్తే ఒదలను"

"మీపీదకి వచ్చినవాడు మా ఇంటి దగ్గరవున్న పీలకంఠ మేనా"

"అవును అతనే! నేను మీతో మాట్లా డటం చూసే అలా వచ్చాడని అర్థమైంది నాకు."

"మీరు వాడితోలికి వెళ్ళకండి వాడు చాలా దుర్మార్గుడు. గూండా రౌడీ పచ్చి నెత్తురు తాగే కసాయివాడు" అంటూ తనని ఎలా బెదిరించాడో తల్లిని ఎలా భయపెట్టాడో చెప్పేసింది

"కనుకనే అలాంటివాడిని వదలం కూడదు పీళ్ళ అగడాలకి భయపడటం వల్లనే యింకా యింకా రాక్షసత్వం ప్రదర్శిస్తున్నాడు. ఆ విషయం వది లేయండి. మీరు మాత్రం ఆ పాత నగ రంలో వుండద్దు. వెంటనే అక్కడనుండి దూరంగా వచ్చేయండి. మా ఇంటికి దగ్గర లోనే ఓ గది చూశాను. మీ రక్కడికి యిప్పుడే వెళ్ళకండి."

"మా అమ్మా తమ్ముళ్ళూ"

"వాళ్ళని సురక్షితంగా మీ దగ్గరకి మేం చేరుస్తాం. మీరు సరేనంటే అందుకు ఇప్పుడే యేర్పాట్లు చేస్తాను."

సరళ గుండె దడదడలాడసాగింది. ఈ క్షణంలో నిర్ణయించుకోవటం యెంత కష్టం. యేం జరిగినా ఆ భగ వంతుడే దిక్కు అనుకుని "మీరు వెళ్ళి రండి. మీ రెవరినైనా పంపండి" అంది గోవిందరావు నవ్వాడు.

గోవిందరావు సరళని తను చూసిన గదిలో దించి వెళ్ళిపోయాడు

## 5

సాయంకాలమైనా గోవిందరావు తిరిగి రాలేదు. సరళ గుండెల్లో రైళ్ళు పరు గెడుతూన్నాయి. తల్లికి తెలియకుండా ఇంట్లోనించి రావటమేకాక వారిని కూడా రప్పించే ప్రయత్నం యే పరిస్థితు లకి దారితీస్తుందో ఆలోచించకుండా తను త్వరపడిందేమో యిదే విషయం సరళని వేధిస్తోంది. గోవిందరావు తల్లి అన్నం తెచ్చిపెట్టింది సరళకి కడుపులో ఆకలివున్నా ముద్ద గొంతు దిగటంలేదు. మనసులో ఒకటే ఆవేదన.

రాత్రి పదిగంటలు గడిచిన తర్వాత గోవిందరావు రాలేదు కానీ అతని స్నేహి తులు నలుగురు వచ్చారు.

"సరళగారూ మీ అమ్మనీ ఇద్దరు తమ్ముళ్ళనీ ఆ పాత బస్తీనుంచి బైటకి తీసుకురాగలిగాం. మా స్నేహితుల ఇంట్లో వుంచాం. రేపు వుదయం ఇక్క డికి తీసుకువస్తాం" అని చెప్పారు.

"మా వాళ్ళని యెలా తీసుకురాగలి గారు."

"మీకు యాక్సిడెంట్ అయిందనీ,హాస్ప టల్లో వున్నారనీ చెప్పి యెక్కడున్న వాళ్ళని అక్కడునుంచే తప్పించి తీసుకు వచ్చాం. అయితే ఆ ఇంట్లోని మీ సామా

మలు తీసుకురాలేం. దానికి మీరు ఆశ వదులుకోవల్సిందే"

"అవిపోతే ఫర్లేదుగానీ ఆయన యేరీ."

మా మాటలు అందరూ నమ్మినా నీలకంఠం నమ్మలేదు. అనుమానించి ప్రతిఘటించాడు. ఆ ఘర్షణలో మా కన్నా గోవిందరావుకి మరీ దెబ్బలు తగిలినాయి. యే డాక్టరూ కట్లు కట్టటానికి ముందుకు రావటంలేదు. అర్ధరాత్రి కదూ. యింక ఆసుపత్రికి తీసుకువెళ్ళవల్సిందే. అక్కడికి వెళ్ళేముందు మిమ్మల్ని ఒక్కసారి కల్సుకోవాలని వస్తున్నారు. అదుగో"

గోవిందరావు వళ్ళంతా రక్తం. యిద్దరు స్నేహితుల అసరాలో నిల్చోలేకపోతున్నాడు. సరళ అతన్ని గట్టిగా పట్టుకుని యేడవసాగింది.

"నేనే దీనికంతకి కారణం. నేనే నేనే. మీరు యెందుకు వెళ్ళారు ఆ దుర్మార్గుడి దగ్గరికి"

మంచివాళ్ళకి మంచివాళ్ళంగా వుండాలి సరళా. రాక్షసులకి రాక్షసత్వంతోనే జవాబు చెప్పాలి ఆ కిరాతకుడి కీలు కీలూ విరకొట్టేశాను. ప్రాణం పోకుండా జీవితాంతం బాధపడేలా చేసి వచ్చాను. యిలా చేయటం చట్టంప్రకారం నేరం అని నాకు తెల్సు అయితే గత్యంతరంలేక నీలకంఠంలాంటి కిరాతకుడు యింకెవరికీ అపకారం చేయకుండా చేయవల్సివచ్చింది. యిందుకు నేను బాధపడను భయపడను. నేను పోలీసులదగ్గరకి వెళ్ళిపోతున్నాను జరిగినదంతా చెప్తాను. సరళా నువ్వు మీవాళ్ళూ శాంతిగా గంజినీళ్ళయినా సరే ప్రశాంతంగా తాగి బ్రతకండి. చట్టం యే శిక్ష విధిస్తే అది శిరసావహిస్తాను. వెడుతున్నాను సరళా మళ్ళా తిరిగి రాగలిగితే మనం కల్సి బ్రతుకుదాం"

గోవిందరావు స్నేహితులని వదిలి ఆటోయెక్కి వెళ్ళిపోయాడు. సరళ శిలా విగ్రహంలా నిలబడిపోయింది. గోవిందరావు తిరిగి వస్తాడన్న ఆశ యే మూలో మనసులో కదులుతోంటే కన్నీళ్ళు తుడుచుకుంటూ వుండిపోయింది.



# సీరియల్

# సౌందర్యదీపం

## ఆర్. సంధ్యారాణి

(గత సంచిక తరువాయి)

**65**

కారు పోర్టికోలో ఆగింది.

కృష్ణమౌళి ఒడిలో తలపెట్టుకుని వెనకసీట్లో పడుకునిఉంది ఇంద్రసేన.

ఆమెను లోపలకు తీసుకువెళ్ళారు.

ఇందూకి స్పృహవచ్చి కళ్ళువిప్పి చూసింది.

తను ఒక గదిలో మంచంపై పడుకుని ఉన్నట్లు గ్రహించుకుంది. టైము చాలా అయిపోయి ఉంటుంది. అని కనురెప్పలు ఎత్తి పక్కకు చూసింది.

తలదగ్గర కృష్ణమౌళి కూర్చుని ఆమె తలపై చెయ్యివేసి ఆప్యాయంగా నిమురుతున్నాడు.

ఒక్క క్షణం కళ్ళు మూసుకుంది.

"ఇందూ!" అనురాగంతో పిలిచాడు.

"ఊఁ!" నీరసంగా పలికింది.

"కాఫీ తాగుతావా!"

ఆమె మాట్లాడలేదు.

"ఇందూ ఎందుకీ పట్టుదల. మన ఇద్దరం భార్యాభర్తలం అయ్యాం. మనలో మనకి ఈ పంతాలు పట్టింపులు ఏమిటి చెప్పు."

ఆమె మాట్లాడలేదు

"నా మాట విని భోజనం చెయ్యి. ఇన్నిరోజులు వచ్చి మంచినీళ్ళు కూడా గొంతుకలో పోసుకోలేదు నువ్వు. ఏమయినా అయిపోతే నేను అంటూ ఉంటావనే అనుకుంటున్నావా!" అతని కంఠం గాద్గదికం అయింది.

ఇందూ ముఖంలో కోపం గాని శాంతం గాని ఎలాటి భావాలు కనిపించలేదు.

ఆమె మాటకు ఎదురుచూడకుండా ఒకామెను పిలిచి ఇందూకి భోజనం తెమ్మని చెప్పాడు. పది నిముషాల్లో ఆమె భోజనం తెచ్చి అక్కడ టేబిల్ మీద పెట్టి వెళ్ళిపోయింది.

ఇందూ భోజనంచెయ్యడానికి ఇష్టపడలేదు మొదట. ముఖం తిప్పేసుకుంది.

అతను ఆమెను వదిలిపెట్టలేదు.

"పట్టుదల వస్తే నేను మనిషిని కాను రాక్షసత్వం వస్తుంది నాలో. నా మాట విను" అంటూ బతిమాలసాగాడు.

"నాకు నాకు వద్దు" సీర్పంగా చెప్పింది. అతను వినలేదు.

ఆమె బుజాలచుట్టూ చెయ్యేసి అతని గుండెలకు ఆమెను తోసి బలవంతంగా తనే రెండు ముద్దలు తినిపించసాగాడు.

ఇందూ ఇక తప్పదు అన్నట్లు బుద్ధి మంతురాలిలా తనే తినసాగింది.

"ఆ ఆదీ అలా తినాలి నువ్వు చాలా మంచిదానివి" అంటూ నవ్వి ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు.

ఇందూ భోజనంచెయ్యటం పూర్తి అయింది. భోజనం చెయ్యటం పూర్తి అవగానే శరీరం తన స్వాధీనం తప్పి నట్టు అయింది.

కడుపునిండగానే ప్రాణం తాపీపడి నట్టు అయింది.

మనసులో ఎలాటి ఆలోచనలూ లేకుండా ఆ క్షణం హాయిగా అనిపించ సాగింది.

కనురెప్పలు బరువుగా మూతలుపడ సాగాయి.

"నిద్ర వస్తుందా!" అడిగాడు.

"ఊ"

"అయితే పడుకో ఎలాటి ఆలోచనలూ మనసులో రానివ్వకు హాయిగా పడుకో ఈ గదిలోకి ఎవ్వరూ రారు" అంటూ ఆమె తలగడ సరిచేసి పడుకోమన్నాడు.

ఇందూ తల ఊపి బుద్ధిమంతురాలిలా పడుకుంది.

ఆమెకు అప్పుడే కళ్ళమీదకు మత్తులా వచ్చేస్తుంది

ఆమె కళ్ళకు అతను కృష్ణమోహ అవునో కాదో కూడా తెలియటంలేదు.

అంత త్వరగా హాయిగా నిద్రపట్టే సింది

కృష్ణమోహ క్షణంసేపు అలాగే చూశాడు

"ఇందూ!" చాలా మెల్లగా పిలిచాడు.

ఆమె పలకలేదు.

ఆమె కళ్ళు అప్పటికే నిద్రలో మూరుకుపోయాయి.

ఒంటిమీద తెలివిలేకుండా పడుకుని నిద్రపోతుంది.

ఇంద్రసేన ముఖంలోకి అలాగే చూడసాగాడు.

ఎంత సౌందర్యరాశి!

ఇంత అందాలరాశికి అంత కోపం ఎందుకో, అంత గర్వం ఏమిటో అంత పొగరు దేనికో! మనసులో నవ్వు కున్నాడు.

స్త్రీకి పొగరు, గర్వం, గడుసుతనం ఉంటే అదో అందం.

ఆ అందమే పురుషుడ్ని రెచ్చగొడు తుంది పంతం పెరుగుతుంది పట్టుదల తోడుఅవుతుంది ఎవ్వరికీ లొంగని స్త్రీని కళ్ళెంవేసి లొంగదీయటంలో ఎంత అనందం.

చిన్నతనంలో మేనమామదగ్గర అన్న మాటలు నిజంచేశాడు.

ఇందూని ఎత్తుకువెళ్ళిపోయి పెళ్ళి చేసుకుంటానన్నాడు.

అప్పుడు చిన్నతనం పెళ్ళి అంటే ఏమిటో తెలియని వయసు అయినా మామయ్య అలా అనగానే ఎందుకో రోషంతో అలా అనేశాడు.

ఆ తరువాత తను ఎంత ఇడిసిపోయి బెదిరిపోయాడు.

తల్లి కోరిక ఇందూని కోడలిగా చేసుకోవాలని ఆ కోరికే కోరింది ఆవిడ.

తల్లి మాట నిలబెట్టాడు.

మేనమామదగ్గర ఆనాడు అన్నమాట ప్రకారం ఈరోజు చేశాడు.

ఇందుకి తనకి పెళ్ళి అయిపోయింది.

ఇంక ఇద్దర్నీ ఎవ్వరూ వేరు చెయ్య లేరు.

ఇందూ తను కలిసి ఆశీర్వాదంకోసం మేనమామ యింటికి వెళ్తే!

కృష్ణమోళి గుండెలనిండా సంతోషం అయింది. అప్పుడు ఆయనగారి ముఖం చూడాలి.

మేనల్లుడే అల్లుడు అయ్యాడు అంటే ఆయన ఏమంటారు!

ఇక ఎవ్వరు ఏంచేస్తారు!

పెళ్ళి అయిపోయాక బ్రహ్మ కూడా వేరు చెయ్యలేడు. మొదట ఆయనముఖం మాడిపోయినా తరువాత సరిపెట్టుకుని తన దగ్గరగా వచ్చి, 'కృష్ణా అన్నీ మర్చిపో' అంటారు.

అప్పుడు మేనమామమీద కోపం ఏముంటుంది.

'ఏమిటి మామయ్యా ఆ మాటలు' అంటూ తను తేలిగ్గా అనేస్తాడు

అందరూ సంతోషంగా సరదాగా ఉంటారు

ఇందూలాంటి అందాలరాశి తనకు భార్య అయింది.

కృష్ణమోళి ఇందూవైపు మళ్ళీ చూశాడు.

ఒంటిమీద తెలివిలేనట్టే పడుకుని ఉంది తలపై ప్రేమగా నిమిరాడు.

ఆమె మెడలో వచ్చని పసుపుతాడుతో మంగళసూత్రాలు మెరుస్తున్నాయి. ఆమె వివాహిత అని తెలియచేస్తూ.

మెడకి నల్లపూసలు అందంగా నిండుగా కనిపిస్తున్నాయి.

ఈమె తన భార్య,

మనసులో పదేపదిసార్లు గర్వంగా అనుకున్నాడు.

ఇన్నాళ్ళగా ఉన్న సమస్యలు పంతాలు పట్టుదలలు అన్నీ ఈ రోజుతో మాయమయ్యాయి.

అందరం కలిసిపోతాం.

అమ్మ ఉంటే ఎంత సంతోషించేది!

మనసులో బాధపడ్డాడు.

ఇందు పడుకుంది. లేచాక తీరిగ్గా మాట్లాడుకుని యింటికి ప్రయాణం అయి వెళ్ళొచ్చు అనుకున్నాడు.





అక్కడనుండి లేస్తూ చేతివేళ్ళతో ఆమె చెంపమీద మృదువుగా రాసి అక్కడనుండి వెళ్ళిపోయి తలుపుల దగ్గరగా చేరేశాడు.

* * *

ఉదయం పదిన్నర గంటలకు భోజనం చేసి పడుకున్న ఇంద్రసేన సాయంత్రం నాలుగున్నర గంటలకు గాని నిద్ర లేవలేదు.

ఇప్పుడు మెలకువ వచ్చింది ఆమెకు.

కళ్ళువిప్పి చూసింది.

తన గదిలో మంచంమీద పడుకుని ఉంది.

ఇప్పుడే తెల్లవారిందా! అనుకుంది.

టైము చూశాక తెలిసింది సాయంత్రం నాలుగున్నర గంటలు అని.

చటుక్కున లేచి కూర్చుంది.

ఆమెకు అప్పుడు గుర్తువచ్చింది.

రాత్రి పెళ్ళిఅవటం.

ఆమె స్పృహతప్పి పడిపోవటం, అతను బలవంతంగా అన్నంతినిపించటం

అంతా సినిమా రీల్సులా కళ్ళముందు కదిలింది.

ఇందూ గుండె ఒక్కసారి ఆగిపోయింది.

తనకి పెళ్ళి అయిపోయిందా!

ఇది నిజమా!

తల వంచి మెడలో మంగళసూత్రాలు చూసుకుంది.

వణికే చేతులతో ఆ మంగళసూత్రాలని చేతుల్లోకి తీసుకుంది.

అంటే తను వివాహితా!

తను కృష్ణమౌళి భార్యా!

భగవంతుడా!

ఆమె గుండె ఆగిపోయినట్టయింది.

తను అనుకున్నది ఏమిటి జరిగింది ఏమిటి! కృష్ణమౌళికి తను భార్యకావాలని కోరుకుందా!

వీల్లేదు, తను అతని భార్య కావడా నికి వీల్లేదు.

ఆమె మనసు పరిపరివిధాల పోయింది.

అతను మోసం చేశాడు.

మోసంచేసి, తప్పించి బంధించి పెళ్ళి చేసుకున్నాడు.

ఇది పెళ్ళా!

కాదు ఇది పెళ్ళికాదు.

ఈ పెళ్ళికి తను అంగీకరించదు.

తన తండ్రి, అన్నయ్య, వదిన తన పెళ్ళిగురించి ఎన్నెన్ని అనుకున్నారు!

ఒక్కగానొక్క ఆడపిల్ల, ఆ అమ్మా యికి వైభవంగా పెళ్ళిచెయ్యాలని ఎంతగా అనుకుని ఆశపడి మురిసిపోయారు.

చివరకు తన పెళ్ళి ఇలాగా జరిగేది!

ఈ రాక్షసుడికి జడిసే వదిన అందరికి అన్నయ్యను ఎవ్వరికి తెలియకుండా పెళ్ళిచేసుకుంది. ఈ విషయం వదినకు తెలిస్తే!

ఇతన్ని ఎంత అసహ్యించుకుంటుంది?

తండ్రికి, అన్నయ్యకు చెప్తే వాళ్ళు కోపంలో ఏమైనా చేస్తారు.

వాళ్ళసంగతి ఇంకా ఇతనికి తెలి యదు. తెలిస్తే ఇలాటిపని చచ్చినా చేసే వాడు కాదు. అతనిముందు తను తనవాళ్లు అందరూ ఓడిపోవటమా!

అతను పంతంపట్టాడు. తనని పెళ్ళి చేసుకుంటానని శపథంచేశాడు. అతన్ని అల్లుడుగా చేసుకోవడానికి తండ్రి అసలు ఇష్టపడలేదు.

ఆయన తన కూతురికి చాలా గొప్ప సంబంధం తెచ్చి చెయ్యాలని అనుకు న్నారు,

ఈ పెళ్ళి ఇలా జరిగిందని తెలిస్తే ఆయన తట్టుకోగలరా!

అన్నయ్య భరించగలరా!

ఇందూ గుండె పగిలిపోయింది.

కళ్ళనీళ్ళు దారలుకట్టి చెక్కిళ్ళు తడి చేయసాగాయి.

మెడలో మంగళసూత్రాలు పడే పడి సార్లు చూసుకుంది.

భగవంతుడా! ఏమిటిది!

తనకి పెళ్ళి అయిపోయిందా!

అంటే!....అంటే!... తను ఓడిపో యిందా!

జీవితంలో తను కాలు కదపకుండా పెదవివిప్పి మాట్లాడకుండా ఈ మంగళ సూత్రాలతో తనని బంధించేశాడా!

స్నేహితురాలి యింటికి వెళ్ళిన తను ఈ విధంగా ఇక్కడ బందీ అయిందని తల్లిదండ్రులకి, అన్నా, వదిన ఎవ్వరికీ తెలియదు.

తను పెళ్ళిచేసుకుని భర్తతో యింటికి వెళ్తే వాళ్ళు తట్టుకోగలరా!

ఆ తల్లిదండ్రుల గుండె పగిలిపోదూ!

భగవంతుడా! ఇప్పుడు ఏంచెయ్యాలి?

అన్నీ భరించి ఈ పెళ్ళికి తలవంచాలా! లేక ఈ పెళ్ళినే ఎదిరించి ఎదురు తిరగాలా.

ఇప్పుడు ఏం చెయ్యాలి!

ఇంద్రసేన ఆలోచించసాగింది.

భోజనం మానేసిన ఆమె భోజనంచేసి పడుకుని లేవాక ఒంట్లో కొత్తశక్తి వచ్చినట్టు అయింది.

కళ్ళుతెరిచి సూటిగా చూడగలుగుతోంది.

కాళ్ళల్లో శక్తి పుంజుకుంది.

మనిషిలో మునుపటి బలం వచ్చేసినట్టుగా అనిపించసాగింది.

గట్టిగా మాట్లాడగలను అన్న నమ్మకం ఏర్పడింది.

ఆలోచించగా, ఆలోచించగా ఆమె కళ్ళనీళ్ళ ధారలు ఒక్కసారిగా ఆగిపోయాయి.

కళ్ళు వెడల్పు అయ్యాయి.

తను ఎందుకు భయపడాలి!

తను ఎవరికి తలవంచాలి.

కృష్ణమౌళి ఎవరు!

అతనికి తనకి ఏమిటి సంబంధం!

మనసులో మండిపడిపోయింది.

కళ్ళల్లో ఎర్రజీరలు అలుముకున్నాయి.

మంగళసూత్రాలవైపు కోపంగా చూసుకుంది.

మెడలో మంగళసూత్రాలు ఆమెను చూసి వెక్కిరించినట్టుగా అనిపించసాగింది.

నువ్వే వోడిపోయావు.

కృష్ణమౌళియే గెలిచాడు.

ఈ మంగళసూత్ర బంధాల్ని తెంచుకుని నువ్వు ఎక్కడికి పారిపోలేవు!

ఇది నిజం. ముమ్మాటికీ నిజం అంటూ హేళనచేస్తున్నట్టుగా అనిపించసాగింది.

ఇంద్రసేనకి పిచ్చెత్తిపోయినట్లు అయింది.

ఏమిటి తను లొంగిపోతుంది అనే అనుకున్నాడా.

ఎంత తెలివితక్కువవాడు.

ఈ ఇంద్రసేన అంటే ఏమిటో తెలియచేస్తాను. "తను జీవితంలో ఓడిపోనని ఎంత కష్టం నష్టం అయినా గెలిచి తీరుతానని ఇంద్రసేనతో ఎప్పుడూ పంతంపట్టి పోటీచెయ్యాలు అనిగట్టిగా చెప్తాను.

మనసులో కోపంగా అనుకుంది.

అంతలో తలుపుదగ్గర చప్పుడు అవటంతో అటుగా చూసింది.

ఒకామె లోపలకు తొంగిచూసింది.

కోపాన్ని మింగుకుంటూ అలాగే చూసింది ఇంద్రసేన.

ఆమె లోపలకు వచ్చి.

"లేచావా అమ్మా నీకోసమే చూస్తున్నాం నువ్వు ఇంకా లేవలేదేమా అని స్నానం చేస్తావా!" అడిగింది ఆమె ఎంతో నెమ్మదిగా చిరునవ్వుతో.

ఈయనగార్కి అందరూ ఆత్మీయులే అందరూ ఆయన తరపునే మాట్లాడతారు.

ఎవ్వరూ తన మాట వినిపించుకునే వాళ్ళు కారు.

ఒక్క క్షణం తనలో తాను ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చింది.

టైము చూసింది. ఏడుగంటలు దగ్గర అవుతుంది.

అంటే తను ఇంతసేపూ కూర్చుని ఆలోచిస్తుందా!

ఆలోచనలతో టైము తెలియలేదా!

ఈ రోజు వీళ్ళకని చెప్తాను.

అందరికీ ఒక్కసారే చెప్తాను.

పెళ్ళిపెద్దలు అందరూ పెళ్ళికొడుకుతో సహా మూర్ఛపోయేలా చేస్తాను.

తొందరపడకండి పెళ్ళివారూ అనుకుంది ఇంద్రసేన మనసులో కోపంగా.

ఆమె మాటకు తల ఊపింది స్నానం చేస్తాను అంటూ.

ఆమె వెళ్ళి ఇంద్రసేనకు బట్టలు తీసుకువచ్చి ఇచ్చింది.

ఇంద్రసేన మౌనంగా స్నానానికి వెళ్ళిపోయింది. స్నానంచేసి ముస్తాబు అయి కృష్ణమౌళికోసం చూడసాగింది.

టైము ఎనిమిదిగంటలు అయింది.

కృష్ణమౌళి రాగానే తను ఏం మాట్లాడాలి!

మనిషిని ఎలా దులపాలి!

ముఖం వాచేలా చివాట్లు ఎలా పెట్టాలి! అని ఒకటే ఆలోచిస్తూ అతని రాకకోసం ఎదురుచూడసాగింది.

ఆమెకు ఇప్పుడు భయంగా బెంగగా అనిపించడంలేదు.

మనసునిండా సంతోషంతో మనిషి తిక్కిరిబిక్కిరి అవుతోంది.

తను ఓడిపోలేదు. అతనే ఓడిపోయాడు.

ఆ మాట్లు ధైర్యంగా ధీమాగా తను చెప్తే అతను ఏమయిపోతాడు.

విని తట్టుకోగలడా!

మనసులో గర్వంగా నవ్వుకుంటూ అతని రాకకోసం ఎదురుచూడసాగింది.

* * *

కృష్ణమౌళి అంబికకు రహస్యంగా ఫోన్‌చేసి చెప్పసాగాడు.

"అంబికా! నేనే గెలిచాను. ఇంద్రసేన మెడలో మూడుముళ్ళు వేసి ఆమెను నా భార్యని చేసుకున్నాను" ఉత్సాహంగా చెప్పాడు.

"పెళ్ళి జరిగిపోయిందా! ఇందూ ఏం గొడవ చెయ్యలేదు కదా!" అడిగింది అంబిక మెల్లగా.

"ఊహూ"

"అయితే పెళ్ళి బాగా జరిగిందన్న మాట."

"ఆ బాగా జరిగింది."

"ఆ ఫోటోలు తీయించాను. వీడియో కూడా తీయించాను."

అంబిక నవ్వింది. "అయితే పెళ్ళి బాగా జరిగిందన్నమాట!"

"అహా నిజంగా నేను చాలా భయపడ్డాను అంబికా! ఇందూ ఏం గొడవ చేస్తుందో అని నేను భయపడినట్లు కాక బాగా జరిగిపోయింది" అన్నాడు.

"ఇందూ ఏం చేస్తుంది! భోజనం చేసిందా!"

భోజనం చేసిందని కాదు. ఆమెచేత బలవంతంగా చేయించాను. భోజనంచేసి పడుకుంది.

"ఇంకా లేవలేదా!"

"లేదు. లేచిందేమో వెళ్ళి చూడ్లేదు. చూస్తాను" అన్నాడ.

"ఇక్కడ మీ మామగారు అత్తగారు అంతా కంగారుపడ్తున్నారు. ఇందూ స్నేహితురాలి యింటికి వెళ్ళి ఇంకా రాలేదు ఉత్తరంకూడా వ్రాయలేదు అని."

"మా మావగారు అత్తగారే కాదు మన మావగారు అత్తగారు అవాలి" అన్నాడు.

ఫోన్‌లో ఇద్దరూ నవ్వుకున్నారు.

మళ్ళీ "ఉష్" అనుకున్నారు. ఎవరైనా వింటారు అన్నట్టుగా.

"అయితే మీరు ఇద్దరు కలిసి ఎప్పుడు వస్తున్నారు!" అడిగింది.

"రేపు తెల్లవారేసరికి వస్తాం. పాపం ఇందూ అలా బెంగతో పడుకుని ఉండి ఉంటుంది లేచాక నచ్చచెప్పి బయలుదేరతాం."

"అలాగే మీ కోసం చూస్తుంటాను."

"ఆ నువ్వు ఎక్కడికి వెళ్ళకు. అత్తగారు, మామగారు, జయరామ్‌లతోపాటు మమ్మల్ని చూసి నువ్వు కూడా ఆశ్చర్యం నటించు" అంటూ చెప్పాడు.

"అలాగే" అంది నవ్వుతూ.

"అయితే ఉంటాను. రేపు ఉదయం ఇద్దరం కలిసి వస్తాం" అన్నాడు రిసీవర్ పెట్టేస్తూ.

ఇంద్రసేన నిద్రలేచింది అని ఆమె వచ్చి అతనితో చెప్పగానే లేచాడు ఆమె గదిలోకి వెళ్ళడానికి.

ఇంద్రసేనలో కోపం అంతా పోయింది.

అంబిక చెప్పినట్లు తాళి కట్టగానే ఆమె మారిపోయింది.

అది తాళి మహత్యం.

హిందూస్త్రీ మెడలో మంగళసూత్రానికి ఇచ్చిన విలువ గౌరవ. మరి ఎవ్వరికీ ఇవ్వదు.

మంగళసూత్రాన్ని పూజిస్తుంది.

స్త్రీ కోరుకునేది పసుపు కుంకాను.

కృష్ణమోళి మనసులో నవ్వుకున్నారు.

అమ్మమాట నెరవేర్చాను.

అంబికను వెతికి తెచ్చాను గణేష్ రావుగారికి కోడల్ని, జయరామ్‌కి భార్యను చేశాను.

నేను ఇందూని పెళ్ళిచేసుకున్నాను.

అమ్మ ఆత్మ శాంతిస్తుంది అనుకున్నాడు.

అందాల ఇందూ ఏంచేస్తుంది!

సిగ్గుతో తన రాకకోసం ఎదురు చూస్తుందా!

అతని మనసులో చిత్రవిచిత్రభావాలు తియ్యగా తలపెత్తసాగాయి.

అందాల ఇందూ—

మనసులో పదేపదిసార్లు అనుకుంటూ ఆమె గదివద్దకు వెళ్ళాడు.

(సశేషం)




యామినీ సరస్వతి

"అమ్మాయిని చూడటానికి మగపెళ్ళి వారు రేపొస్తున్నారు. మనకు మంచి రోజులు, చెడ్డరోజులు అంటూ లేవు. కానీ వాళ్ళు తిధి వార నక్షత్రాలు చూసుకుని వస్తున్నార్ట.... స్వప్నకి మనలాగే యివన్నీ గిట్టవు. కానీ మనం ఎదుటి వాళ్ళ అభిప్రాయాలని మన్నించాలి కదా! అది మన మర్యాద. మరి అమ్మాయి కెలా చెబుతావో నీ యిష్టం.... మొట్టమొదటి సారిగా వస్తున్నారు. నచ్చినా నచ్చక పోయినా నలుగుర్లో అవమానం మాత్రం జరక్కూడదు—"

భార్య విశాలతో అన్ని విషయాలు వివరంగా చెప్పారు విశ్వనాథంగారు. ఆయన మండలాధికారిగా పనిచేస్తోన్నా డాబూ దర్పం ఎరగని మనిషి. భార్యా తనలాటి మనిషే—మగువ మన జీవిత సమభాగిని అనే భావాలున్న మనిషి. కాపురం చేసిన పాతికేళ్ళలో ఆయన ఏనాడు అర్ధాంగిని అవమానించి ఎరుగరు. ఆమె మాటని మన్నించి గౌరవించారు.

వాళ్ళిద్దరి సంస్కారం సంస్కృతి ప్రతిబింబం అన్నట్టు వాళ్ళిద్దరికీ ఇద్దరు సంతానం. స్వప్న నోములపంట అయితే కుమార్ వరాలమూట. మంచిలో మర్యాదల్లోనే కాదు చదువు సంస్కారాల్లో కూడా తలిదండ్రులకి పేరే తెచ్చారిద్దరూ. కుమార్ ఎమ్మే పూర్తిచేసి జూనియర్ లెక్చరర్‌గా జీవితం ప్రారంభించాడు. ఏడాదిక్రిందటే తను పనిచేస్తోన్న కాలేజీలోని మరో లెక్చరర్ శ్రీవల్లిని పెళ్ళి చేసుకుంటానని తలిదండ్రులతో చెప్పాడు. వంకపెట్టటానికి ఏ వంకలూ లేవు. ఈడూ జోడూ కుదిరి ముచ్చటగా వున్నా

రిద్దరూ. దాంతో ఆ వివాహానికి తథాస్తని ఆశీర్వదించారు.

అయితే స్వప్న పెళ్ళికానిదే తను పెళ్ళిచేసుకోనని కుమార్ తన పెళ్ళి వాయిదా వేస్తున్నాడు. అనాటినుంచి స్వప్నకి సంబంధాలు చూడటం వాళ్ళ కర్తవ్యమైంది. స్వప్న కూడా ఎమ్మే పూర్తిచేసింది. అయితే ఆమె దృష్టి ఐ ఏ.యస్‌పై నుంది.

"అబ్బాయి పేరు సత్యం ఎం. టెక్ పాసై అసిస్టెంటు ఇంజనీరుగా పని చేస్తున్నాడు మంచి సంప్రదాయంగల కుటుంబం. కట్నకానుకల పేచీల్లేవు—" మళ్ళీ చెప్పారు విశ్వనాథంగారు.

'కాని స్వప్న ఏమంటుందో—" అంది విశాలి.

"మనం చెప్పి ఒప్పించాలి—"

ఆ మాటకి నవ్వారాయన. "పుట్టి బుద్దెరిగిన నాటినుంచి ఏనాడూ తమ అభిప్రాయాల్ని పిల్లలపై రుద్దలేదు—వాళ్ళకి చదువు చెప్పించాం. స్వేచ్ఛ ఇచ్చాం. స్వయం నిర్ణయాధికారానికి అవకాశం కల్పించాం — ఇప్పుడిలా—"

"ఇది వేరు జీవితంలో చాలా ముఖ్యమైన విషయం—"

"ఎంతైనా ఆడపిల్లతండ్రి అనిపించు కున్నారు—"

"కొన్ని విషయాలు మనం కాదన్నా—"

"ఏంటమ్మా! నాన్న కాదంటున్నారు" హఠాత్తుగా వచ్చింది స్వప్న. పాతికేళ్ల పరువంలో చిరూచింతా, బరువు బాధ్యత లేని యువకులు కలలు కనే స్వప్నంలా వుంటుంది స్వప్న. అందానికి అందం లాగా, మాధుర్యానికి మకరందంలాగా వుంటుందామె—

"నీకు పెళ్ళిట—"

తల్లి మాటలకి పకపక నవ్వింది స్వప్న.

"నాకు పెళ్లంటమ్మా!"

"అవునమ్మా — నీకు పెళ్ళిచూపులు. సత్యం ఎం టెక్. పూర్తిచేసి ఏ ఇగా వున్నాడట. రేపు నిన్ను చూడటానికి వస్తున్నాడట. నువ్వు వాళ్ళకి, వాళ్ళు నీకు నచ్చితే పెళ్ళి ఖాయంచేసుకుంటార్ట—" గబగబా చెప్పింది విశాల. ఇదే మంచి తరుణం — మళ్ళీ మించిపోతే దొరకదు అన్నట్లుగా చెప్పింది—దానితో తన బాధ్యత తీరిపోయినట్లు చూసింది భార్య ముఖం లోని భావాలు చదివారు విశ్వనాథంగారు. ఆయనకి నవ్వొచ్చింది.

"ఏమిటి విశాలా! ఆ తొందర. క్షత్రియ రాజుల కొలువుకూటంలో తమ రాజుగారి రాయబారాన్ని గబగబా అప్పగించే రాయ బారిలా ఏమిటా తొందర."

"నాన్నగారూ!"

ఆయనెప్పుడూ నాన్నా అనే పిలు స్తుంది స్వప్న. తనకు నచ్చని విషయమో— మెచ్చని పంగతో అయితే తప్ప అయన్ని "నాన్నగారూ" అని పిలవదామె. అది ఆ ఇద్దరికీ బాగా తెలుసు.

"నాన్నా! పెళ్ళి అంత తప్పని విషయమా?"

"తప్పని అంటావామ్మా?"

"తప్పో-ఒప్పో-మనిషి జీవితంలో పెళ్ళి అంత ముఖ్యమైందా నాన్నగారూ!"

"అవునమ్మా - నది కడలి చేరినట్లు జీవితంలో కదలి కదలి మనం సంసార సాగరం చేరాలి-"

"చేరి అందులో మునగానాం తేలానాం అన్నట్లుగా కష్టాలతో కన్నీళ్ళతో దుఃఖాలతో దురవస్థలతో ఇబ్బందుల్తో ఇక్కట్లతో క్షణక్షణం పోరాడ్తూ - ఆ సాగరంలోని మొసళ్ళతో యుద్ధం చేస్తూ- అదే బ్రతుకనుకోవాలి కదూ! తర్వాతేముంది, నేను పైతరం ప్రపంచ జనాభాకి సంఖ్య వొక్కటి జతను వేస్తాను అన్నట్లు బ్రతకాలి కదమ్మా!"

ఆ మాటలకి పకపకా నవ్వేగాయన

"బ్రతుకులన్నీ అలానే వుండవమ్మా- అందమె ఆనందం ఆనందమే జీవిత మకరందం అన్నట్లు బ్రతుకంతా వున్నమీగా బ్రతికేవాళ్ళూ వున్నారు వాళ్ళకి జీవితం ఒక రసహేల-రాసలీల. బ్రతుకు పోరాటం కాదు. పండుగ___"

"ఎక్కడో - ఎవ్వరో - హాయిగా వుండవచ్చు నాన్నా నూటికి తొంభై మంది అప్పుల్తో తిప్పలుపడ్తూ-అధిక సంతానంతో అల్లాడ్తూ బ్రతుకు ఒక నిత్య సంగ్రామంలాగా - ఏపూట గడిస్తే ఆ పూట ముప్పు గడిచినట్టుగా-సూర్యోదయ, సూర్యాస్తమయాల్ని లెక్కపెట్టుకుంటూ బ్రతుకే బరువుగా లాక్కొస్తున్నారు-"

"స్వప్నా! ఎవరి జీవితం వాళ్ళది. ఒకరికి ముళ్ళదారి మరొకరికి మల్లెల రహదారి కావచ్చు. మన బ్రతుకు మనం దిద్దుకున్నట్టుగా వుంటుందమ్మా అదంతా మన చేతుల్లో వుంది. భార్యాభర్తలు ద్వంద్వ సమాసంలాగా వెన్నెల్లాగా, పూవు తావిలాగా, కలిసిమెలిసి గౌరవించుకుని అభిమానించుకుని జీవితాల్ని పంచుకుంటే అడుగడుగునా ఆమని-అణువణువునా పున్నమి యామిని అవుతుందమ్మా-గృహిణి ఇంటికి వెలుగు తల్లీ-"

"అందరూ మీలా వుంటారా నాన్నా!"

"అలాగే మీ అమ్మలాగా వుండరు తల్లీ-" కొన్ని క్షణాలు ఆగేడాయన. "అయ్యోదేవుడికి పద్మావతి, నాగరాజుకు మల్లీశ్వరి-రజనికి మంజులలాగా జత కూడాలి తల్లీ-

"నాన్నా!"

"అవునమ్మా-నువ్వు సత్యాన్ని చూసి, మాటాడి, అతనిమనస్సు తెలుసుకుంటే-"

"ఆ అవకాశం వుండొద్దు నాన్నా!"

"రేపు - అందుకే వస్తున్నారమ్మా-"

స్వప్న ఇక రెట్టించలేదు.

• • •

సాయంకాలం సుమారు అయిదు గంటలు.

మేడమీద కుర్చీలో కూర్చున్నాడు సత్యం. అతనికెదురుగా అటూ యిటూ పచార్లుచేస్తోంది స్వప్న-

"నీ గురించి అంతా చెప్తారు-"

"ఎవరూ ఎవరికీ పూర్తిగా అర్థం కాలేదండీ - మా నాన్నగారికే నేను పూర్తిగా తెలీదు—ఇక ఆయన-"

ఆమె మాటలకి చిరునవ్వు నవ్వాడు సత్యం. "మీ అభిప్రాయాలు నీ అభిరుచులు .. మీ ఆరాధనలు అన్నీ చెప్పారు అవన్నీ నా ఊహలకి ప్రతిబింబాలే-రెండు మంచి అద్దాల్లో బొమ్మలెప్పుడూ ఒకేవిధంగా ప్రతిబింబిస్తాయి-"

"మీరు మీ భార్యని శాసిస్తారా?"

"ఎందుకు?"

ఆ మాటలకి తెల్లబోయిందామె.

'అర్థాంగి అంటే అర్థం తెలిసినవాడెవడూ భార్యని శాసించడు. శాసించలేడు. పలుకు—భావంలా కలిసి మెలిసి జీవిస్తే ఇది కావాలి . ఇది చేయాలి అవి ఎలా ఆర్డర్ వేస్తారు'

"పురుషాహంకారం-''

''పదాలు పరుషంగా వుంటాయి అహంకారం వ్యక్తి సంబంధమే కానీ అసలు ఆ విచక్షణా వుండదు స్వప్నగారూ! ఇవి మీరు ఒక శిక్షితాభిప్రాయంతో ఏర్పరచుకున్న ఊహలు-''

''మీరు ఆమెని గౌరవిస్తారా?"

"అది నన్ను నేను గౌరవించుకోవటం కాదా?"

"ఆర్థిక విషయాల్లో స్వేచ్ఛనిస్తారా-"

"ఇంటిపెత్తనం అంతా ఆమెదే-జీతం తెచ్చి దోసిట్లో పోసి పాకెట్‌మనీ యిప్పించుకుంటానంతే-"

ఆశ్చర్యంగా చూస్తోంది ఆమె

"ఆర్థికశాఖ మీ ఆడవాళ్ళదేనండీ! పొదుపు నీవద్దే నేర్చుకోవాలి. ఉదాహరణకి చీర పొడగెక్కువైతే కత్తిరించి జాకెట్ కుట్టిస్తారు జాకెట్‌ముక్క పొడవైతే కర్చీపు కుట్టేస్తారు చీర పాతబడ్తే



పరుపుగలీబులు, డోర్‌కర్టెన్లు, కిటికీ తెరలుగా రూపాంతరం చెందిస్తారు. రాత్రి అన్నం మిగిలిపోతే దాన్ని తిరగమోత పెట్టేస్తారు-"

పక్కున నవ్వింది ఆమె-

"ఇలా నవ్వులు రువ్వుతూ, ఇంట్లో నవ్వుల పువ్వులు విరియిస్తూ -గృహాన్ని స్వర్గసీమగా మార్చేవాళ్ళు-ఆడవాళ్ళు-"

"కానివాళ్ళు-"

"మనకు కావివాళ్ళు- వాళ్ళ గొడవ లెందుకు?"

"సరే - కట్నం వద్దన్నార్ట-"

"నేను వద్దనలేదే - మామగారు అభిమానంతో ఆత్మీయతతో ఇస్తానన్న ధనాన్ని, బంగారాన్ని, కానుకని కాదనే మూర్ఖుడ్ని కాను-''

నిప్పెరపోయిందామె. అర క్షణం కూడా కాలేదు. అంతరంగం అరవి కార్చిచ్చులా అయిపోయింది. ఎంత చదువుకున్నా-ఎంత మంచి ఉద్యోగం ఉన్నా - ఎంత ఆస్తిపాస్తులున్నా - పాల సంద్రమును పవ్వళించినవాడు పరుల పాలు కోరినట్లు-ఎదుటివారిసొమ్ము ఎంతో తీపి-దానికోసం ఆశపడ్తారు-ఎంత వార లయినా కట్నదాసులే - నో - నో - తను అలాంటివాడి పీడకూడా సహించలేదు.

క్షణక్షణానికి ఆమె ముఖంలో మారుతున్న రంగులు చూసి పకపక నవ్వేడతను..."సుమారు 40 కేజీల మేలివన్నె బంగారం; అందం, చదువు, సంస్కారం, ఇవన్నీ మూటకట్టి మూర్తిచేసి పోతపోసిన రసాధిదేవతలాటి అమ్మాయిని కానుకగా యిస్తానంటే కాదనే మూర్ఖుడ్నా చెప్పండి."

ఆమె ఆ మాటలు వినగానే — వాటి భావం స్ఫురించగానే తెల్లబోయింది. అతని మాటల్లోని గడుసరితనం గమనించి మదినెంచింది సంతసించింది.

"మీ తలిదండ్రులు-"

"నన్ను కన్నవారు నన్ను అమ్ముకునే వారేకానీ అమ్ముకునేవారు కాదు...కన్నవారు కారు. అకొన్నవారు కారు. రక్త మాంసాలతో వ్యాపారం చేసేవారు కారు-"

"ఇప్పుడేకాదు—ఎప్పుడూ—ఎన్నడూ- ఎందునా ఈ ఇంటినుంచి ఏదీ కానుకగా అందదు—"

"నేను స్వార్థితంతో జీవించేవాడ్నే కానీ స్వార్థంతో జీవించేవాడ్నికాను. నా సంపాదనతో నా సంసారాన్ని స్వర్గం చేసుకుంటాను."

"థాంక్యూ! థాంక్యూ ఐ లయిక్ యూ-ఐ లవ్ యూ-యు ఆర్ మై కింగ్. యు ఆర్ మై రింగ్ - మై డార్లింగ్-" పొంగిన ఆనందంతో అంది స్వప్న.

• • •

"స్వప్నా! స్వప్నా! ఏమిటే ఆ కలవరింతలు" కూతుర్ని తట్టి లేపుతూ పిల్చింది విశాల. చప్పున మేల్కొంది స్వప్న.... ఎదురుగా తల్లి...

ఇది ఇదంతా కలా... ఇదంతా కల్లా ..ఊహరా కథకాదు—కలకాదు—కల్ల కాదు కథ, కల, కల్ల కాకూడదు. ఈ స్వప్న సత్యం స్వప్నంగా మిగిలిపో కూడదు. యదార్థం కావాలి. తన కలలు కలవరింతలు కాకూడదు. కలకలలాడే బతుకు పులకింతలు కావాలి.

తను సత్యంతో మాటాడ్తుంది. తన మనోభావాలు వివరిస్తుంది: అతడు అన్ని




టికి అంగీకరిస్తేనే చేయి అందిస్తుంది. బ్రతుకులో వరిస్తుంది. ఆనందాన్ని వర్షిస్తుంది. అతన్ని అలరిస్తుంది.

కానినాడు అతన్నే కాదు మరెవర్నీ తనతో చేరనివ్వదు తన జీవితం తనదే అవుతుంది.

ఒక నిశ్చితాభిప్రాయానికి రాగానే ఆమె మనస్సు తేలికపడ్డట్టయింది.

"ఏంలేదమ్మా! రాబోయే వరుడితో కాబోయే పెళ్ళికోసం మనస్సులో ఒక మధురగీతం రచించుకుంటున్నాను. అది తీయని తలపులతో తీయని సంగీతమే అవుతుందో—"

ఆర్ద్రోక్తిలో ఆగిన కూతుర్ని చూస్తూ "స్వప్నా! నీ కల ఫలిస్తుందమ్మా!" అంటూ ఆశీర్వదించింది విశాల స్వప్న కళ్ళల్లో కాంతిపుంజాలు వేవెలుగులు వెదచల్లాయి.



# కవసీవ డాడీ మమ్మీ



రెండేండ్ల బాబు ఎదురుగా ఒకరోజు బాగా గొడవపడ్డారు సుజాతా, రాజారావూ. వాళ్ళ పోట్లాట చూసి, చూసి బిక్కమొహంవేసి, చివరికి గుక్కపట్టి ఏడ్చేశాడు బాబు.

ఆలుమగలిద్దరూ ఆరోజు ఒట్టేసుకుని ప్రమాణం చేసుకున్నారు, బాబు ఎదురుగా మాత్రం పోట్లాడుకోకూడదని.

తర్వాత ఏడాదికే బేబీ పుట్టింది.

అయినా సుజాతా, రాజారావూ చేసుకున్న ప్రమాణం తప్పలేదు పిల్లల ఎదురుగా ఇద్దరూ అమితమైన చిరాకు, బోలెడంత అన్యోన్యంగా, చాలా హాయిగా ఉంటారు.

పిల్లలలా వెళ్ళగానే వాళకర్మాకరు తక్కేసుకుంటారని కాదు. ప్రేమ వివాహం కాదుగాని, పెళ్ళయినప్పటినుండి ప్రేమించుకుందామనే ప్రయత్నిస్తున్నారు సుజాతా, రాజారావు ప్రయత్నిస్తే పుడుతుందా ప్రేమ?

ఇద్దరూ 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' కాదని తెలిపోయింది. ఇద్దరి అభిరుచులు వేరు, సంస్కారాలూ వేరు. ఇద్దరినీ అన్యోన్య బంధంలో కట్టిపడేసే మహత్తర ఆశయం ఏదీలేదు మరి ప్రేమ ఎలా సాధ్యమౌతుంది?

ప్రేమయితే లేదుగాని, ఇద్దరి మధ్య పూర్తిగా ద్వేషమయినా లేదు

ఎలాగో కుదిరి, స్థిరపడి, ముడిబడిపోయిన వైవాహిక బంధాన్ని కొనసాగించాలనే ఇద్దరి తాపత్రయమూ. కాని, విడిపోయి తప్పుకోవాలని ఇద్దరికీ ఏకోశానా లేదు

రోజుకో పోట్లాట, వారానికో గంట ప్రశాంతిగా వాళ్ళకాపురం సాగిపోతూనే ఉంది కాని, ఇద్దరి మధ్య గొడవలు లేగు

తున్నట్లు పిల్లలకి మాత్రం తెలియనివ్వ కూడదని వాళ్ళ ప్రయత్నం.

రాజారావు తల్లి, తండ్రి ఎప్పుడూ పోట్లాడుకుంటూ ఉండేవారు. అందుచేత, అతనికి ఇంటి వాతావరణమంటే అసహ్యం వేసి ఎల్లవేళలా మిత్రులతో గడపటం అలవాటయిపోయింది. ఆ స్నేహాలు ఎన్నోసార్లు బెడిసికొట్టాయి. ఫలితంగా అతను కొంతమేరకు నష్టపోయాడు కూడా. సుజాత చిన్నతనంలో ఇంట్లో చేదు జ్ఞాపకాలని భరించింది. తల్లిని తండ్రి తరచు కొట్టేవాడు, తల్లి ఒంటరిగా కుములుతూ ఉండేది. తన పిల్లలకి మాత్రం ఇటువంటి చేదు జ్ఞాపకాలు మిగలకూడదనే ఆమె తపన

పిల్లలముందు 'నటించటం' మాత్రం ఎందుకు? ఇద్దరూ నిజంగానే, పూర్తిగా అన్యోన్యంగా ఉండరాదా? అంటే—

ప్రయత్నలోపం లేదు, ఒకరి బలహీనతలు ఒకరికి తెలుసు. ఎవరి తప్పు వారికి కూడా మరుసటి క్షణంలో తెలిసిపోతూనే ఉంటుంది. అయినా, తాత్కాలిక ఉద్రేకంలో మాటామాటా అనుకోకుండా ఉండలేరు. దేవుడు చేసిన మనుషులం— ఎంతకని మారుతాం? అనే ధోరణి వచ్చేసింది ఇద్దరికీ కూడా.

* * *

ఆదివారం ఉదయం టిఫిన్ దగ్గరే వచ్చింది పోట్లాట.

"ఏడిసినట్టుంది పెసరట్టు. నీకు పెసరట్టు చేయటం రాదు. రానిది ఎందుకు చేయాలి?"

"ఏమైందండీ?"

"మాడ్చి పెట్టావు."

"అవతల పెట్టేయండి. మరోటి వేస్తాగా—"

"నా మొహం వేస్తావు, వేసింది చాలు. కాఫీ తగలడు."

"మరో అట్టు వేస్తానంటుంటే. మీకు ఇష్టమనికదా పెసరట్లు పెట్టుకున్నా ఇవాళ —"

"నా కిష్టమనే— మాడ్చి పెట్టావు—"

"ఎందుకలా కోప్పడతారు? హోటల్‌కెళ్తే రోస్టు - అని ఆర్డరివ్వరూ?"

"రోస్టంటే బాగా కాల్చమని-బొగ్గుగా మాడ్చమని కాదు- నీకు చెప్పడం వేస్టు, చచ-ఆదివారమైనా తీరిగ్గా తిందామని లేదు-"

"ఇప్పుడేం మునిగిపోయిందని? మరో అట్టు వేస్తానన్నాను - నిజానికి ఇప్పుడిదిచ్చినా మాడలేదు. చక్కగా ఉంది—"

"ఆ - మహా చక్కగా ఉంది—"

సమయానికి బాబూ, బేబీ ఇంట్లో లేరు. పక్కింటి పిల్లల్తో ఆడుకోవటానికి వెళ్ళారు. పిల్లలు ఇంట్లో లేకపోవడంతో ఇద్దరికీ బోలెడంత 'స్వేచ్ఛ' దొరికింది.

"ఏం వెక్కిరిస్తావు? ఒక్క నిమిషం చేసి చూడండి వంట - తెలుస్తుంది—"

"అం, చేశావులే - బోడి వంట—"

"ఇదుగో-బోడి గీడి అనకండి-"

"ఏం అంటేనేం?"

"మీరు చేసేది బోడి ఉద్యోగమని నేనంటే-"

"నేను చేసేది బోడి ఉద్యోగమా?"

"అవి నేనంటే ...?"

"ఏం-నీ బోడి మొహానికి ఇంతకన్న మంచి మొగుడొస్తాడనుకున్నావా?"

"ఛీఛీ! బొత్తిగా సంస్కారంలేవి మనుషులు-"

"నీ సంస్కారం తెలుస్తూనే ఉంది. భర్త ఎంత హీనుడైనా పూజలుచేసే ఇల్లాళ్ళున్నారు. నెలకు వెయ్యిన్నీ ఎని మిదివందలు తెచ్చిపోస్తుంటే - బోడి ఉద్యోగమా?"

"ఊరికే-ఇదై పోకండి-మొదట బోడి అన్నది మీరే-"

"ఎప్పుడైతేనేం? నా ఉద్యోగం గురించి నువ్వు-బోడి-అన్నావా లేదా?"

"ఎప్పుడన్నాను?-మీరు అన్నాక-"

"అసలు అనలేదని కూడా అంటావు. పీకేం? రెణ్నెళ్ళప్పుడు - మీ మద్రాసు మేనమామ ఎదుట - చేతగాని వెధవ అనలేదూ?"

"నేనేమీ 'వెధవ' అనలేదు-"

"పోనీ చేతగానివాడన్నావు కదా?- ఆ వెధవకన్న చేతగానివాణ్ణా నేను?"

"ఇదుగో మాటలు మిగలకండి. పోన్లెండి-కాఫీ అయినా తీసుకోండి-"

"కాఫీ-ఆ కాలవలో పొయ్యి. అది వారం ఇంత గొప్పగా తెల్లారింది. ఇక కాఫీ ఒకటి-ఛ-ఛ-కొంపలో సుఖంగా ఉందామని లేదు-"

"చీటికి మాటికి నోరుపారిశే సుఖం ఎలా వస్తుంది- ఇంటిమనుషులతో మెలగ టం మీకు అలవాటుంటే కదా? ఎప్పుడూ బజార్లంట తిరగటం-"

"ఛస్-పోతాను. మళ్ళీ బజార్నపడే పోతాను. ఈ పాడుకొంపలో కాపురం కన్న బజార్నపడి అడుక్కు తినటం మేలు-"

చెప్పుల్లో కాళ్ళు దూర్చి వీధిగుమ్మం దాకా వచ్చాడు రాజారావు. సరిగ్గా అప్పుడే బాబూ, బేబీ ఎదురుపడ్డారు.

"డాడీ-నేనూ వస్తా" అంది బేబీ

"ఎక్కడికి డాడీ? నేనూ రానా?" అన్నాడు బాబు: "ఆదివారం ఐస్‌ఫ్రూట్ తీసిస్తానన్నావుగా-" అని గుర్తుచేశాడు.

పిల్లల్ని చూడగానే, ముఖంలో చిరాకు కొంత తగ్గించుకుని "మళ్ళీ ఇప్పుడే వస్తాగా" అంటూ వెళ్ళిపోయాడు రాజారావు.

"మమ్మీ - డాడీ ఎక్కడికి కెళ్ళారు?" అన్నాడు బాబు.

"ఐస్‌ఫ్రూట్ ఎప్పుడు మమ్మీ?" అంది బేబీ.

నవ్వుముఖం పెడుతూ, పిల్లల్ని దగ్గ రకు తీసుకుంది సుజాత.

"డాడీ అర్జెంటుగా ఏదో పనుందని వెళ్ళారు. మధ్యాహ్నం - భోంచేశాక -



మిమ్మల్ని తీసుకెళ్ళి-ఐస్‌ఫ్రూట్ కొని పెడతారు, ఏం? మరి మీరంతా టిపిన్ తినలేదుగా-రండి - వేడివేడిగా ఉన్నాయి పెసరట్లు - పెసరట్లంటే నీకిష్టం కదూ బేబీ - అందుకని చేశాను-"

"నాక్కూడా ఇష్టమే మమ్మీ-అయితే పంచదారతో తింటాను-"

"అలాగే-రండి మరి-"

* * *

మధ్యాహ్నం మూడు గంటలవు తుండగా కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి తిరి గొచ్చాడు రాజారావు, కోపం సడలినా, బింకం ఉందిగాని, అంతకన్న అలసటే స్పష్టంగా కనిపిస్తోంది.

లుంగీ అందిస్తూ, "రండి-భోంచేద్దురు గాని-" అంది సుజాత.

"ఆకలిగా లేదు-"

"మీ ఇష్టం, నేమా ఇంకా తినలేదు-"

"అదేం-" అన్నాక, ఒక నిమిషానికి డైనింగ్‌టేబిల్ దగ్గరికి నడిచాడు రాజా రావు.

మౌనంగా ఆమె వడ్డిస్తుండగా, అతను మౌనంగా తిన్నాడు. మజ్జిగన్నం అయిపో వస్తుండగా, తల దించుకునే, "ఐయాం సారీ సుజీ-" అన్నాడు.

"ఛ-అదేమిటండీ-ఐ షుడ్ బీ సారీ-మీకు ఎంతో ఇష్టమైన పెసరట్టుని-మాడ్చి పెడితే చిరాకెయ్యదూ...."

అలా రాజీ కుదిరిపోయింది.

వళ్ళు విరుచుకుంటూ, "పిల్లలేరీ?" అన్నాడు రాజారావు. ఆదివారం, ఆ వేళ ప్పుడు పిల్లలు ఇంట్లోనే ఉంటారని

తెలుసుగాని, వాళ్ళప్పుడే గుర్తువచ్చి వట్లుందతనికి

"మేడమీదున్నారు_" అంది సుజాత.

మేడమీదున్న ఒకే ఒక్క గది, గెస్ట్ రూంగానూ, పిల్లలు ఆడుకోవటానికీ ఉపయోగపడుతోంది.

మేడమెట్లవైపు నడుస్తున్న రాజా రావును చూసి, నవ్వుకుంది సుజాత. అతని ధోరణి సుపరిచితమే. ఇలా ఇద్దరి మధ్య పోట్లాటవచ్చి, రాజీ కుదిరినప్పు డల్లా, అతనికి పిల్లలమీద ప్రేమ మరింతగా పెరిగిపోతుంది. రాజీ కుదిరినా అతనిలో బింకం వెంటనే పూర్తిగా సడలదు. పిల్లలతో కాసేపు కబుర్లుచెప్పి, వాళ్ళదగ్గర 'మమ్మీ' ని పొగడటం మొదలుపెడితే, అప్పుడిక పూర్తిగా ప్రశాంతపరిస్థితి ఏర్పడిపోయినట్లే లెక్క.

సుజాత వంటిల్లు సర్దటం పూర్తి కావస్తుండగా, మేడమెట్ల దగ్గర్నుంచి, మెల్లగా "సుజీ" అని పిలిచాడు రాజారావు.

ఏమిటన్నట్లు చూసింది సుజాత.

రమ్మన్నట్లు సైగచేశాడు రాజారావు.

ఆ ధోరణిచూస్తే, పిల్లలగురించి ఏదో విశేషం చెబుతాడని అర్థమౌతుంది ఆమెకు. "ఏమిటండీ?" అంది దగ్గరకు వెళ్ళి.

"రా_చెబుతా_" అంటూ ఆమె చెయ్యి పుచ్చుకుని, మెట్లవెంట పైకి తీసుకు వెళ్లాడు.

మెట్లెక్కాక, చిన్న వరండా ఉంది. వరండాచివర గదిగుమ్మం ఉంది. గుమ్మం దగ్గర, వారగా ఆగి, లోపలికి చూడ మన్నట్లు సైగచేశాడు రాజారావు అతని భుజంమీదుగా లోపలికి చూసింది సుజాత.

లోపల బాబూ, బేబీ ఆడుకుంటు న్నారు. అయితే, ఆదేమీ బొమ్మలతో ఆడుకోవటంకాదు. ఏదో మహత్తర నాటక ప్రదర్శనకు 'రిహార్సల్స్' చేస్తున్నట్లు_ ఇద్దరూ రెండు పాత్రల్ని పోషిస్తున్నారు.

"మరి_అంకుల్ సిగరెట్టు తాగుతాడు కదా?" అంటోంది బేబీ.

"అవును కదా_ అంకుల్ _ సిగరెట్టు తాగుతాడు_" అంటూ వెళ్ళి, గదిలో మూలపడిఉన్న మ్యాగజైన్లలోంచి ఒక కాగితం చించుకుని వచ్చాడు బాబు. కాగితాన్ని చుట్టి, సిగరెట్టులా చేతబట్టి, పెదవులమధ్య ఉంచుకున్నాడు. అచ్చంగా పక్కింటి 'అంకుల్'ని అనుకరిస్తున్నాడు.

"ఛ_ఎన్నిసార్లు చెప్పినా నీకు బుద్ధే లేదు_" అన్నాడు బాబు హఠాత్తుగా.

"బుద్ధిలేంది మీకే పొండి_" అంది బేబీ, పక్కింటి 'ఆంటీ'లాగా చేతులు తిప్పుతూ

"నాన్సెన్స్" అన్నాడు బాబు, సిగి రెట్టుపొగలా నోట్లోంచి గాలిని ఊదుతూ_

"యూ షటప్_"

"మీరే నోరుమూసుకోండి. యేల్లా స్తున్నాయి ఎందుకూ?"అంది బేబీ."యేల్లా స్తున్నాయి" అనేమాటను సరిగా పలకటం చేతకాలేదు.




"యూ ఇడియట్ –ఫూల్––డెవిల్– నువ్వు ఆడదానివా? రాక్షసివా?" అన్నాడు బాబు కళ్ళు ఉరుముతూ.

"మీరు మొగవారైతే నేను ఆడదాన్నే–అంది బేబీ చేతులు తిప్పుతూ. ఆమాట అంటూ బేబీ, పడిపడి నవ్వింది. 'నటన' మానేసి బాబుకూడ నవ్వులో శ్రుతికలిపేశాడు.

బోలెడంత ముద్దనిపించి, గదిలోకి వెళ్ళిపోయింది సుజాత. చెయ్యిపుచ్చుకుని అక్కడే ఆపేశాడు రాజారావు. "ష్!" అన్నాడు.

అతను ఆశించింది రైట్! లోపల, ఒక 'సీన్' ముగిసింది కాని, నాటకం ఇంకా పూర్తికాలేదు.

"ఇప్పుడింక 'డాడీ – మమ్మీ' ఆట ఆడదాం–" అన్నాడు బాబు.

"సరే–నేను డాడీ – నువ్వు మమ్మీ–" అంది బేబీ.

"ఊహూఁ–నేనే డాడీ––నేను బాయి– నువ్వు గర్లు కదా–అందుకని–"

"సరే అయితే – డాడీ ఏం చేస్తాడు?"

"నువ్వు వంటింట్లోకి వెళ్ళాలి–" అన్నాడు బాబు. తను కుర్చీలో కూచున్నాడు.

వంటింట్లో ఉండటాన్ని అభినయిస్తూ, గోడవారగా వెళ్ళి నిలుచుంది బేబీ.

కుర్చీలో కూచుని, రాజారావులా పేపర్ చదవటం అభినయిస్తున్నాడు బాబు. చేతిలో కాఫీ కప్పు పట్టుకున్నట్లు, జాగ్రత్తగా నడుస్తూ, సుజాతలా ప్రవేశించింది బేబీ.

"ఇదుగోండి–కాఫీ–"

పేపర్లోంచి తలెత్తకుండా, కాఫీ అందుకొని చప్పరిస్తున్నాడు బాబు.

బేబీ మరో కుర్చీలో కూచుని, సుజాతలా కాలిమీద కాలువేసుకొని, ఒక మ్యాగజైన్ చేతుల్లోకి తీసుకుంది. మ్యాగజైన్ చదువుతున్నట్లు, తల అటునుంచి ఇటు తిప్పుతోంది.

"కాఫీ ఎక్కువేంటుగా ఉంది_"

"స్నానం చేస్తారా?"

"కాస్సేపాగి చేస్తాను_"

"కాకరకాయ వేపుడు చేశాను_"

"వెరీగుడ్."

"రేపు సినిమాకు వెళ్దామా?"

"ఓ.కె."

"రేపు మధ్యాహ్నం నేను షాప్‌కు వెళ్ళాలి_"

"ఊఁ_వెళ్ళిరా_"

"టి వి లో ఇవాళ హిందీ సినిమా ఉంది_"

"అలాగా - అయితే చూద్దాం_"

"మరి_తొందరగా స్నానంచేయండి_"

"అలాగే_"

"ఈలోగా నేను వడ్డించేస్తాను_"

"ఓ.కె."

"ఆఁ బాబూ! బేబీ! మీరూ రండి_ దాడీ స్నానానికి వెళ్ళారు. అందరం తొందరగా తినేసి - టి.వి లో సినిమా చూద్దాం - హిందీసినిమా_"

బోలెడంత మురిసిపోతూ, ముఖ ముఖాలు చూసుకున్నారు సుజాతా, రాజా రావూ. పిల్లల 'నటన' అత్యద్భుతంగా ఏమీలేదు. అయితే, పిల్లలు ఇంట్లో ఉండగా, దాదాపు ప్రతి సాయంత్రం వాళ్ళిద్దరిమధ్య నడిచే సంభాషణ_దాదాపు అలాగే ఉంటుంది.

"ఇంక చాలు_ఈ ఆటేం బాగాలేదు_" అంది బేబీ ఉన్నట్టుండి.

"అవును .ఏం బాలేదు_" అన్నాడు బాబు.

"డాడీ - మమ్మీల ఆట - బోరుకొడు తుంది_" అంది బేబీ, అరిందాలా.. ....

"అవును_బోరే_అయితే_మరి_ఆట ఆపేద్దామా?_"

"మళ్ళీ ఆంటీ - అంకుల్ ఆడదాం_ మొన్న ఆంటీని అంకుల్ చెంపమీద కొట్టలేదూ? ఆ ఆట రెడీ ... ఈసారి కూడా నువ్వే అంకుల్ . నేనేమో ఆంటీ ..అయితే నా చెంపమీద గట్టిగా కొట్ట కూడదు_ఏం? . "

క్షణాల్లో బాబు, బేబీల మొకం మారి పోయింది. ఇద్దరూ ఆంటీ_అంకుల్ అయి పోయారు.

"షటప్ "

"మీరే నోరుమూసుకోండి_"

"నన్నే నోరు ముయ్యమంటావా?"

చెంపదెబ్బ ఎప్పుడొస్తుందోగాని, ఈ లోగా భీకరంగా అరుచుకున్నారు ఆంటీ, అంకుల్ పాత్రల్లో బాబూ, బేబీ.

వాళ్ళ అభినయం వాళ్ళకే ముచ్చటేసి, డైలాగులు ఆపి, మధ్యలో పదేపదే నవ్వుతున్నారు.

ముఖముఖాలు చూసుకున్నారు— సుజాతా, రా జా రా వూ చేసుకున్న ప్రయాణం_వెక్కిరిస్తున్నట్లనిపించింది.

# సమాధానం చెప్పండి

సీరియల్

కొండముది శ్రీరామచంద్రమూర్తి

పాలిపోయిన మొహంతో పడమటి లోయలోకి తప్పుకుంటున్న ముసలి చంద్రుడికి, తన వేయి కిరణాల వెలుగు చేతులతో వీడ్కోలు చెబుతున్నాడు ఉదయసూర్యుడు. ఆకాశం రంగుల కలనేత జరీచీరలా వుంది. కదులుతున్న పిట్టమబ్బులు కన్నెపిల్ల తల వెంట్రుకల్లా అల్లరిగా ఎగురుతున్నాయి. నిద్రలేచిన పక్షులు... తీపి కలల్ని మంచుబిందువుల్లా విదిలిస్తున్న పువ్వులు.. దేవాలయంలో ప్రణవం పలుకుతున్న జేగంటలు. పయ్యెదచాటున పాలుపడుతూ పసివాడికి లాలిపాడే కన్నతల్లులు.... ఆ ఉదయం ముగ్ధమనోహరంగా వుంది. మురిపించే, మరిపించే వర్ణచిత్రంలా వుంది.

ఆ చిత్రానికి నేపథ్య సంగీతంలా వుంది చంద్రిక చదువుతున్న వేంకటేశ్వర సుప్రభాతం. "కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యమ్ దైవమాహ్నికమ్"

అంతవరకూ సగం నిద్రలో, సగం మెళకువలో, చంద్రికను గురించి కలలు కంటూ, కలలు చెరిగిపోతే కలవరపడుతూ, మంచంమీద మూడంకెలో వున్న ఇరవైఏళ్ళ రవి, వీణలా సాగుతున్న చంద్రిక స్వరం, తన అంతరంగంలోని ప్రేమతంత్రుల్ని లలితలలితంగా స్పర్శించగానే, ఒక్కసారిగా లేవబోయాడు, కళ్ళుతెరవబోయాడు.

కానీ తన దినచర్యలోని మొదటి ఘట్టం స్ఫురణకు వచ్చి కళ్ళు తెరవకుండానే మంచంమీదనుంచి లేచి కిందకు దిగాడు. గత కొద్ది మాసాలుగా అది అలవాటుగా చేస్తున్న కార్యక్రమమే అయినందున తడుముకోకుండానే కిటికీదాకా నడిచాడు. కిటికీ రెక్కలు తడిమి వాటిని బార్లా తెరిచాడు. వెలుగు వెల్లువలా వచ్చింది లోపలకు.

ఆ వెలుగు వరదలో ఎదురింటి అంతర్భాగంలో, కుడివైపున ఉన్న పూజ గదిలో దేవుడిముందు పద్మాసనంలో కూచుని ముకుళిత హస్తాలతో సుప్రభాతం చదువుతున్న చంద్రిక కనిపించింది. ఆమె వదనబింబం మీద సూర్యకళ బంగారు వర్ణంలో చకచ్చకిత మౌతోంది. అప్పుడే విచ్చుకున్న పద్మంలా ఉన్న దామె. తలారా స్నానంచేసిం తర్వాత ఆరబెట్టుకున్న నల్లని పొడైన జుట్టు అల్లి వల్లన గాలికి ఎగురుతోంది. నొసటి మధ్యగా జ్వాలగా కుంకుమ తిలకం. కొనతేలిన నాసిక, ముక్కున మెరిసే ఎర్రని పుడక. పల్చటి పెదాలు గులాబి రంగులో ఉంది, మూసుకున్న కళ్ళకు మెల్లని సుస్వరంతో సుప్రభాతార్థాన్ని వినిపిస్తున్నాయి. బుజాలచుట్టూ తిప్పుకున్న పమిటచెంగు, అచ్ఛమైన పవిత్రతకు రూపకల్పనగా కనిపిస్తున్నదా పదారేళ్ళు దాటిన పడుచుపిల్ల.

"గుడ్ మార్నింగ్ మై డియర్!" కిటికీ ఊచలనుపట్టుకుని, ఊచల సందుల గుండా కనిపిస్తున్న ఆ ఎదురింటి అమ్మాయిని చూస్తూ తన్మయీభావంతో అన్నాడు రవి. వీధికి అటువైపున ఉన్న ఆ ఇంట్లో అల్లంత దూరంలో, తన ధ్యానంలో తామున్న ఆ పడుచుపిల్లకు ఆ ప్రేమపూజారి పలకరింపు వినబడలేదు. ఆమె కనులు తెరవలేదు. అయినా అతనికి కించలేదు. ఆమె చూడకపోతే ఏం తన ప్రేమ ఇంతవరకూ వన్ వే గానే నడిస్తే మాత్రం ఏం? తానొక నిరంతర ఆశావాది. ఒకనాడు తన ప్రేమ లత పుష్పిస్తుంది. చంద్రిక తనను తన ఎదకు హత్తుకుంటుంది. ఆ ఘడియ రాక తప్పదు. తన కోర్కె తీరక తప్పదు." అతను అందంగా నవ్వుకుంటూ, ఈలగా పాడుకుంటూ, రెండేసి మెట్లు చొప్పన గెంతుతూ కిందకు దిగిపోయాడు.

రవి ఇక్కడ తన ప్రేమపూజలో తానున్న సమయంలోనే, రెండు వీధుల అవతల మరొక యువకుడు తామూ కళ్ళు తెరవకుండా తన ప్రియురాండ్ర పేర్లను ఒక్కటొక్కటిగా తల్చుకుంటూ, కళ్ళు మూసుకునే వాళ్ళ ఫోటోలను ఒక్కొక్కటిగా తడుముకుంటూ తెలుసుకుంటూ అక్కరలేని వాటిని అవతల పెట్టేస్తున్నాడు.

"హలో లిల్లీ! యూ సిల్లీ! ఇవ్వాళ నీ టర్న్ కాదే బుల్ బుల్! టేక్ రెస్ట్ ఇన్ సైడ్!" అంటూ ఆ ఫొటోను దిండు కిందకు నెట్టేశాడు.

మరో ఫోటో అతని చేతుల్లో, "హలో గ్రేస్! గ్రేస్ కెల్లీ అనుకోక గద్దముక్కు దానా!పీపక్కన తిరిగితే అదో డిస్ గ్రేస్!" గ్రేస్ ఫోటో వెనక్కు వెళ్ళిపోయింది.

మూడో ఫొటోను స్పృశిస్తూ అన్నాడు. "వసంతా! ఒకప్పటి నా వసంతానివి! ఇప్పుడో...! పెదవి విరిచాడు.

"గ్రీష్మానివి! నువ్వూ వద్దు" ఫొటోను కిందకు జార్చేశాడు.

నాలుగో ఫొటోలో మల్లిక, అయిదో ఫొటోలో శారిక కూడా అవతలకు తప్పుకున్నారు.

ఆరో ఫొటోలో ఏ బొమ్మా లేదు. ఖాళీ ఫ్రేం. "ఎమ్టీ ఫ్రేమా." పకపక నవ్వాడు. "అయితే ఏం, గోల్డెన్ ఫ్రేం! చంద్రికా, పౌర్ణమి శరత్ కౌముది సారికా, రా, ఈ ఫొటో ఫ్రేములోకి, నా గుండెలోకి!" అంటూ ఆ ఫ్రేమును గుండెలకు హత్తుకున్నాడు. 'చంద్రికా, చంద్రికా' అంటూ గాలిలోనే ముద్దుపెట్టుకున్నాడు.

అప్పుడు ట్రేలో కాఫీ తెచ్చిన ముసలి బట్లర్ ముద్దుల్లో మునకలేస్తున్న అనంతనాగ్‌ను చూస్తూ అయోమయంగా అడిగాడు. "ఎవరికి బాబూ ఆ ముద్దులు?"

"టు మై డార్లింగ్!" కళ్ళు తెరిచాడు నాగ్. రాత్రి తాగిన బ్రాందీ జీర అతని కళ్ళల్లో హాంగోవర్ భారం అతని గొంతులో.

"నంబరెంత బాబూ?"

"యూ ఫూల్!" నాగ్ అరచి కొట్టబోయాడు. ముసలి బట్లర్ పక్కకు తప్పుకుని "ఆడదాన్తో ఆడుకోకండి బాబూ, అది అగ్గి నిప్పు!" అంటూ ఖాళీ కప్పును ట్రేలో పెట్టుకుని, మొహం చిట్లిస్తూ అవతలకి వెళ్ళిపోయాడు.

"యూ ఓల్డ్ బ్లాగర్డ్! ముసిలోడివి, కుర్రతనం హుషారు ఎప్పుడో మర్చిపోయినవాడివి, వంట గదిలో వంకాయకూర చెయ్యక, ఏ కెందుకురా నీతిబోధ!" అంటూ అరుస్తూ, బ్రష్‌మీద టూత్‌పేస్టు వేసుకుని బాత్‌రూంలోకి నడిచాడు. నడుస్తూ నడుస్తూ టేప్‌రికార్డరు స్విచ్ నొక్కాడు. "లే.... లే.... లే.... నా రాజా, లేనమంటావా, నిద్దుర లేవనంటావా!" ఎల్లారీశ్వరి గొంతులో సెక్సు వొళ్లు విరుస్తోంది. ఆ విరుపులకు దరువు లేస్తూ అనంతనాగ్ నీళ్ళగదిలో చిందులు తొక్కుతున్నాడు.

## 2

"డాడీ! నే కాలేజీకి వెళ్తున్నా!" మేడ మెట్లు దిగివస్తూ తండ్రితో అన్నది చంద్రిక. గోడగడియారంలో తొమ్మిదిన్నరకల్లా ఓ ఆడపక్షి బొమ్మ బయటికి వచ్చి కుహూ అంటూ కూతకూసి మళ్ళీ లోపలికి వెళ్ళింది. హాల్లో మధ్యగా వున్న గాజుతొట్టిలో రంగురంగుల చేపపిల్లలు హాయిగా తిరుగుతున్నాయి. అటూ యిటూ. గోడలమీద దేవుళ్ళ పటాలూ, రాజకీయ నాయకుల పటాలూ, ఫామిలీ గ్రూపుఫోటోలు కలగాపులగంగా కలిసిపోయి కనిపిస్తున్నాయి. పేము కుర్చీలు కొద్దిగా మాసిపోయి వున్నాయి, కాళ్ళ కింది తివాచీ రవంత దుమ్ముగా వుంది. మెట్ల వరుసలో కింది మెట్టుకు ఎడమచేతి దూరంలో ఫోనుదగ్గర నిలబడి వున్నాడు వరహాలు.

"అవునయ్యా, ఓడిపోయిన ఎమ్మెల్లేనే! అయితే ఏందంట? నా ప్రిస్టేజికేం లోపం వొచ్చిందంట నా నోడిపోతే?.... నానేమో అమ్మబొమ్మ ముందెట్టు కూరేగినాను, గెల్చినాదేమో జన్మబొమ్మ సద్దం పెట్టుకుని అడుక్కున్నాడు. నామా, పానకాలూ కాదహే ఇక్కడ ముక్యం? అన్నా–అమ్మా మద్దెన ఎవ్వరు కావాలో తేల్చుకోండి పెజలారా అని అడిగినారు. మా కన్నే కావాలన్నారు తెల్వి మీరిపోయిన తెనుగు పెజలు. అందుచేత నానేటంటున్నానంటే...." అంటూ మాట్లాడుతున్న అతని వాక్ప్రవాహాన్ని కట్‌చేస్తూ అన్నది చంద్రిక మళ్ళీ. "డాడీ, నే కాలేజీ కెళ్తున్నా!"

"ఏ కార్లో ఎళ్తుండావ్?–"

"కాలేజీ కెళ్తూ కారెందుకూ– అక్కడందరూ నావేపే చూసి కళ్ళలో నిప్పులు పోసుకోడానికా?....హాయిగా రెండుకాళ్ళ వాహనం మీద వెళ్తా!"

"సర్.... సర్... కారొద్దు సర్.... ఇట్టాగే సింపుల్‌గా నేతసీర మట్టుకుని, నగానట్రా నేకుండా ఎళిపోయొచ్చే స్తవా!"

"నే వెళ్తున్నది చదువుకోడానికి డాడీ, ఫాషన్ పెరేడుకు కాదు!" చంద్రిక విస విసా బయటకు నడిచింది. వెళ్తున్న కూతురువంక చూస్తూ, భార్యతో అన్నాడు వరహాలు.

"ఆట్టావుంది నీ పెంపకం!" భర్త మాటలకు సమాధానం చెప్పకుండా నవ్వే సమాధానంగా ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

"సదూకోడానికేలేవే పెంద్రీ, నాను కావన్లేదు. కాపీ కనీసం సైకిలన్నా ఏసుకెళ్ళు. ఏసాని కిచ్చినంతిలున మన వోటర్లు సింపుల్‌సిటీ కిరే!"

చంద్రిక వరండాలోనుంచి గరుడ వర్ధ్వంలా కనిపిస్తోంది. లోపల్నుంచి వరహాలు ఈ మాటల్ని పెద్దగా అన్నాడు. "అట్లాగే!" అన్నట్టుగా తలవూపింది. హంబర్ సైకిలు స్టాండులోంచి తీసి, బెల్లు వాయించుకుంటూ గేటుదాకా నడిపించింది.

ఎదురింట్లో, డైనింగ్‌హాల్లో అప్పుడే బ్రేక్‌పాస్ట్ తీసుకొంటున్నాడు రవి. డైనింగ్ టేబిలుకు చెరోవైపునా పానకాలూ, లక్ష్మమ్మా కూచుని ఎవరికిష్టమైన విషయాలమీద వాళ్ళు కామెంట్స్ పాస్ చేస్తూ, మధ్యమధ్యలో కాఫీ సిప్‌చేస్తున్నారు. కారప్పొడిలో ఇడ్లీ అద్దుకుని తింటూ రవి అన్నాడు. "నాన్నారూ, ఓ జోక్ చెప్పనా?"

"చెప్పవోయ్. జోకులమీద మా పార్టీ కంట్రోల్ళు పెట్టదు!" అన్నాడు పానకాలు

"మీలాంటివాళ్ళు గెలవడమే ఓ పెద్ద జోకు. ఇంకా కంట్రోళ్ళు కూడానా!" శ్రీలక్ష్మమ్మ వో బాణం విసిరింది.

"ఏవిటోయ్ అపోజిషన్ లీడర్‌లాగా ఆ ఎటాక్కు? మా పార్టీ గెలవడం




ప్రపంచ చరిత్రలోనే వో పెద్ద వండర్! నీకేం తెలుసు ఆడదానివి, వంటఇంటి కుందేలువు!"

"మా ఆడవాళ్ళేనండీ మీ లీడర్ని, మిమ్మల్ని ఈసారి గెలిపించిందీ! చెట్టు పేరు చెప్పుకు కాయలమ్ముకునే వాళ్ళని చూసి కోపంవచ్చి, అమ్మబొమ్మ వవతల పెట్టి అన్నబొమ్మకు హారతులెత్తిందీ! ఈ మాత్రం కూడా తెలీకుండా మీలాంటి వాళ్ళంతా యం.యల్.ఏలు అయిపోయారు అదీ జోకంటే. .." శ్రీలక్ష్మమ్మ అన్నమంది. పానకాలు కోపంగా మొహం ముడుచుకున్నాడు.

"అమ్మా!" రవి అడ్డుకున్నాడు. "మొన్న ఏం జరిగిందో తెలుసా! మీరూ నాన్నారూ హైదరాబాదు వెళ్ళలేదూ- అప్పుడూ నేను మా ఫ్రెండ్సూ ఓ హోటలుకు వెళ్ళాం డిన్నర్‌కు. మర్నాడు మధ్యాహ్నం కూడా అదే హోటల్‌కు వెళ్ళాం లంచ్‌కు. క్రితంరాత్రి పెట్టినవే మళ్ళీ వడ్డించాడు సర్వర్. ఏమిటోయ్ ఇదంటే 'సార్! ఇక్కడ పదార్థాలు మారవు. మనుషులే మారతారు' అంటూ జోకేయడం!"

పానకాలు నవ్వేశాడు. శ్రీలక్ష్మమ్మ మాత్రం నవ్వకుండా సీరియస్‌గా అన్నది. "కానీ మనింట్లో మనుషులూ మారరు, వాళ్ళ మనస్తత్వాలూ మారవు, వాళ్ళ మాటలూ మారవు. అది గుర్తుంచుకో!"

"వెల్ సెడ్!" అంటున్న రవికి సైకిలు బెల్లు వినిపించింది. ఒక్కసారి వొళ్ళు ఝల్లుమనిపించింది. తింటూ తింటున్న ఇడ్లీని ప్లేటులోనే వదిలేసి 'అదేమిట్రా!' అంటున్న తల్లి మాటను పట్టించుకోకుండా ప్లేటులోనే చెయ్యి కడిగేసుకున్నాడు. కళ్ళు చికిలించుకొని తనవేపే చూస్తున్న తండ్రితో అన్నాడు. "చూశారా నాన్నారూ మాటల్లో ఎంతాలస్యం అయిపోయిందో! ఫస్టవరే ప్రాక్టికల్ క్లాసు. ఇప్పుడు చూరడం పడకపోతే, సాయంకాలం దాకా ఒకటే బోరు .."

"ప్రాక్టికల్‌గా చూడడం ఎప్పుడో!"

"అదేనండీ. చెయ్యడం. ప్రాక్టీస్ చెయ్యడం...." రవి హడావిడిగా బయటకు వెళ్ళిపోయాడు నోట్ బుక్ తీసుకుని.

వెళ్తున్న కొడుకువంక గర్వంగా చూస్తూ అన్నాడు పానకాలు. "అంతా నా పోలికే! అ పట్టుదల. అ తొందర...."

"తొందరవరకూ అయితే పరవాలేదు. తొందరపాటే పనికిరాదు!"

"ఆ భయమేం నీకక్కర్లేదు. నాకు వాడిసంగతి బాగా తెలుసు. సామాన్యంగా వాడో నిర్ణయానికి రాడు. వచ్చింతర్వాత ఆరునూరైనా సరే, ఇహ వెనకడుగు వెయ్యడు."

"అదేనండీ నా భయం! ఏ విషయానికైనా పట్టూ విడుపూ వుండాలి. అవే మనవాడిలో లేవు." ఇంతలో ఫోను మోగింది బయట మన్న కాలింగ్‌బెల్ మోగింది యం. యల్. ఏ గారూ యం.యల్.ఏ పానకాలుగారూ!" అంటూ కొన్ని కొత్తగొంతులు పెద్దగా పిలిచాయి. పానకాలు శ్రీలక్ష్మమ్మల సంభాషణకు అంతరాయం కలిగింది. పానకాలు తన ఆఫీసుగదిలోకి నడిచాడు. అయన ఆఫీసుగదిలోకి వచ్చి చూసేసరికే రవి కారు స్టార్టుచేసి బయలుదేరబోతున్నాడు.

"జడ్పీ ఛైర్మన్ దగ్గరకు వెళ్ళాలి, ఆ తర్వాత కలెక్టరు దగ్గరకు వెళ్లాలి. అయన్తో పనయింతర్వాత మునిసిపల్ కమిషనరును కలుసుకోవాలి. వీటన్నింటికి నాకు కారు కావాల్రా! యంయల్ఏ నడిచివెళ్తే రోడ్డుమీద బతకనియ్యర్రా!"

"మీరు బతకాల్సింది మీ వోటర్ల మధ్యనే నాన్నారూ! ఆఫీషియల్స్‌ని డిస్టర్బ్ చెయ్యొద్దని మీ లీడర్ చెప్పలేదు!" కారును బయటకు ఒక్కదూకు దూకించాడు రవి.

రోడ్డు మీద కొంచెం దూరంలో మల్లిక ఇంటిముందు సైకిలాపి, ఒక కాలును నేలమీద ఆపి విలాసంగా ముందుని బెల్లును కొంచెంగా అదేపనిగా మోగిస్తున్న చంద్రిక అతని దృష్టిపథంలోకి వచ్చింది. అతనూ ఒకటి రెండు సార్లు హారను మోగించాడు. 'కలుసుకోగలిగాను చూశావా నిన్ను నేను!' అన్నట్టుగా. చంద్రిక అతనిని అంతగా పట్టించుకోలేదు కారు చంద్రికను దాటి ముందుకు వెళ్ళిపోయింది. మెల్లగా పత్తనడక నడవడం మొదలెట్టింది.

"హాయ్ చంద్రీ — వస్తున్నా ఉండు— అట్లా బెల్లు వాయించకు తల్లీ!" లోపల్నుంచి మల్లిక కేకేసింది జవాబుగా.

కారు అద్దంలో రీర్-వ్యూ కనిపిస్తోంది. చంద్రికా — మల్లికా మాట్లాడుకొంటున్న దృశ్యం. ఏదో జోక్‌కు ఇద్దరూ పగలబడి నవ్వుకొంటున్నారు. రెండుసైకిళ్ళూ ఒకదాని ప్రక్కన మరొకటి వస్తున్నాయి. ఇద్దరి ఆడపిల్లల సుమలేత పాదాలూ పెడల్సు తొక్కి

కందిపోతున్నాయి. కదులుతున్న జడలు, ఊగుతున్న పిరుదులు, కొద్దిగా ముందుకు వంగిన బుజాలు, అప్పుడప్పుడు గాలికి ఎగిరే పయ్యెదలు వెనకనుంచి వస్తున్న వాళ్ళకు అహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. ముందునుంచి చూస్తే స్వేదబిందువులతో కొద్దిగా అలసిన మొహాలు. పయ్యెద విలువని ఎదఎత్తులు, శబ్దించే గాజులు, ఊగే నడుము, కదిలే కాళ్ళు చూపుల్లో మత్తును నింపుతున్నాయి. వెనకనే మోటారుసైకిలుమీద వస్తున్న అనంత నాగ్ వాళ్ళను వెనకనుంచి చూస్తున్నాడు. కారులో డ్రైవింగ్‌సీట్లో కూడుని రవి వాళ్ళను ముందునుంచి చూస్తున్నాడు. ముందు వెనకల నుంచి ఎటునుంచి చూసినా వాళ్ళు వెలుగురేకల్లా ఉన్నారు.

మల్లిక అంటున్నది చంద్రికతో "అయితే ప్రేమా గీమా నై జాన్తా అంటావ్?"

చంద్రిక జవాబిచ్చింది. "దట్స్ రైట్! నీ విషయం ఏమిటి?"

"ఇంట్లో పెళ్ళో పెళ్ళో అని చంపుతున్నారు!"

"ఆ తర్వాత పిల్లలో పిల్లలో అని అఘోరించు!"

మల్లిక మొహం ఎర్రనైంది. "పోవే అందులోవున్న హాయి నీకేం తెలుసు!"

"వ్వాట్! పెళ్ళిలోనా......పిల్లల్ని కనడంలోనా?"

"రెండింటిలోనూ!" మల్లిక సిగ్గు సిగ్గుగా అన్నది. "కోరినవాణ్ని కట్టుకోడంలో ఓ హాయి ఉన్నది. కన్నవాణ్ణి గుండెలకు హత్తుకోడంలో ఓ సంతృప్తి ఉంది!"

"అమ్మా ముసలాపసానీ! అట్లా మాట్లాడకు. నాకు చిర్రెత్తుకొస్తుంది. అయినా మూడుముళ్ళ మీద అంత మనసున్నదానివి, ఇంట్లో పెళ్ళో పెళ్ళో అని చంపుతున్నారంటావేం! హాయిగా చేసుకోక!"

"అదికాదే చంద్రీ! సంబంధం సెటిలై పోయింది కదా వెంటనే చేసేసుకుంటే పోలా అంటారు వాళ్ళు! కనీసం సమ్మర్ వెకేషన్ దాకానైనా పోస్టుపోన్ చేయిద్దామని నా ప్రయత్నం!"

"మళ్ళీ అదేం తిక్కా?"

"మీ అందరి ఎసోసియేషన్, ఈ కాలేజి లైఫ్ వదిలివెళ్ళాలంటే బాధ కదుటే!"

"కొయ్యకు. నీకు పెళ్ళిమీద మనసు, నాకు చదువుమీద ఆశ.... ఇద్దరం ఫ్రాంక్‌గా మాట్లాడుకుందాం! నువ్వు వెంటనే పెళ్ళిచేసేసుకో."

"నువ్వేమో ముసలిదానివైపొయ్యే దాకా అట్లాగే చదువుకొంటూ ఉండు. ప్రేమా_ పెళ్ళి వీటికి దూరంగా ఉండు. అవునా?"

"ప్రేమకూ నాకూ ఆమడ దూరం. ఇహ పెళ్ళంటావా, చదువంతా అయిపోయింతర్వాత నా మనసుకు వచ్చిన వాణ్ని, పెద్దలు మెచ్చినవాణ్ని పెళ్ళిచేసుకుంటాను."

"చూద్దాంగా!"

"చూద్దాంగా!"

ఇద్దరూ గబగబా తొక్కి కారుదాటి పోయారు. పోతూపోతూ అనుకున్నారు.

"ఇతనెందుకే ఇంత మెల్లగా కారు డ్రైవ్‌చేస్తున్నారూ!"

"పాపం నేర్చుకుంటున్నాడేమోనే!"

"అదేంలేదు, బాగానే వొచ్చు "వెనక నుంచి వచ్చే మనం ఆ అద్దంలో కని పిస్తాం కదూ, అందుకని ఆ స్లో డ్రైవింగ్!"

"ఏవిటి కథ? నీ మీద అతగాడి కేమైనా లవ్వూ–గివ్వూ "

"లవ్వూ గివ్వూ అంటే గూబ గుయ్ మంటుంది సైకిలు సరిగా తొక్కు!"

"అదేమిటే పాపం, మీ ఎదురింటి అబ్బాయ్ కదూ అతను! వాళ్ళ నాన్న మీ నాన్నగారిమీద మొన్నటి ఎలక్షన్లలో గెల్చాడనుకుంటాను!"

"ఎదురింటి కుర్రాడైతే నాకేం? వాళ్ళ నాన్న ఎన్నికల్లో గెలిస్తే నాకేం? నా దారి వేరు"

దారి వేరని చంద్రిక ఇంకా మాట పూర్తిచెయ్యకముందే, వెనకనే వస్తున్న అనంత్‌నాగ్ మోటారుసైకిలు రవి కారును తప్పించుకుని ఆడపిల్లల సైకిళ్ళను ఓవర్‌టేక్ చేసే ప్రయత్నంలో, ఓ సైకిలును డాష్‌కొట్టాడు. చంద్రిక కింద పడిపోయింది.

"ఐ యామ్ సారీ టెరిబ్లీ సారీ!" మోటారుసైకిలుమీదనుంచి ఒక్క దూకు దూకి పడిపోయిన తన మోటారుసైకిలును గురించి పట్టించుకోకుండా చంద్రిక దగ్గరకు వచ్చి ఆమెకు చేయందించటానికి ప్రయత్నం చేస్తూ అనంతనాగ్ సిన్సియర్‌గా తన విచారాన్ని ప్రకటిస్తున్నాడు.

జరిగిందంతా కారులోనుంచి చూస్తున్న రవికి వల్లమాలిన కోపం వచ్చింది. కారులోనుంచి ఆవేశంతో కిందకు దిగివచ్చి, అనంతనాగ్ చొక్కా పట్టుకున్నాడు.

"యూ ఫూల్! కావాలని ఆ అమ్మాయి సైకిలుకు డాష్ ఇస్తావురా!"

"డోన్‌టాక్ రబిష్! ఇట్ ఈజ్ జస్ట్ ఏన్ యాక్సిడెంట్. ఐ యామ్ సో సారీ!" మాటలు పెరిగాయి. చేతులు కలిశాయి పెదవులు వణికాయి. కళ్లు ఎరుపెక్కాయి. అప్పటికి చంద్రిక లేచి నిలబడింది. మల్లిక అందించిన చేయినందుకుని చీర అంచుల్ని దులుపుతుంది. తన కోసం దెబ్బలాడుకుంటున్న ఆ ఇద్దరు యువకుల్ని చూసి జాలిగా నవ్వుకుంది. 'మేల్ షివల్రీ!' అనుకుంది తనలో తాను ఇద్దరిమధ్యకూ వచ్చి నిలబడి ఎవరికి చెప్పవలసిన మాటలు వాళ్ళకు చెప్పి ఇద్దర్నీ సర్దుబాటు చేయించింది. ఇద్దరికీ షేక్‌హాండ్ ఇప్పించింది మళ్ళీ కారూ, మోటారుసైకిలూ, సైకిళ్ళూ ముందుకు కాలేజీలోకి కదిలాయి.

కాలేజీ అంతా హడావిడిగా వుంది. పెళ్ళివారిల్లులా కళకళలాడుతోంది. రైల్వే ప్లాట్‌ఫారంలా సందడిగా వుంది. గూడెం సంతలా రద్దీగా వుంది కాలేజీ నోటీసు బోర్డుముందు మరింతగా గుంపు. లేడీస్ వెయిటింగ్ హాలుముందు మరో బోర్డు. ఆ బోర్డుముందు ఆసక్తిగా నోటీసు చదువుతున్న ఆడపిల్లలు

"స్పోర్ట్స్‌డేకి ఈసారి స్పెషల్ ఎట్రాక్షన్ - టెన్నిస్ మిక్స్‌డ్ డబుల్స్ పోటీలు!"

ఓ స్టూడెంటు అరిచాడు

"గురూ! గురూ! ఈసారి ఆరు మార్లైనా సరే నువ్వు పోటీ చేసితీరాలి" అనంతనాగ్‌ను అతని వత్తాసుదారుడొకడు ఎంకరేజ్ చేస్తున్నాడు. అనంతనాగ్ కాలరు సర్దుకున్నాడు. "కంపీట్ చేస్తానరేనోయ్ - నాకు పార్ట్‌నర్ ఎవరని!"

"బిల్లీ, గ్రేస్, శుభ, కారిక, చంద్రిక నీకోసం ఎవరైనా క్యూలో నిలబడతారు గురూ!"

వీళ్ళ గ్రూపు ఇట్లా మాట్లాడకుంటుంటే అవతల మరో గ్రూపు రవిని ఎంకరేజ్ చేస్తోంది. "బ్రదర్! యూ ఆర్ ఆల్‌వేస్ ఎ ఛాంపియన్. పేరిచ్చేయ్!" రవి దూరంగా నిలబడివున్న చంద్రిక వేపు చూశాడు. అనుకోకుండా అప్పుడే చంద్రిక కూడా ఇటు చూసింది. తన వేపే తదేకంగా చూస్తున్న రవి! ఎందుకట్లా అతనట్లా తనవేపు గుచ్చిగుచ్చి చూస్తాడూ? చంద్రికకు తవంత సిగ్గు వేసింది. ఆమె చూపులు మెల్లగా కిందికి వాలిపోయాయి.

చంద్రిక పక్కనే నిలబడ్డ ఆమె స్నేహితురాండ్రు ఆమె గడ్డం పుచ్చుకుని బతిమిలాడసాగారు. "పేరియ్యవే చంద్రీ! యూ ఆర్ ఎ బ్రేవ్ గర్ల్!"

"ఏం నే వొక్కదాన్నే ఎందుకియ్యాలి!" చంద్రిక మూతి మూడు వంకర్లు తిప్పింది.

"పోనీ మల్లిక కూడా ఇస్తుందిలేవే!"

"నేనా!" మల్లిక భయంతో వణికింది. "నాకు బ్యాట్ పుచ్చుకోడమే రాదు!"

"అవునవును. ఇంట్లో వంటగరిటె పుచ్చుకోడమే నీకు చాతనవును!" పక్కనున్న మరోపిల్ల ఎకసెక్కమాడింది

వాళ్ళ మధ్యనుంచి శుభ దూసుకు వచ్చింది. "నేను ఇస్తున్నాను నా పేరు!"

"నేనూ ఇస్తున్నాను నా పేరు!" గ్రేస్ గ్రేస్‌ఫుల్‌గా అన్నది.

ఆ విధంగా పేర్లిచ్చే ఆడవాళ్ళ లిస్టు తయారైంది. ఆడవాళ్ళ లిస్టు తయారైందని తెలిసి మగపిల్లలు కాలు నిలదొక్కుకోలేకపోయారు. తమలో తాము తలపట్లు పట్టుకుని ఆటగాళ్ళ లిస్టునొదాన్ని ఫైనలైజ్ చేసుకున్నారు.

(సశేషం)

# పక్కింటి పిన్నిగారు

"ఏవండోయ్ ... మీకీ విషయం తెలుసా?" అడిగింది మా శ్రీమతి నేను యింట్లోకి అడుగుపెట్టగానే. ఏమిటన్నట్లు చూశాను.

"ఆ మేడమీది మేస్టారి ప్రవర్తన మంచిదికాదుట" అంది కాఫీ కలుపుతూ.

"ఓస్ యింతేకదా! మూడో ప్రపంచ యుద్ధం వచ్చిందన్నంత కంగారుపడ్డాను" అన్నాడు అక్కడున్న సోఫాలో కూర్చుంటూ.

"ఆ తాసిల్దారుగారి అమ్మాయిని వల్లో వేసుకుని రోజూ రూమ్‌కి రప్పించుకుంటున్నాట్ట!" కాఫీ అందిస్తూ 'కంటిన్యూ' చేసింది తన ధోరణిలో.

"ఇంతకీ నీకీ వార్త ఎవరు చెప్పారు?"

"మన పక్కింటి పిన్నిగారు"

"ఆవిడకి మొగుడు పోయినదగ్గర నుంచీ యిలాంటి విషయాలంటే తెగ మోజువస్తోంది పాపం!" అన్నాడు కాఫీ గ్లాసు టీపాయ్‌మీద ఉంచుతూ.

"వాల్లేండి. ఆమె వింటుంది" అనేసి ఖాళీ గ్లాసు అందుకుని లోపలికెళ్ళిపోయింది మా శ్రీమతి.

ఆడవాళ్ళకి ప్రేమ వ్యవహారాల గురించి వినడం అన్నా చెప్పడం అన్నా మహా సరదా కాబోలు' అనుకున్నాను. ఆ మాటకొస్తే ఎవరికి మాత్రం యిష్టం ఉండదు? అసలా ప్రేమ అనే రెండక్షరాల్లో ఉంది నిజమైన, అసలు సిసలైన 'కిక్కు!'

ఆ మేడమీది మాస్టారిగా పిలవబడే మాధవరావుగారు ఆ రూమ్‌లో దిగి దాదాపు ఐదేళ్ళవుతుంది. అతను గురించి యిలా వినడం యిదే మొదటిసారి. అసలాయన రూమ్‌లో ఉన్నారో లేరో ఎవరికీ తెలిసేది కాదు ఒక్క ముక్కలో చెప్పాలంటే మా వీధిలో ఉన్న బహు కొద్ది మంచివారిలో ఆయనొకరు!

అలాంటి వ్యక్తి తన క్రింద వాటాలో ఉన్న తాసిల్దారుగారి అమ్మాయితో వ్యవహారం నడపడం.... అది కొత్త బజార్న పడడం.. నాకు నిజంగా బాధనిపించింది. ఇందులో అసలు నిజమెంతో తెలుసుకుందామనిపించింది.

మరో వారం రోజుల తరువాత ఓ సాయంత్రం... ఆ మేస్టారు హోటల్‌లో కన్పించారు కాఫీతాగుతూ. ఆయనపక్క సీటు ఖాళీగానే ఉంది. 'ఇంతకంటే మంచి అవకాశం రాదు' అనుకుంటూ నేనా పక్క సీట్లో కూర్చున్నాను. ఆయన నన్ను చూసి పలకరింపుగా నవ్వారు.

"కాలేజీనుండేనా రావడం" అడిగాను.

"ఔనండీ."

**కిల్లాన మోహన్‌బాబు**

ఈలోగా సర్వర్ రావడం నేను కాఫీ ఆర్డరివ్వడం జరిగాయి. సంభాషణ ఎలా మొదలెట్టాలో అర్థంకావడంలేదు నాకు.

"సిలబస్లు అయిపోయాయండీ!" అంటూ కదిపాను. ఇది చచ్చు ప్రశ్నేమో నని నాకే అన్పించింది.

"సిలబస్ అయినా అవకపోయినా 'పరీక్షల బస్' ఆగదు కదండీ" అన్నా రాయన నవ్వుతూ.

మంచి 'సెన్సాఫ్ హ్యూమర్' ఉన్న వ్యక్తి కాబట్టే ఆ అమ్మాయి పడింది మరి అనుకున్నాను.

ఈలోగా కాఫీ రావడం.... నేను తాగడం జరిగాయి.

'పదండి పోదాం' అంటూ లేచా రాయన. ఎంత వద్దంటున్నా వినకుండా యిద్దరి బిల్లూ అతనే చెల్లించాడు.

సినిమాల గురించీ, విద్యార్థుల క్రమ శిక్షణారాహిత్యం గురించీ, నేటి రాజ కీయాలగురించీ అతను అనర్గళంగా మాట్లా డారు. అన్ని విషయాల గురించి అవ గాహన ఉన్న మనిషి' అన్పించింది నాకు.

ఇంతలో అతనుండే పోర్షన్ వచ్చింది.

"మీకేం పనిలేకపోతే రండి. కాసేపు రూమ్లో కూర్చుని వెళ్దురుగాని" అన్నారు మేస్టారు.

"పదండి" అంటూ ఆయన వెనకాలే వెళ్లెళ్ళాను.

ఆయన రూమ్ చాలా బావుంది. బ్రహ్మచారి గది అయినా.... ఎంతో అందంగా అలంకరించబడి ఉంది. ఏ వస్తువు ఎక్కడ ఉండాలో అక్కడే ఉంది. టేబిల్మీద ఉన్న ఆపిల్ని ముక్కలుకోసి ప్లేటులోసర్ది నా ముం దుంచారాయన.

"ఎందుకండీ యివన్నీ. ఇప్పుడేగా కాఫీ తాగాం" అన్నాడు మొహమాటంగా.

"ఫర్వాలేదు. తీసుకోండి. మొదటి సారిగా యిక్కడికొచ్చారు కదా. ఈలోగా నేను మొహం కడుక్కొని వస్తాను" అనేసి టవల్ అందుకుని బాత్రూమ్కి వెళ్లారు. వర్దు లేకుండా ఆయన మరీ బావున్నట్లు అనిపించింది నాకు.

రెండు ఆపిల్ ముక్కలు తిని...... అక్కడే టీపాయ్మీదున్న వీక్లీ తీసా న్నేను పేజీలు తిరగేస్తుండగా 'సడెన్'గా ఆ పుస్తకంలోంచి ఓ ఫోటో క్రింద పడింది. తీసి మళ్ళీ ఆ పుస్తకంలో ఆ ఫోటో ఉంచబోతుండగా నా దృష్టి అను కోకుండా ఆ ఫోటోలోని వ్యక్తిపై పడింది. మరెవరో కాదు. తాసీల్దారుగారి అమ్మాయి హిమబిందు!

నా అనుమానం బలపడింది!

ఇంతలో మేస్టారు మొహం తుడుచు కుంటూ లోనికొచ్చారు. నా చేతిలో ఆ ఫోటో చూసి కంగారుపడినట్లు కని పించారు.

"పాకీ ఉదయమే ఆ అమ్మాయి వచ్చి యీ ఫోటో యిచ్చి వెళ్ళింది. కాలేజీకి టైం కావడంతో అది అక్కడే అలా ఉంచేసి వెళ్ళిపోయాను" అంటూ నా చేతి లోవి ఆ ఫోటో తీసుకున్నారాయన.

ఈ అవకాశం జారవిడుచుకోవడం నా కిష్టంలేదు.

"అయితే అందరూ అనుకునేది నిజమే నన్నమాట" అన్నాను నవ్వుతూ.

చాల యిబ్బందిగా మొహం పెట్టా రాయన.

"సినిమా భాషలో చెప్పాలంటే మే మిద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం. ప్రాణానికి ప్రాణంగా, ఒకరికొకరుగా, తోడునీడగా జీవితాంతం కలిసి ఉండా లనుకుంటున్నాం. మా పెద్దలు దీవిస్తే పెళ్ళిపేరుతో ఒకటవుతాం. అందుకే ఆ ఫోటో మా యింటికి పంపాలనుకుంటు న్నాను." ఆవేశం, నాటకీయత రెండూ కలగలిసిన గొంతుతో అన్నారు మాస్టారు.

"చాలా సంతోషం."

"అలా అన్నవారు మీరొక్కరే కన్పించారు. ఈ వీధిలో మిగతావారం దరూ నానా రకాలుగా అనుకుంటున్నా రట. ఇది తెలిసి 'హిమ' చాల బాధ పడ్తోంది."

"అయితే ఆలశ్యం ఎందుకు? ఆ శుభ కార్యమేదో తొందరలోనే జరిగే ఏర్పాట్లు చూడండి. అప్పుడు వాళ్ళందరి నోళ్ళకి తాళాలు వేసినట్టుంటుంది కదా."

"అందరిలాగే నాకూ కొన్ని అవరో ధాలున్నాయండి. ఇంకా మా అన్నయ్యకు పెళ్ళికాలేదు. ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు. అయినా వీళ్ళ బాధపడలేక ఆ పెళ్ళేదో తొందరలోనే చేసుకుంటే బావుంటుంది అన్పిస్తూంది నాకు."

"అసలు మీ యిద్దరికీ పరిచయం...." ఆగాను.

"ఈ క్రింది వాటాలో తాసీల్దారుగారు దిగి దాదాపు ఆరు మాసాలయ్యింది. హిమబిందు బియ్యే పరీక్షకి ప్రైవేట్‌గా వెళ్తోంది. అప్పుడప్పుడూ 'ఎకనామిక్స్'లో ఏవైనా 'డౌట్స్' ఉంటే నా దగ్గరికి వచ్చి చెప్పించుకునేది. అంతే. మా యిద్దరి మనసులలో ఎలాంటి భావాలూ లేనప్పుడే 'మా యిద్దరికీ ఏదో వుంది' అని యీ వీధిలోవాళ్లు పుట్టించేశారు. ముఖ్యంగా మీ యింటిపక్కనుండే ఆవిడ. ఆవిడకి మరేం పనిలేనట్టుంది. ప్రతి యింటికీ పనిగట్టుకుని వెళ్ళి మా గురించే చెప్తుందట! ఇది తెలిసి మేం యిద్దరం ఎంతో బాధపడ్డాం. ఆ తరువాత విడిగా అనుకోకుండా మానరు కదా అవి వాళ్ళమాటే నిజం చేశాం." ఆవేశంగా అన్నారు మాస్టారు.

"మరి పర్సనల్ క్వశ్చన్ అడుగు తున్నందుకు ఏమీ అనుకోకండి.... ఈ మధ్య నేనొకటి విన్నాను. మీరిద్దరూ రాత్రిళ్లుకూడా...."

"ప్రతిరోజూ కాదు. ఆ మధ్య శాస్త్రిగారు, భార్యతో కలిసి సెకండ్‌షోకి వెళ్లారు అప్పుడు హిమ యిక్కడికొచ్చి చాలా పేపటివరకూ సబ్జెక్ట్ చెప్పించుకుంది అంతే."

"మీ యిద్దర్నీ కలపడానికి ఒక విధంగా యీ వీధిలోవాళ్లే కారకులన్న మాట నరే ఉంటాను. మీ యిద్దరి పెళ్ళి త్వరలోనే జరగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను మరొక్క విషయం. మిగిలిన వాళ్ళలాగా 'ఏవో పరిస్థితులు' అంటూ హిమకిందుకి ఏ రకంగా అన్యాయం జరక్కుండా చూడండి" అన్నాను.

"ఆ ఆత్మవిశ్వాసం, ఆత్మ స్థైర్యం లేకపోతే అసలీ వ్యవహారంలోనే దిగి వుండేవాడిని కాదు" అన్నారు మాస్టారు దృఢంగా.

"వెరీ గుడ్. ఐ విష్ యూ ఆల్ సక్సెస్" అని కిందకుదిగిపోయాను

ఆ రాత్రి మా శ్రీమతికి మా యిద్దరి మధ్య జరిగిన సంభాషణంతా చెప్పాను.

"మన పక్కింటి పిన్నిగారికి విడివిడిగా వున్న ఆ యువతియువకుల్ని ఒకటిచేసిన పుణ్యం దక్కింది. ఇలా పుకార్లవల్లా, చెవులు కొరుక్కోవడం వల్లాకూడా లాభాలుంటాయన్నమాట" అన్నాడు నవ్వుతూ.

"అసలింతకీ మీరా మేస్టారని సమర్థిస్తున్నారా" సూటిగా అడిగింది మా శ్రీమతి.

"అవకాశాలు రానంతవరకూ అందరూ ప్రవరాఖ్యులే. ఓ అబ్బాయి ఓ అమ్మాయి కలిసి మాట్లాడితే ఓ సంబంధం అంటగడ్తారు దాంతో తటపటాయిస్తున్న వాళ్ళిద్దరూ తక్కున ఒకటవుతారు. అసలు వాళ్ళ బుర్రల్లోనికి ప్రేమబీజాలు నాటిందీ వాటిని పెంచి పెద్దచేసి ప్రేమ ఫలాన్ని అందించిందీ మన సమాజమే సుమా" అన్నాను నేను నాటకఫక్కీలో.

"ఎందరో మహానుభావులు. అందరికీ వందనాలు" అంటూ పాడుకొంది.

"అందరూ మహానుభావులే! ఎందరికని వందనాలు" అని నేనూ ఆ కీర్తన అందుకుని తక్కున లైటార్పేశాను.





# విశాలహృదయుడు

ముద్దంశెట్టి హనుమంతరావు

కాలువదగ్గరికొచ్చిన రాఘవకి, కరచరాలాడలేదు. కాలువ పొంగి ప్రవహిస్తూ వుండటమే అందుక్కారణం.

వర్షం సన్నగా కురుస్తోంది. గొడుగు వేసుకున్నాడేగాని, వొళ్ళంతా తడిచినట్టుగా వణికిపోతున్నాడు, రాఘవ. చల్లని గాలి జివ్వుమనిపిస్తోంది. ఆకాశం వేపు చూశాడు చుట్టూ మేఘాలు కమ్మి వున్నయ్. వాచీ చూసుకున్నాడు. ఆరు కావస్తోంది. కాలవని దాటి వెళ్ళడం యెలా? తనకి ఈత రాదే? చిన్నప్పుడు యీత నేర్చుకోకపోవడం, పొరపాటే అయ్యిందని యిప్పుడనిపిస్తోం దతనికి.

అక్కడి వాతావరణం, తన నిస్పృహయత చూస్తుంటే, రాఘవకి మతిపోయినట్టయ్యింది. మళ్ళ వెనక్కి వెళ్ళి, జంక్షనుమించి తమ వూరు నడిచి వెళ్ళాలంటే, చాలా సమయం పడుతుంది. అంతేకాదు – తన రాకకోసం, తలిదండ్రులు ఎంతో ఆరాటంతో, ఆతృతతో యెదురుతెన్నులు చూస్తుంటారు. వాళ్ళ ఆరాటానికి, తాను కారకుడు కాకూడదు. కాని....కాని.. యెలా వెళ్ళడం? అదే ఆలోచన అతణ్ణి కలవరపెట్టసాగింది.

ఎవరైనా అగుపిస్తారేమోనని, చుట్టూ ఓసారి కలయజూశాడు, రాఘవ. రోడ్డు మీద యెవరో ఓ వ్యక్తి యిటుకేసే వస్తూవుండటం చూశాక, రాఘవలో ఆశ

తళుక్కుమంది. ధైర్యం పుంజుకుంది. ఆ వస్తోన్న వ్యక్తి తప్పకుండా తనకి సహాయం చెయ్యగలడన్న నమ్మకం యేర్పర్చుకున్నాడు మనసులో. దృష్టిని మాత్రం అటుకేసే కేంద్రీకరించాడు.

ఆ వ్యక్తి తీరా దగ్గరికి వచ్చేసరికి, అతణ్ణి చూసి, నిర్ఘాంతపోయాడు, రాఘవ. ఆ వ్యక్తి, అతని విరోధి ఆనందరావు కావడమే అందుకు హేతువు. తమ రెండు కుటుంబాల మధ్య, పచ్చగడ్డి వేస్తే భగ్గుమనిపించే వైర్యాలం రగుల్తోంది, చాలారోజుల్నించి. అటువంటి వ్యక్తి సహాయాన్ని తానెలా అర్థిస్తాడు? క్షణం క్రితం రాఘవలో మెరిసిన ఆశాజ్యోతి ఆరిపోయింది. మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు తనిప్పుడేం చెయ్యడం, వెనక్కి తిరిగి వెళ్ళిపోవడమా? ఒకవేళ తాను పౌరుషాన్ని వదిలిపెట్టి అర్థించినా, అతను సహాయంచేస్తానని నమ్మించి, కాలవమధ్యలో తనకి అపకారం తలపెడితే? తన భయాన్ని భావనాలోకంలో వూహించుకుని, జలదరించిపోయాడు అది నిజమే. మనిషి పగ, పాముపగకంటె ప్రమాదమైనదంటారు. ఆ పగ ధ్యాసలో మానవత్వం కూడా గుర్తుకురాదు. అయినా, తనెందుకు అనవసరంగా చిక్కులు కొనితెచ్చుకోవడం?

ఇలా పరిపరివిధాల ఆలోచిస్తూ వుండిపోయాడు, రాఘవ.

వర్షపుజల్లు ఉధృతమౌతోంది. కాలవ ప్రవాహపు హోరు వింత సంగీతంలా వినిపిస్తోంది.

అదే సమయంలో ఆనందరావూ ఆలోచనల్లో పడ్డాడు. రాఘవకి ఈత రాదని అతనికి బాగా తెలుసు. అందుకేనేమో రాఘవ యేంచెయ్యాలో తెలీని అయోమయస్థితిలో పడ్డాడని వూహించగలిగాడు, తమ కుటుంబాల మధ్యగల బద్ధ వైరం గుర్తుంచుకుని, తన సహాకారాన్ని అర్థించడానికి రాఘవ వెనకంజ వేస్తున్నాడేమోనన్న అనుమానం కలిగింది, ఆనందరావుకి.

సహజంగా, ఆనందరావు సౌమ్యుడు. కక్షలూ, కార్పణ్యాలూ, కలకాలం వుండకూడదనే సదుద్దేశం గలవాడు. అందుకే తను సుళువుగా యీదుకుని కాలవదాటి వెళ్ళిపోగలిగినా, రాఘవ నిస్సహాయతను చూసి ఆలోచించాడు. ఇంతవరకూ అటువంటి అవకాశమూ రాలేదుగానీ, చొరవ చేసి రాఘవతో మాట్లాడలేకపోయాడు, ఆనందరావు. అనుకోకుండా, ఇప్పుడీ అవకాశం వచ్చింది. రాఘవ మనస్తత్వం యెలావున్నా, ఇప్పటి పరిస్థితి దృష్ట్యా తనే చొరవ తీసుకోవాలన్న నిర్ణయాన్ని తీసుకున్నాడతను. నిజం చెప్పాలంటే, ఆనందరావుకి యెవరితోనన్నా విరోధం తెచ్చుకోవాలన్నా, విరోధిగా వుండాలన్నా, మనసు పీకుతుంది. అందుకనే, ఓ మెట్టు కిందికి దిగాడు తనే.

"రాఘవగారూ..." మెల్లగా అన్నాడు ఆనందరావు.

ఆ నిర్జన ప్రదేశంలో, స్పష్టంగా వినిపించిందా పిలుపు, రాఘవకి. విస్తు పోయాడు. ఆనందరావే ప్రప్రథమంగా పలకరించినందుకు, అతనిలోని ఆతిశయ నైజం అవంతించింది. ఆనందరావుకేసి చూశాడు. మళ్ళీ ఆనందరావే అందు కున్నాడు. "అలా ఆలోచిస్తున్నారేమిటి? కాలవ యెలా దాటడమనే కదా? అలా ఆలోచిస్తూ యెన్నాళ్ళు కూచున్నా, ప్రయో జనం యేముంటుంది చెప్పండి? మీకు యీత రాదని నాకూ తెలుసు. అంచేత, మీకు అభ్యంతరం లేకపోతే, నేను మిమ్మల్ని అవలి ఒడ్డుకి తీసుకుపోతాను. వాతావరణం చూస్తుంటే, వర్షం క్రమంగా అధికమయ్యేట్టుంది. మన కుటుంబాల మధ్యగల వైరాన్ని, యీ క్షణంలో ఓ పక్కకి నెట్టండి. అదీగాక స్థూలంగా యోచిస్తే, విరోధం పెంచుకున్నది మన పెద్దలేగాని, మనం కాదు కదా? అల్లాం టప్పుడు మన మధ్య విభేదాలకి చోటుండ కూడదు. ఆలోచించండి." అంటూ తన అంతరంగంలోని భావాన్ని వ్యక్తం చేశాడు, ఆనందరావు.

ఆనందరావు సహృదయానికి యిదో నిదర్శనం. సహృదయమే లేని వ్యక్తి అయితే, తన విరోధికి తానెందుకు సహా యం చెయ్యాలన్న పట్టుదలతో, యీస డింపుగా నవ్వుతూ, సగర్వంగా, తన కేమీ పట్టనట్టే తన మానాన తాను యీదుకుంటూ వెళ్ళిపోయేవాడే! కాని అలా చెయ్యలేదు. చిరకాలంగా, తమ కుటుంబాల మధ్య వున్న బద్ధవైరాన్ని సహితం పక్కకినెట్టి, తన మానవతను, మంచి మనస్సును ప్రకటించుకున్నాడు, ఆనందరావు.

అయితే, రాఘవ ఆనందరావు సహృ దయతని యధాతథంగా అర్థంచేసుకోలేక పోయాడు. 'కోరి పిలిస్తే కులంతక్కువ' అన్న సామెతలా ఆనందరావు ప్రకటిం చిన మంచితనం మాటున, వంచన పొంచివుందేమోనన్న అనుమానం అతని మనసులో మొలకెత్తింది. తనకి అపకారం చెయ్యాలన్న అభిప్రాయంతోనే, తనకి సహకరిస్తా నంటున్నారని భావించాడు. మనిషిలో వుండే సహజ ప్రవృత్తికి, రాఘవకూడా లోనయ్యాడంటే, అదేం ఆశ్చర్యం కాదు.

"ఎందుకులెండి ఆనందరావుగారూ మీకాశ్రమ? నేను జంక్షనుకి తిరిగివెళ్ళి, అక్కణ్నించి మనవూరు పోతాన్లెండి." అనేశాడు, రాఘవ.

"ఇందులో శ్రమేముందండీ? నేను గతీతగాణ్ని .... ఆ సంగతి మీకూ తెలుసు. ఇద్దర్నీ ఒకేసారి నా వీపుమీద కూచోపెట్టి తీసుకుపోగల్ను. నాకు నేనుగా యిలా కోరి చెబుతున్నానని, నన్ను అపార్థం చేసుకోకండి. ఏ విధమైన అను మానాన్నీ మనసులో పెట్టుకోకండి. మన కుటుంబాల మధ్య బద్ధవైరం వుండి వుండొచ్చు. ఈ పరిస్థితుల్లో విస్మరించాలి.

ఇక్కడ మేమిద్దరం కోటి మానవులం. ఒకరొకరు సహకరించుకోవడం, మానవధర్మం. నన్ను నమ్మండి. భగవత్సాక్షిగా చెబుతున్నాను. యీ పరిస్థితుల్లో 'యీత' రాని మిమ్మల్ని ఆదుకోవాలని పించింది. చొరవచేసి చెప్పాను. అప్పటికీ మీరు నన్ను నమ్మకపోతే, అది నా దురదృష్టం." రాఘవని నమ్మించాలని ప్రయత్నించాడు, ఆనందరావు.

రాఘవ నిర్ఘాంతపోయాడు. తన మనసులోని అనుమానాన్ని ఆనందరావు ఎలా గ్రహించగలిగాడో అతని వూహకి అందలేదు.

రాఘవ, మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు. ఆనందరావు గురించి ఒక నిజం మాత్రం అతనికి తెలుసు. అదేమిటంటే, అతను సహృదయుడని.... సహకారభావం అతని నరనరాల్లో ప్రవహిస్తోందని; అంచేత, తనలో రేకెత్తిన శంకను, ఓ పక్కకు నెట్టి, ఆనందరావుని నమ్మాలన్న నిర్ణయానికొచ్చాడు.

"సరే, ఆనందరావుగారూ; పదండి మీరన్నట్టు, వైరం మన పెద్దలమధ్యే గాని, మనమధ్యలేదుకదా! మనం స్నేహితులమే!" వుత్సుకతతో అన్నాడు రాఘవ,

ఆనందరావు, చిన్నగా నవ్వుకున్నాడు.

బట్టలు, గొడుగులు, ఓ చేత్తో పట్టుకుని రాఘవ, ఆనందరావు వీపుకి అంటుకున్నట్టుగా పెనవేసుకున్నాడు, ఆనందరావు సలహామేరకు. కాలవలో దిగాడు ఆనందరావు. రెండు నిమిషాల్లో అవలి



ఒడ్డుకి చేరుకున్నారిద్దరూను. అంతవరకూ యెంత ధైర్యంగా వుండాలనుకున్నా, రాఘవ గుండెలు జోరుగా కొట్టుకుంటూనే వున్నాయ్. ఏదో అనుమానం లీలగా పీక్కు తింటూనే వుంది. ఆవలి ఒడ్డుకి చేరాక స్థిమితపడ్డాడు.

"థాంక్స్ ఆనందరావుగారూ!" అన్నాడు కృతజ్ఞతాపూర్వకంగా రాఘవ, దుస్తులు వేసుకుంటూను

"దానికేముందిలెండి. బహుశా మీరు, యివతలి ఒడ్డు చేరేవరకూ అపనమ్మకంతోనే వున్నారనుకుంటాను!" చిన్నగా మందహాసం చేస్తూ అడిగాడు, ఆనందరావు.

నిజానికి అది వాస్తవమే అయినా, ఒప్పుకోలేకపోయాడు, రాఘవ.

"అబ్బే! అదేం కాదనుకోండి. మీ మాటలమీద, నాకు గట్టి నమ్మకం యేర్పడింది. మీ మంచితనమేమిటో నాకు బాగా తెలుసు వ్యతహాగా మీరు క్రూరులు కారు. ఇవన్నీ ఆలోచించే, మీ వెంట వచ్చాను. ఏది యేమైనా, యీ విధంగా నయినా, యెన్నేళ్ళనించో మన కుటుంబాలమధ్య పేరుకుపోయిన ప్రబల వైరం, కరిగిపోయింది మనిద్దరం మిత్రుల

మయ్యాం. అందుకు, నేనెంతో ఆనంది స్తున్నాను." తృప్తిగా అన్నాడు రాఘవ.

"అది. మనం యిప్పుడే చెప్పలేమండీ రాఘవగారూ! మీ నాన్నగారూ సులువుగా పరిస్థితులతో రాజీ పడతారనుకోను." తన అనుమానాన్ని వ్యక్తీకరించాడు, ఆనంద రావు.

"అవ్వే! అలా జరగదులెండి. వాళ్ళ మన స్తత్వాల్ని, మూర్ఖత్వాన్ని, మార్చే ప్రయత్నం యీ తరంవాళ్ళం మనం చెయ్యాలి. ఆ బాధ్యతని, నేను తీసు కుంటున్నాను. మా నాన్నగార్ని నేను కన్విన్స్ చేస్తాను." గట్టి విశ్వాసంతో అన్నాడు రాఘవ.

"అలా అయితే, మరింకేం! అన్ని విధాల శ్రేయస్కరమే! విజాపికి మన పల్లెల్లో పురోగతి రాకపోవడానికి కొంత మేరకు కారణం, యిటువంటి కక్షలూ, కార్పణ్యాలే అంటాను. నాకు మట్టుగ అందరితో కలిసికట్టుగా, స్నేహభావంతో బ్రతకాలని వుంటుంది సుమండీ! ఇంతా చూస్తే, యెవరు పట్టుకుపోయేదీ యేమీ లేదు. ఈ భూమ్మీదకి యెలా వచ్చామో, యిక్కడ్నించి వెళ్ళాల్సింది ఆ తీరులోనే. మనిషి తదనంతరం మిగిలిపోయేవి, మంచీ, చెడులే!" వేదాంత ధోరణిలో చెప్పుకుపోయాడు, ఆనందరావు.

"మీరన్నది, అక్షరాలా నిజమండీ ఆనందరావుగారూ! స్నేహభావం, సహ కారభావం, అందరిలోనూ వుండాలి. ఈనాటి సంఘటన, మీ విశాలహృద యాన్ని చెప్పక చెప్తోంది. నేను విరోధి నని తెలిసి కూడా, మనసులోని వైరాన్ని తుడిచేసి, చొరవతీసుకుని, సహృద యంతో సహాయం చేసేందుకు ముందుకు రావడం, మీ ఔదార్యాన్ని, మీ ఔన్న త్యాన్నీ చాటుతోంది."

సన్నగా నవ్వేడు, ఆనందరావు.

వర్షపు జల్లు తగ్గుముఖం పడుతోంది. మరి కాస్సేపటికి వూళ్ళోకి అడుగు పెట్టారు వాళ్ళిద్దరూను.

రాఘవ, ఆనందరావు, కలిసి నవ్వుతూ, మాట్లాడుకుంటూ వెళ్తుంటే, వాళ్ళని చూసినవాళ్ళంతా ఆశ్చర్య పోయారు. ఏదో వింతను చూస్తున్నట్టుగా, ముక్కుమీద వేలేసుకున్నవాళ్ళు లేక పోలేదు.

"మా ఇంటికి రండి, కాఫీ తీసుకుని వెళ్దురుగాని...." ఆహ్వానించాడు, రాఘవ. వాళ్ళడాబా యిల్లు ముందుకే వుంది.

"ఇప్పుడు కాదండీ రాఘవగారూ! బట్టలు తడిచి వున్నాయి కదా! రేపు వస్తానెండి."

"సరేలెండి. రేపు ఉదయం తప్పక రావాలి. మీ కోసం యెదురు చూస్తుం టాను."

"అలాగే!"

"వస్తానండీ! మరోసారి నా ధన్య వాదాలు చెప్పుకుంటున్నాను...." అంటూ యింట్లోకి నడిచాడు, రాఘవ.

ఆనందరావు, ముసిముసి న వ్వు కుంటూ, ముందుకి సాగిపోయాడు అతని హృదయం వుప్పొంగిపోయింది. ఆనాటి సంఘటనకి.

ఆ రోజునించీ, ఆ రెండు కుటుం బాలూ, వైరాన్ని విస్మరించి, సన్నిహిత మయ్యాయి.




(గత సంచిక తరువాయి)

## పదిహేడు

బుచ్చిబాబు

పకపకా నవ్వాడు లోకనాధం ఉత్తినే.

తలాడించింది రావిచెట్టు.

'ఏమిటా పిచ్చినవ్వు లోకనాధం!' అన్నారు వేదాంతాచార్యులవారు.

'హాహా! హీహీ!!' గుక్కపట్టి నవ్వుతున్నాడు లోకనాధం.

'ఎందుకో బోసినవ్వు లోకనాధం. నువ్వు నవ్వే స్టేజి దాటిపోయింది. ఇంకోడైతే కృష్ణలో పడేవాడు. రైలుక్రింద పడేవాడు. కనీసం గుప్పెడు విషం త్రాగేవాడు. నువ్వు మాత్రం— ఇంత జరిగాక ఇంకా బ్రతికున్నావంటే లాలాతోటి మనిషివి కాదు సుమా! నీది మహాత్ముల కోవ.'

'ఏం కోవ?'

'మహాత్ముడవీ - బాపూజీ అంటార్లే- స్వాతంత్ర్యభి కాలూకు గాంధీగా తన్నమాట. అది సరేగానీ - మొన్న నవమినాడే గదా బెజవాడ వెళ్ళి కట్టుడుపళ్లు కట్టించుకున్నావ్? వారం తిరక్కుండే టోపినోటితో మళ్ళి ప్రత్యక్షమయ్యావ్. మళ్ళి హైదరాబాద్ వెళ్ళి బుచ్చిబాబుతో సరసమాడావా?'

'మి మీద వట్టేసి చెబుతున్నా. మున్నబు పెళ్ళాం నాంచారమ్మను కరిచిందే - అదే నల్లపాము తమని ఈ రాత్రి- మాడుపగిలేలా- దిమ్మతిరిగేలా- తమరు గిజగిజ తన్నుకు చచ్చేలా కరిచినంత వట్టు.'

'నిన్ని నిలువునా చీరినా- ఈ రావిచెట్టుకు తలక్రిందులుగా వ్రేలాడగట్టి- కిర్సనాలుపోసి అంటించి - క్రింద ముంతపొగ పెట్టినా - నిజంచెప్పే వరజన్మ నీకు లభ్యంకాదు గానీ- నీ అబద్ధాల పుట్టలోంచి- అసలు నిజాన్ని బయటకు లాగ గల శక్తి నాకు భగవంతుడు ప్రసాదించాడు లోకనాధం. నువ్వు ఎంత దాచినా అసలు విషయం బయటకు పొక్కకుండా మానదు సుమా!'

'ఏమిటి బాబూ ఆ అసలు విషయం?'

'క్రితం ఆదివారం బెజవాడ వెళ్ళావట!'

'వెళ్ళాను తప్పా?'

'ఎప్పే తప్పెందుకౌతుంది? నీ శిష్యురాలు గనక - ప్రియశిష్యురాలు గనుక రేఖమ్మను చూసివద్దామని వెళ్ళావు. ఔనా!'

'ఔను! కొత్తగా పెళ్ళికాకుండానే కాపరంపెట్టింది - అందర్నీ ఎదిరించి తండ్రినే తోసేసి - రేఖమ్మను తెచ్చిపెట్టుకున్నాడు గనక చిట్టిబాబు - వాళ్ళ సంసారం ఎలా వుందో సుచ్చటగా చూద్దామని వెళ్ళాను తప్పా?'

'అప్పే తప్పేముంది? తండ్రి రాజయ్యలాటి పిచ్చివాడు కాదు చిట్టిబాబు. ఇప్పుడు రేఖ వాడి ఆధీనంలో వుంది. మళ్ళి ఆ ఛాయలకు పోతే కేవలం పళ్ళు ఊడగొట్టి ఊరుకోడు. చర్మం వలిచేస్తాడు. అసలే బక్కమనిషివి. తోడేస్తాడు ప్రాణాలు. ఎందుకు చెబుతున్నానో విను. పుట్టలో చెయ్యిపెట్టటమెందుకు? పాము కరిచిందని గోల చేయటమెందుకు? నువ్వు పోతే ఏమౌతుందో- ఎంత ఘోరం జరుగుతుందో ఆలోచించు. ప్రప్రథమంగా ఈ రావిచెట్టు ఏడుస్తుంది. ద్వితీయంగా ఈ ఊరికి కాలక్షేపం ఉండదు. తృతీయంగా ఎందరు ఆడపిల్లల్నో ఉద్ధరించవలసినవాడివి నువ్వు. నువ్వు బ్రతుకులేం కావాలి?'

'మీకు చాలా తెలివితేటలున్నాయని మీ భ్రమ కదా ఆచార్లూ?'

'అందుకే నీ అనుపానులు బాకు బాగా తెలుస్తాయి లోకనాథం! నీకు గాంధీగారి పోలికలున్న సంగతి ముందు కనిపెట్టింది నేనే గదా? ఆయనగారి బోసి నవ్వు నీకొచ్చింది ఆ కట్టుడుపళ్ళూడాక. ఆయనగారి అహింసాధర్మం— క్షమా గుణం— అవీ అబ్బాయి నీకు. కాకపోతే— మొన్న చిట్టిబాబు ఒక లెంపను కొడితే —రెండో చెంప చూపెట్టావట. వాడు మళ్ళీ అంటించాడట ఛళ్లుమనేలా? అలా కొట్టి నందుకు చిట్టిబాబునూ, ఆ కొట్టటం చూసినందుకు ఆ రేఖమ్మనూ హుటాహుటిన క్షమించి పరుగుపరుగున వెనక్కి తిరిగి చూడకుండా వచ్చేశావట? ఎదురుతిరిగి ఆ బుచ్చిబాబు బుర్ర రామకీర్తన పాడకుండా నువ్విలా కాలికి బుద్ధిచెప్పి వచ్చేశావూ అంటే నీకు చావలేకనా? ఆ మాత్రం కండబలం గుండెబలం లేకనా? కేవలం అహింసాధర్మాన్ని నమ్మినవాడివి గనక — అలా తిరిగొచ్చావు.'

'ఆచార్లూ! ఈ మధ్య నీకు తిన్నది అరుగుతున్నట్లు లేదు. అసలే బ్లడ్ ప్రెజర్ మనిషివి. షుగర్ కంప్లెంటంటూ చక్రపొంగలి తెగ తింటున్నావ్! నువ్వీ ధోరణి మార్చుకోకపోతే అష్టకాలం బ్రతికి బట్టకట్టవు సుమా! ఆచార్లూ నోరు జాగ్రత్త.'

ఇద్దరికీ మాటామాటా పెరిగింది. కొట్టుకునేటంత పనయింది ఆ సమ యంలో లోకనాథం విజృంభించి ఆచార్యులవారిమీద ఒక చెయ్యి వేశాడు సమ యానికి మున్సబు వచ్చి విడదీశాడు. బ్రతిమిలాడి ఆచార్లుగారిని ఇంటికి పంపిం చాడు. గంటలతరబడి సూటిపోటీగా— వ్యంగ్యాతివ్యంగ్యంగా మాట్లాడుకోవటం వాళ్ళిద్దరికీ అలవాటే. వాళ్ళ నాలికలకున్న పదును చేతులకు లేదు.

మున్సబు రావిచెట్టు దగ్గరకొచ్చింది పేకాటకోసం. భార్య నాంచారమ్మ అకస్మాత్తుగా కట్లపాము కరిచి చచ్చిపోయాక — అందరికంటే ముందే పేక ముక్కలు పుచ్చుకు రావిచెట్టుదగ్గరకు సమరోత్సాహంలాటి తిక్కతో ఠంచనుగా వస్తున్నాడు మున్సబు!

'నేనూ వెళ్తాను మున్సబూ' అన్నాడు లోకనాథం.

'నాలుగు ఆటలాడుకుపోదాం కూర్చో లోకనాథం.'

'కూర్చుంటా గానీ నన్ను కాస్త నువ్వే ఆదుకోవాలి మున్సబూ. ఆ ఎంకి మొగుడు నన్ను బ్రతకనిచ్చేలా లేడు. ఎంకిని సినిమాస్టారు చేద్దామనుకున్నా. ఆ రేఖకు బుద్ధిచెప్పాలనుకున్నా, ఈ పాటికి స్టారులకు స్టార్ కావల్సింది. ఆ చిట్టి బాబుగాణ్ణి లేపుకొచ్చి కాపురంపెట్టింది తెలివాళ్ళా. రేఖ చేతిలో రేఖ లేదయ్యా! అన్నీ వున్నాయి పుష్కలంగా. కళ్ళకు కళ్ళు. వళ్ళుకు వళ్ళు. పళ్ళకు పళ్ళు.

లేనిది ఒక్కటే ముప్పయ్యా? అదృష్టరేఖ. ఆ నష్టజాతకురాలి పేరు మాత్రమే రేఖ. ఆ రేఖలేని మనిషి బంగారం పట్టుకుంటే మట్టయిపోతుందన్నారు సహజా నందులు.'

'ఆయనెవరు?'

'అసలైన బ్రహ్మజ్ఞాని.'

'మరి మన బ్రహ్మజ్ఞాని?'

'మట్టిపిడత. బుర్రలేదు. ఇంగితజ్ఞానం అసలే లేదు' అన్నాడు లోకనాథం.

'ఏమిటో లోకనాథం నీ గురించి నువ్వే వర్ణించుకుంటున్నావ్?' అన్నాడు తప్తూ, లోకనాథం మాట విన్న బ్రహ్మజ్ఞాని,

'బ్రహ్మజ్ఞాని అంటే జరిగిందీ- జరుగుతున్నదీ - జరగబోయేదీ - సర్వం తెలిసిన బ్రహ్మపదార్థమని చెబుతున్నాను-బ్రహ్మజ్ఞానీ.'

'నీ కట్టుడుపళ్ళు బిచ్చిగాడు ఎందుకలా ఊడకొట్టిందీ-దివ్యదృష్టితో చూసి వర్ణించనా సవివరంగా?.

'టూకీగా మూడుముక్కల్లో చెప్పవయ్యా చాలు!'

'పెట్టుబడి పెట్టే ప్రొడ్యూసరు దొరగ్గానే కలరుసినిమా తీస్తానని పదేళ్లుగా అందరినీ వూదరగొట్టేస్తూ- అసలుపళ్ళూ కట్టుడుపళ్ళూ ఊడగొట్టించుకున్నాడా ఈ లోకనాథం. ఇదుగో నే చెబుతున్నా విను. నిన్ను నమ్మి పెట్టుబడిపెట్టే ప్రొడ్యూ సరు ఈకి జన్మలో దొరకడు. వృద్ధకన్యలా నువ్విలా తపస్సు చేయవలసిందే ఆ రానివాడికోసం.'

'ముక్కలయ్యిందయ్యా అంటే ఆ తప్పువాగు డెందుకంట?' అంటూ కసురుతున్నాడు ముప్పయి.

'ముగ్గురితో ఆటే బాగుంటుంది ముప్పయీ?'

'పాడూరు. ముక్క కలపటానికి గూడా పనికొచ్చే మనుషుల కొరవే '

అటుగా హూటాహుటిన బలీనుతో పరుగుతీస్తున్నట్టే నడుచుకుపోతు న్నా . కనకారావు. ఆ వెనకనే అదే హడావుడితో పంతులు. ఆ వెనకు చాలా మంది.

ఏం జరిగిందో ఎవరికీ ఏమీ అర్థంకాలా అక్కడ.

రావిచెట్టు స్తంభించిపోయింది.

జరిగిందిది.



చిట్టిబాబుకు ఏక్సిడెంటయింది. వెంటనే ప్రాణం పోయింది. పాతికేళ్ళ బుచ్చిబాబుకు నూరేళ్ళూ నిండాయి 'నేను బ్రతికుండగానే నా కొడుకు కలెక్టరై కార్లమీద తిరుగుతాడు చూడు. నీలాటివాళ్ళూ నాలాటివాళ్ళూ – వాడి కాళ్ళముందు చేతులుకట్టుకు నుంచుంటారు చూడు. కాస్త తొందరపాటు మనిషి గానీ, రవ్వంత విదానం వుంటే రాజ్యాల్ని ఏలవలసినవాడు' అనేవాడు చిన్ననాడు బుచ్చిబాబు బడికెళ్తుంటే చూసి. ఒకళ్ళతో అనటమే కాదు– కొడుకును గుండెల మీద కూర్చోపెట్టుకొని 'నన్ను కాలితో తన్ను నాన్నా' అనేవాడు. అయిదారేళ్ళ అజ్ఞానం– అమృతం కాగా పిచ్చిబలమెచ్చి– ఒక్క ఊపున తండ్రినే తన్నేవాడు చిట్టిబాబు. ఒకసారి చిట్టిబాబు కన్ను పోవలసింది,

'చంటిగుడ్డుకు అలాటి పోకిరీపనులు నేర్పకండి మహాప్రభో' అంటూ నెత్తీ తలా నోరూ కొట్టుకు ఏడ్చేది బుచ్చిబాబు తల్లి బుచ్చమ్మ.

'కాస్త పెద్దవాడయ్యాక, కాస్త జ్ఞానమొచ్చాక వాడుమాత్రం చేస్తాడటే ఇలాటి పనులు? ఈ ఊళ్ళోకల్లా - జిల్లాలోకల్లా మంచి బుద్ధిమంతుడనీ ప్రయోజకుడనీ పేరుతెచ్చుకుంటాడు మా నాన్న అంకాలమ్మ వరంతో పుట్టాడే ఈ బిడ్డ. అంకాలమ్మంటే ఎవరనుకున్నావ్? ఆదిశక్తి అవతారం. మా గొప్ప దేవత. ఆ తల్లి చల్లగా చూస్తుందే మన బిడ్డను. నేను ఇవాళ చెపుతున్నా విను. ఇలా తండ్రినే తంతున్నాడంటే - అందులో ఈ వయస్సులో–వాడు తండ్రికిమించిన కొడుకౌతాడని అర్థం. మన వంశంలోకల్లా గొప్పవాడౌతాడు మన బుజ్జిగాడు!' అంటూ సంబరపడుతూ– బిడ్డచేసిన ప్రతి పనికీ మురిసిపోయేవాడు. బుచ్చిగాడు చేసిన ప్రతి అఘాయిత్యానికీ– ఒక శుభసూచకమైన అర్థం చెప్పేవాడు తండ్రి చిట్టిబాబు.

రోజూ అయిదారేళ్ళ వయస్సులో కొడుకుని తీసుకుని రోజూ అంకాలమ్మ గుడికి వెళ్ళి - ఆ అమ్మవారికి దండం పెట్టించేవాడు తండ్రి. గుడికి తండ్రీకొడుకులు వెళ్ళటం_రావటం- ఆ రావిచెట్టుక్రింది జనం ఏళ్ళతరబడి చూశారు. 'లేక లేక పలుగురు ఆడపిల్లల తర్వాత పుట్టిన కొడుకు గదా! అదీ గారాబం. వాడిని గవర్నరో కలెక్టరో చెయ్యాలని ఆ చిట్టబ్బాయిగాడి తాపత్రయం. ఆ బుచ్చిలుగాడు ఇప్పుడే దోవనపోయేవాళ్ళందరి తలలూ పగలగొడుతున్నాడు. చూసిరారా నాయనా- అంటే కాల్చొచ్చే రకం. మొన్న ఏనాది ఎంకి చెరువునించి నీళ్ళు పట్టుకెళ్తుండే- ఉండేలుకొట్టి కుండ బద్దలుకొట్టాడట. ఎంకి వెళ్ళి చిట్టబ్బాయికి ఫిర్యాదుచేస్తే- 'ఏదో ముద్దొస్తున్నావు గదా అని సరసమాడాడులేవే ఎంకీ! ఆ పత్తిపంతులంతమాత్రం చెయ్యడా నా కొడుకు! ఇంకా పసివాడు గావీ_వాడికే గనుక వయస్సొస్తే- రేపు నువ్వే వాడివెంట పడతావ్. నీలాటివాళ్ళు క్యూలో నుంచుంటారు. ఇంతకీ మావాడికంటె అందగాడు నీ కెక్కడ దొరుకుతాడే ఎంకీ' అంటూ సరసం మొదలుపెట్టాడట!' అంటూ తలొకమాటా అన్నారు.

బుచ్చిబాబును గురించి అలాటి మాటలు చాలా వింది రావిచెట్టు.

ఆ రావిచెట్టు ముందే ఆడుకున్నాడు బుచ్చిబాబు. దాని కళ్ళముందే ఎన్నెన్నో అల్లరిపనులూ అఘాయిత్యాలూ చేశాడు. చిన్ననాడు పదేళ్ళ వయస్సులో 'బొమ్మలపెళ్ళి' ఆట ఆడుతుంటే 'మధూగాడి పెళ్ళాం రేఖ' అంటూ తీర్పు చెప్పింది బొమ్మ. 'మధూగాడి పెళ్ళాంగా ఆట ఆడటానికి వీల్లేదు' అని ఆజ్ఞాపించాడు బాబు. ఖాతరుచేయకుండా ఆడింది రేఖ. అందుకు కోపంవచ్చి - రావిచెట్టు మీదుగా పడిచివెళ్తుంటే- రేఖను చెర్లో తోశాడు బుచ్చిబాబు. ప్రాణంపోవలసింది. చివరకు బాబే చెర్లోకి దూకి రేఖను బ్రతికించాడు. జుట్టుపుచ్చుకు గుంజుకొచ్చి- గట్టున పడవేశాడు రోజూ ఒకర్ని తన్నడమో, లేక ఒకరిచేత తన్నులు తినడమో బాబుకు చిన్ననాడే అలవాటైపోయింది. అటువంటిదేమి జరక్కపోతే అతగాడికి వళ్ళు నొప్పులొచ్చేవి.

పెరిగి పెద్దవాడౌతున్నకొద్దీ బాబు అల్లరి కూడా విజృంభించింది. ఏ తప్పు చేసినా_అనక అంకాలమ్మ గుడికి వెళ్ళటం, చెంపలు వేసుకోవడం 'తెలియక చేశాను తల్లీ! ఇంకెన్నడూ ఆ తప్పు చేయను' అంటూ పనకు తాను శిక్ష విధించుకొని గుంజీలు తీయడం- బుచ్చిబాబుకు చిన్ననాటి రివాజు.

ఎవరైనా- చివరకు తండ్రైనా- ఏ పని చెయ్యొద్దు అన్నారో- ఆ పని ఆ వెనువెంటనే చేయడం అతగాడి స్వభావమైపోయింది.

బుచ్చిబాబుకు తండ్రి మరో 'మంచి' సంబంధం ఖాయంచేసుకున్నరోజునే -బుచ్చిబాబు రేఖను పెళ్ళిచేసుకున్నాడు అంకాలమ్మ సాక్షిగా. అంకాలమ్మ గుడి-ఎదురు రావిచెట్టుక్రింద పేకాడుకుంటున్న అయిదుగురు పెద్దమనుషులు మాత్రమే ఆ పెళ్ళిని చూసిన పెద్దలు.

ఆనాడు- అకస్మికంగా బెజవాడనుంచి కారులో రేఖతో వచ్చాడు బుచ్చిబాబు. అతన్ని గురించీ - రేఖను గురించీ అప్పటికే రేగుతున్నాయి నవాలక్ష పుకార్లూ నిందలూ ఎవరినోట విన్నా. వాళ్ళిద్దరూ అలా అనుకోకుండా కారులో రావడం- గుళ్ళోకి వెళ్ళటం చూసి, రావిచెట్టుక్రింద పేకాడుతున్న పెద్దలు కాసేపు ఆట నిలిపి- జరుగుతున్నది చూస్తూ వింటూ నుంచున్నారు ఊపిరులు బిగబట్టి.

అప్పుడే అక్కడికొచ్చాడు బుచ్చిబాబు తండ్రి చిట్టిబాబు నిప్పులుకక్కుతూ.

'రేఖా! చిన్నప్పుడు- బొమ్మలపెళ్ళిలో మధు నీకు మొగుడయ్యాడు. వాణ్ణి చేసుకోవద్దన్నాను. నన్నే చేసుకోమన్నాను. నువ్వు చేసుకోకపోయినా నే చేసుకుంటానన్నాను గుర్తుందా? అన్నంతపనీ చేశానా లేదా? అందుకు ఏం ప్రజెంటిస్తావ్? అంత సిగ్గెందుకు అంతా అయ్యాక? ఇటు తిరుగు' అంటూ తన మెళ్ళోని పూలదండను గూడా రేఖ మెళ్లో వేస్తున్నాడు బుచ్చిబాబు.

రేఖ తల వంచింది. మహాప్రసాదాన్ని ఏదో అతీత శక్తినుంచి అందుకుంటున్నట్లు,

'తలెత్తు రేఖా!'

'............'

'ఎందుకా సిగ్గు?'

ఇంకా తల వంచుకుంది ముగ్ధలా.

'మనం సిగ్గుపడవలసిన పని చేసామంటావా?'

'అ....డి....కా....దు'

'మరి?' రెండుచేతులతో రెండుచెక్కిళ్ళూ పట్టుకుని ఆమె తల పైకెత్తాడు. ఒక్కసారిగా వేయికోట్ల నయాగరాలు ఆమె గుప్పెడు గుండెలో పొంగి- మెరుస్తున్న కళ్ళ నీటిబుగ్గలై పొంగాయి.

'ఏడుస్తున్నావా?'

'లేదు బుచ్చీ. ఈ పల్లెకాని సంతోషాన్ని, ఎలివికాని సంబరాన్ని, అంతుచిక్కని నా అదృష్టాన్ని పోల్చుకుంటున్నాను. ఉక్కిరిబిక్కిరై పోతున్నాను.

ఉప్పొంగుతున్న ఉద్వేగానికి తట్టుకోలేక ఎగిరెగిరిపడుతున్న ఈ వేల గుండెల్ని ఈ చల్లని తల్లిముందు అదిమిపట్టమని చెప్పలేను. ఇంతటి అదృష్టం నాకుందని, ఇంత చల్లటి ఆశీర్వచనం నా కందిందని- ఈ అమృత ముహూర్తంలో- ఈ కల్యాణ ఘడియల్లో- నాకే నమ్మకం కుదరడంలేదు. నాకింక ఈ జీవితంలో పెళ్ళికాదనుకున్నాను. నా చేతిలో- మా వంశంలో ఎవరికీ లేనంత గొప్ప రేఖ వుందనేవాడు మా నాన్న. నా ఎడంచెయ్యిని - తన కుడిచెయ్యితో చూసుకుంటూ పోల్చుకుంటూ ప్రతి విత్యం ఆకలు తిని బ్రతికేవాడు—ఆ నల్ల కుర్చీలో కూర్చుని కలలుకంటూ ఆ కలల కథలు - జరిగినట్టే సంబరపడుతూ పరవశించి చెప్పేవారు. ఆయన కథలన్నింటిలో నేనే హీరోయిన్ని. పసితనంలో నాన్న ఏం చెప్పినా దాన్ని త్రికాలసత్యమని నమ్మేదాన్ని. మధ్యలో—హైదరాబాద్ పీడకలలో- అవి కేవలం కలలనీ కట్టుకలలనీ ఏడ్చాను. ఇప్పుడు అవన్నీ — ఆయన చెప్పిన కథలన్నీ— ఆయన నా గురించి కన్న కలలన్నీ నిజం అయ్యాయి - కాని ఒక్కటే బాధ బుచ్చీ-'

'ఈ సమయంలో ఈ పసుపుబట్టలతో బాధల గురించి మాట్లాడగూడదు రేఖా.'

'కాదు బుచ్చీ! అందరిలా మనకు బాజాభజంత్రీలతో పెళ్ళి కాలేదు. నీ కాళ్ళకు పసుపురాసి ఎవరూ పెళ్ళికొడుకును చేయలేదు. నాకు పారాణి రాసి ఎవరూ పెళ్ళికూతుర్ని చేయలా. పురోహితుడు లేడు. పెళ్ళిపెద్దలు లేరు. కల్యాణ మంటపం లేదు. విందులు లేవు. వినోదాలు లేవు.'

'అందుకు బాధపడుతున్నావా రేఖా?'

'బాధపడుతున్నది అందుకు కాదు.'

'మరి?'

'ఈ సమయంలో మా నాన్న....'

'మీ నాన్న?'

'ఆ నల్ల కుర్చీలో—కూర్చుని- మన ఎదురుగా - మన దంపతులపై అక్షింతలు వేస్తే ఎంత బావుండేదా అని బాధ. ఆయన ఏమైనట్లు అనే ప్రశ్న నన్ను- నా గుండెల్ని తడిగుడ్డను పిండినట్లు పిండివేస్తున్నది బుచ్చీ. నాకోసం బ్రతికిన మనిషి- నాకోసం! తలుచుకుంటే భరించలేని భయం. ఆయన్ని గురించి తట్టుకోలేని తపన. ఇది ఆనందమో దుఃఖమో- రెండూ కలిసినా - ఏవి ఎంతో నాకు గుర్తు తెలియడంలేదు.'




ఏవో గుసగుసలు వినిపిస్తున్నాయి రావిచెట్టు పరసన.

అవి గుసగుసలు కావు. రసాల రవ్వలు. వెలుగులేని నిప్పులు.

'లవ్వు మహాత్యం. బిడ్డా!'

'ఏ మహాత్యం?'

'లవ్వయ్యా లవ్వు- L...O...V...E _లవ్వు. నువ్వెంతవరకూ చదువుకున్నావు బ్రహ్మజ్ఞానీ?'

'ఏదో క్లాస్ అనుకో. అయినా నీకంటె రెండు క్లాసులెక్కువేగా?'

'ఈ లవ్వులూ ష్టవ్వులూ మా కాలంలో లేవుస్మా. పిడకల్తో వంట చేస్తుంది మా యింటిది.'

'ఏనాడి ఎంకితో తమరు నడుపుతున్న రాచకార్యమేమిటి? ఎంకి మొగుడు మీద కత్తిపుచ్చుకు తమచుట్టూ ఎందుకు ప్రదక్షిణాలు చేస్తున్నట్టు?'

'ఇన్ని లక్షణాలున్నా ఆ పిడకల కక్కుర్తి ఏమిటయ్యా నీకు? గావ్‌స్టవ్వు కోనుక్కోకూడదూ?'

'పేపర్లో చూశ్నా- ఈ నెల ఆరుగురు చచ్చార్ట గావ్‌స్టవ్ పేలి. ఇద్దరు పెళ్ళాలూ ముగ్గురు మొగుళ్ళూ- ఒక వంటవాడూ ఒక విధవ యంగ్ లేడీ_'

'నీ కాంబినేషను మండా? ఏ సంగతి చెప్పినా ఏదో పురాణం చేస్తావు_ ఇన్నేళ్లొచ్చినా నీకు బుద్ధిమాత్రం రాలేదయ్యా.'

'అదింక ఈ జన్మలో రాదు'

'వస్తున్నాడు అటు చూడు నిప్పులు చెరుగుతూ బుచ్చిగాడి తండ్రి చిట్టిబాబు.'

'మాట చెప్పాలంటే.'

'మవ్వేం చెప్పకర్లా.'

'పిడకలదానిమీద కాచిన ఆ పాల రుచే వేరయ్యా. అరిచేతిమందాన ఎర్రగా కట్టేది మీగడ. నెయ్యి? నూకలకూడులా. దార్లో కాస్తుంటే జంక్షన్‌దాకా పరిమళం వచ్చేది. ఇప్పుడు డైరీకి పోయడంతో ఊళ్ళో చల్లా నెయ్యీ కరువై పోయాయి. ఓ చుట్టియ్యి.'

ఆ పేకాట కాలూకు అయిదుగురు పెద్దమనుషులూ గద్దికోపం మొదలుచాచిన వట్టిపోయిన బర్రెల్లా ఆ నవదంపతుల్ని చూస్తున్నారు.

అయినా— అలాగే స్తంభించిపోయారు ఆ నవదంపతులు.

'ఇటు చూడు బ్రహ్మజ్ఞాని గొడ్డలి పుచ్చుకొస్తున్నాడు చిట్టిబాబు. ఇంకా కొడుకును బ్రతకనీడు.'

'పంతులూ! మనం ఇక్కడనుంచి వెళ్ళిపోవటం మంచిది. ఇవాళ తండ్రి కొడుకునన్నా చంపుతాడు. కొడుకు తండ్రినన్నా చంపుతాడు. జరగబోయేది నాకు తెలుసు. తలలు పగలబోతున్న జాగాలో ఉండటం క్షేమంకాదు. పదండి పోదాం.'

'నువ్వు పోవయ్యా! పిరికిగొడ్డువి. మంచి రంజుగా కళ్ళముందు ఇంత జరుగుతుంటే?'

'ఇవాల్టికి మనం భార్యాభర్తలం. ఆ పెళ్ళిఘడియ ఇప్పుడొచ్చింది.'

'ఇది పెళ్ళికాదురా నా శార్థం' అంటూ కొడుకు జుట్టుపుచ్చుకున్నాడు తండ్రి. లేపుకొచ్చిన ప్రతి ముండా పెళ్ళాం అవుతుందా? దాన్ని బ్రతికుండగా నా గడప తొక్కనివ్వను.'

'అసలు నీ గడప తొక్కడానికి ఎవరు సిద్ధంగా ఉన్నారని?'

తండ్రీకొడుకులిద్దరూ పెనుగులాడుతున్నారు. మానవత్వం నశించింది. ఇంగితజ్ఞానం మంటగలిసింది. పశుత్వం విజృంభించి పడగలెత్తింది. రోష విష ద్వేషాలు— ఆ కుటుంబానికి చిచ్చుపెట్టాయి. తండ్రీకొడుకులిద్దరూ ఒకరికొకరు అనరాని మాటలనుకున్నారు. అంతటి ఘర్షణ వాళ్ళిద్దరిమధ్యా అంతకు ముందెన్నడూ జరగలేదు. చివరకు తనకు రావలసిన ఆస్తివాటా పెట్టమని పట్టుపట్టాడు బుచ్చిగాడు.

'ఇది నీ తాత ముల్లె కాదురా పక్షి! నా స్వార్జితం నీకు చిల్లిగవ్వ కూడా దక్కనివ్వను '

'అంతా నీ స్వార్జితం కాదు బిజినెస్‌లో నేనూ తిరిగాను నువ్వు మూట కట్టిన లాఖాల్లో నాకూ వుంది వాటా '

నీ నాలుక చీల్చేస్తాన్రా కుంకా '

చివరకు కరణంగారు మధ్యవర్తిగా తండ్రీకొడుకులు విడిపోయారు బుచ్చిబాబు బెజవాడ వెళ్ళిపోయాడు. ఆ కోపంలో అంత యుద్ధం జరిగినా చిట్టిబాబు కొడుకు విడిపోవడంతో మానసికంగా క్రుంగిపోయాడు. అంతకు ముందే బ్లడ్ ప్రెషర్ వుంది. ఈ కాకిడి తట్టుకోలేకపోయాడు. ఒక్క నెలలో ఏనుగులాటి మనిషి పీనుగులా అయిపోయాడు. తిన్నది అరగటంలేదు. నిద్ర పట్టటంలేదు. 'యీ జన్మలో నీ ఇంట్లో అడుగుపెట్టనని వెళ్ళిపోయిన కొడుకు అదే పట్టుదలతో వున్నాడు. ఒకనాడు ఉన్నట్టుండి చెర్లో స్నానంచేసివస్తూ రోడ్డు మీద కూలిపోయాడు. ఏలూరునుంచి డాక్టర్ని పిలిపించారు. అది గుండెపోటు తీవ్రంగానే వచ్చింది. ఈలోగా బుచ్చిబాబును తీసుకురావడానికి కరణంగారు బెజవాడ వెళ్ళారు. అప్పటికే కారు కొన్నాడు బుచ్చిబాబు.

'కన్నతండ్రి చావుబ్రతుకులమధ్య నలిగిపోతున్నాడు. ఇంకా కక్షలెందుకు బాబూ' అంటూ హితవుచెప్పాడు కరణంగారు 'నేనూ వస్తానని పట్టుపట్టింది రేఖ.' ముగ్గురూ బయలుదేరారు బుచ్చిబాబు కారు నడుపుతున్నాడు. ఊళ్ళోకి వచ్చి ఇంటిని సమీపిస్తున్న సమయంలో– ఒక లారీ గుద్దుకుంది. కరణంగారికి బాగా గాయాలయ్యాయి. బుచ్చిబాబు అక్కడికక్కడే ప్రాణాలు పోగొట్టుకున్నాడు రేఖకు మాత్రం ఎక్కువ దెబ్బలు తగల్లేదు. కాని తెలివితప్పి పడిపోయింది. చిట్టిబాబుకు మత్తుమందిచ్చారు డాక్టరుగారు.

అంతా క్షణాలమీద జరిగిపోయింది. తలకు కొరివిపెట్టవలసింది కొడుకు కాని చివరకు తండ్రే కన్నకొడుకును మట్టిచేయాల్సివచ్చింది. తండ్రి కళ్ళవెంట నీళ్ళు రాలేదు. కొయ్యబారిపోయాడు. బొమ్మలా - ప్రాణంలేకనే కదులుతున్న ప్రతిమలా కొడుకు అంత్యక్రియలు చేశాడు.

'బిడ్డ వచ్చినవేళా, గొడ్డువచ్చినవేళా అని – ఆ మహాతల్లి వచ్చిన వేళా విశేషం! కొంపకు నిప్పెట్టింది' అన్నారు అందరూ 'ఆస్తి తింటానికి జరిగింది ఈ పెళ్ళి' అన్నాడు చిట్టెబ్బాయి బావమరిది. 'ఇది అసలు పెళ్ళికాదు. బుచ్చిబాబుకు వచ్చిన ఆస్తిలో– రవ్వంత హక్కు కూడా రాజయ్య కూతురికి లేదు. అసలీ గుళ్ళోపెళ్ళి చెల్లదు' అంటూ అరుస్తున్నాడు. చిట్టిబాబు మాత్రం మౌనం వహించాడు. 'గుళ్ళోనే కాదు. ఆ దర్మిలా రిజిస్ట్రాఫీసులో కూడా చేసుకున్నారు పెళ్ళి అంతా లీగలే' అన్నాడు మున్సబు. నిజానికి రిజిస్ట్రాఫీసులో కూడా పెళ్ళి జరిగిన

ఓ అబద్ధం కావాలనే అబద్ధం చెప్పాడు ముష్టిబు రేఖను రక్షించటానికి ఆమె ఆస్తిని కాపాడాడు ఆ వూళ్ళో వుండలేక పెద్దఖర్మ కాగానే బెజవాడకు చేరుకుంది రేఖ

రేఖ!

అదృష్టపు రేఖ లేని రేఖ తండ్రిని పోగొట్టుకుంది తనవాడైన మనిషిని పోగొట్టుకుంది బోలెడు ఆస్తి మిగిలింది ఇరవైమూడేళ్ళ యౌవనం మిగిలింది వెక్కిరిస్తూ గేలిచేస్తున్న దిక్కుమాలిన అందం మిగిలింది ఆస్తి—అందం—వయసూ వుండి—ఏ ఆశా లేని అనాథ ఈనాడు రేఖ మగదిక్కులేని అలాటి అదృష్టవంతురాలిలా కనిపించే దురదృష్టవంతురాల్ని ప్రపంచం క్షమించదు. పాములా పగబడుతుంది

బుచ్చిబాబు చచ్చిపోయాడంటే రేఖకు నమ్మకం కలగటంలేదు అంతా అబద్ధమనిపిస్తున్నది. భగవంతుడు ఎందుకు చేశాడు తనకింత అన్యాయం? తాను చేసిన పాపం ఏమిటి? పాపమే నిజంగా చేసిఉంటే అందుకు పరిష్కారమేమిటి? బుచ్చిబాబు ఎందుకు చచ్చిపోయినట్లు? తాను ఎందుకు బ్రతుకుతున్నట్లు? బ్రతుకును గురించి ఆలోచిస్తున్నకొద్దీ చావు తలుపు తడుతున్నది మృత్యుదేవి నట్టింట్లో నవ్వుతూ నాట్యంచేస్తున్నట్లు గజ్జెలరవ్వళ్ళు వినిపిస్తున్నది పగలు కూడా తలుపులన్నీ వేసుకుని చీకట్లో పడుకుంటున్నది రేఖ చీకటికి చావుకూ మధ్య ఏదో అదృశ్యబంధం పెనవేసుకుంది ఆ మృత్యుదేవత నన్ను కనికరించగూడదూ? ఇగియూరా కౌగలించుకుని చిప్పకొట్టి నిద్రపుచ్చకూడదూ! అనుకుంటున్నది ఒక పదినార్లు వందసార్లు

కాని—

ఆ మహాతల్లి ఎప్పుడు ఎవర్ని కౌగలించుకుంటుందో ఎవరు చెప్పగలరు పుటుక ఎంతటి సృష్టిరహస్యమో చావూ అంతే

చచ్చిపోతే? మరణించినవాళ్ళకు మళ్ళీ జన్మంటుందంటారు జీవులు కొనసాగిస్తున్న మహాయానంలో – ఒక్కొక్క జీవితం ఒక మజిలీ అంటారు—కర్మ అనుభవించటానికే ఈ జన్మంటారు పుటక– చావు– పుటక– చావు– ఇది ఒక అంత్యంతాలు లేని వలయం మృత్యుదేవిని ప్రేయసిగా వర్ణించిన కవులున్నారు చావుచూసిన గౌతముడు తపస్సుచేసి బుద్ధుడై మృత్యువు జయించాడంటారు ఒకళ్ళు చచ్చిపోయినందుకు ఏడవటం అజ్ఞానమంటాడు బుద్ధుడు కాని ఆయన నిజంగా మృత్యువును ఎంతవరకు జయించాడు? ఆ సంగతి ఆ మహాత్ముడికే తెలియాలి మరి ఎంత ఆలోచించినా సమాధానం రాని ప్రశ్నలు సమాధానం లేని సందేహాలు చుట్టూ ఆవరించిన శూన్యంలో ఈ చిక్కుప్రశ్నలు గాక మరేం కనిపించటంలేదు (సశేషం)

Printed and Published by A Chandra Sekar Rao at 5 9 88 Public Garden Road Hyderabad for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road Hyderabad 500 001 Editor A SUDHAKAR RAO

